స్మృతులతాత్పర్యము. స్త్రీస్పర్శము చిత్తవికారనిరాసకమని యిప్పటివారిలో నాగరికులమనఁబడు మహాత్ములయాశయము. ఇది తేజస్తిమిరన్యాయము ననుసరించుచున్నది.

"ఘృతకుంభసమా నారీ తప్తాంగారసమః పుమాన్,
తస్మాద్ఘృతం చ వహ్నిం చ నైకత్ర స్థాపయేద్బుధః."

అని నీతివచనము వినఁబడుచున్నది.

"పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనం,
స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీసందూషణాని షట్. ౧౩
నైతా రూపం ప్రతీక్షంతే నాసాం వయసి సంస్థితిః,
సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే. ౧౪
యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ సంయుజ్యేత యథావిధి,
తాదృగ్గుణా సా భవతి సముద్రేణేవ నిమ్నగా. ౨౨
వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతాం,
సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే. ౩౦
యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే,
తాదృగ్రోహతి తత్తస్మిన్ బీజం స్వైర్వ్యంజితైర్గుణైః. ౩౬
భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యాయా గురుపత్న్యనుజస్య సా,
యవీయసస్తు యా భార్యా స్నుషా జ్యేష్ఠస్య సా స్మృతా. ౫౭
జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియం,
పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది." ౫౮

మను. ౯ అధ్యా.

ఈవాక్యములం దిలకించినచో సదాచార మెద్ది యని తేటపడి యెడిని. పరగృహవాసము స్వప్నమునందును బనికిరాదన నర్థ మేమి? పతివిరహము పాపకార్యమనఁ దాత్పర్య మేమి? ఎట్టి

గుణముగలవానిం బెండ్లియాడిన నట్టి గుణముగలదియే యా నారి యగుననఁగా భావమేమి? తమ్మునిభార్య యన్నకుఁ గోడ లగును. అన్నభార్య తమ్మునకు గురుపత్నివంటి దగుననఁగా నాశయ మేమి? దీనిసార మేమనఁగా పరపురుషస్పర్శనసల్లా పాదులు పనికిరావనియు స్త్రీలచిత్తము చపలమగుట నెవరితో సల్లాపములు సాగించినఁ దదనురూపప్రవృత్తి గలవారగుదు రనియుఁ గావున నట్టివి పొసఁగుట యనర్థావహము కనుక వాని మానవలయుననియే దీని సారము. ఇవి కేవలార్థవాదము లనుటకంటెఁ దెలివితక్కువప్రసంగము వేఱొకటి యుండదు. సదాచారములు పనికిరావనియు స్త్రీపురుషులు కలిసి యుండి ననే మహాలాభములు కలుగుననియు వారివారిస్వేచ్ఛ నరికట్ట రాదనియు వాదించు మహాత్ములప్రసంగముల మన మెన్న నేల? అవియన్నియు నత్యంతదుష్టములే యనక వేఱొకమాట పలుక వలనుపడదు. ఈవిషయము నీరామాయణమే చాటుచున్నది. జనకునిచేతికి దశరథుఁడు కోడలికొఱకు కొకశిరోభార్య మగు రత్నము నొసంగ నతఁడు తా నద్దానిఁ గొమరితయుత్త మాంగమున నునుపక భార్యచేతి కొసంగెను. ఆమె దానిని సీతతలలో నుంచెను. అని సీత తెలుపుచు దీనిని శ్రీరాముఁడు చూడఁగనే మామువ్వరను స్మరించునని తెలిపెను. అనఁగా నిది వివాహకాలమున నీఁబడినదని దానినే నేను బంపితినని యెఱింగి నీమాటలను విశ్వసించునని సీతాహృదయము. నీ భక్తుఁడగు నీతనికి నాకుఁ బ్రీతిని గలిగించురత్నము ననుగ్ర హించితిని. ఈతఁడు వరగ్రహణసమర్థుఁడు, విశ్వాసపాత్రుఁడు నని తెలియఁజేసెనని సారము.

"త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ,
హనుమన్ యత్నమాస్థాయ దుఃఖక్షయకరో భవ. ౮
తస్య చింతయతో యత్నో దుఃఖక్షయకరో భవేత్."

అని మూలము. ఈ కార్యసంఘటనమునందు నీవే ప్రామాణి కుఁడవు. అనఁగా నీమూలమున నీకార్యము ఫలించినదని కీర్తి నీకు రాఁగలయునని నీప్రాక్కర్మము తెలుపుచున్నదని భావము. కావున నీతలపైఁబడిన యీకార్యమును సాధించి దుఃఖక్షయ కరుఁడవు కమ్ము. దుఃఖక్షయము చేయుమనగా అనఁగా దుఃఖము నశింపఁజేయువాఁడవు కమ్మనియేఁ గదా. దుఃఖము క్షయింపఁ జేయువాఁడు భగవంతుఁడే. తక్కినవారు సాధనభూతులు. ఎవరిదుఃఖ మిది? రావణాసురుఁడు చిరకాలముగా శ్రీరా మునిచే మృతి యెప్పుడుగల్గునా యని పరితపించుచున్నవాఁడు. కావున నతనిదుఃఖమును శాంతింపఁజేయుము. అనఁగా నీవు ప్రోత్సహింప శ్రీరాముఁ డరుదెంచి రావణుని వధించును. దాన నాతనివాంఛ ఫలించును అదియే "దుఃఖక్షయకరో భవేత్" అన్నదానఁ గల రహస్యము.

"జీవంతీం మాం యథా రామస్సంభావయతి కీర్తిమాన్,
తత్తథా హనుమన్వాచ్యం వాచాధర్మమవాప్నుహి. ౧౦
నిత్యముత్సాహయుక్తాశ్చ వాచశ్శ్రుత్వా త్వయేరితాః,
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మదవాప్తయే. ౧౧
మత్సందేశయుతా వాచ స్త్వత్తశ్శ్రుత్వైవ రాఘవః,
పరాక్రమవిధిం వీరో విధివత్సంవిధాస్యతి." ౧౨

అని మూలము. ఇందలివిశేషార్థ మెద్ది? "కీర్తిమాన్ పౌరుషా ర్జితా కీర్తిః" అన్న సూక్తిచొప్పునఁ బురుషదేహధారణమున

నార్జించిన కీర్తిగలవాఁడని భావము. సగుణబ్రహ్మమని హృదయము. సగుణబ్రహ్మమగు శ్రీరాముఁడు మాం జీవంతీం యథా సంభావయతి=బదనికనుగా నన్ను నెట్లు నమ్మునో యట్లు వాచ్యం=చెప్పఁదగినది. బదనిక యనఁగా నొకలతావిశేషము. అది వృక్షముగ నుండుటయుఁ గలదు. ఒకచెట్టుకొమ్మయం దది మొలుచును. అది పుట్టగనే యాకొమ్మ క్రమముగా క్షీణించును. దానికే బదనిక యని పేరు. అది యెన్నియోకార్యములకుఁ బనికివచ్చును. ఆశ్రయించి దానిని సకాలమునఁ దెచ్చి యింట నునుచుకొనుదురు. ఒక్కొక్కచెట్టునఁ బుట్టిన దొక్కొక్కపనికిఁ బనికివచ్చును. నన్ను బదనికఁగా శ్రీరాముఁ డెఱుంగునట్లు చెప్పుమనఁగా భావ మేమి ? ఇపు డెందున్నానో యద్దాని నశింపఁజేయుదునని యందులకు నిమిత్తముగా నీవరు దెంచినం జాలుననియే గాక మఱేమి ? భక్తియుక్తి నన్నెవరు గొనిపోవుదురో యనఁగా మనస్సుల నిలుపుకొందురో వారికాయాయిఫలములు గలుగుననియు దీనిసారము గాక మఱేమియు గాదు. మూలికలు లోనగువానిని విధివిహితకాలమునఁ బూజించి రహస్యముగాఁ దేవలయునుగాని యిష్టానుసారముగాఁ దెచ్చిన భారవహనఫలమే గాని మఱే శుభఫలములు గలుగవు. సరికదా దుష్ఫలములు మాత్రము వదలవు. అట్లే విధిననుసరించి శిష్యునియోగ్యతను గుఱితించి తదనురూపమగుమంత్ర ముపదేశింపక ధనదాసులై కపటయోగివేషముల నెల్లరకు మంత్రముల నుపదేశించి మోసగించి వారి విత్తము నపహరించి తమ సంతతివారల కొసంగు కపటనాటకసూత్రధారులమూలమున శిష్యులకు హృత్తాపమే కల్గును

గాని వేఱొకశుభ ఫలము కలుగఁబోదని విధులు ఘోషించు చున్నవి.

"నిత్య ముత్సాహయుక్తాశ్చ" అనుశ్లోకమునఁ గలవిశేష మేమనఁగా సాధుమతులు ఇతరులకు బోధచేయఁ బూని నప్పుడు నిరంతరోత్సాహము కలుగఁ బలుకవలయుననియు దానిచే వారు లేనిశక్తి గలిగి సత్కార్యములు చేయఁ బూనుదురనియు భావము తేలెడిని. దుర్విషయములను సాధు వులు బోధింపరు గాన సద్విషయముననే యీనీతి వర్తించునని యెఱుంగందగు.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయా దేషధర్మస్సనాతనః. ౧౩౮
భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ." ౧౩౯
మను. ४ అ.

"మత్సందేశయుతా వాచః" అనుచోఁ గల సార మేమి? ఆంజనేయా! నాసందేశముతోడిమాటలు నీవలన వినియే శ్రీరాముఁడు పరాక్రమము నెఱపునట్టికార్యమును విధిననుస రించి చేయఁగలఁడు. అని కదా జానకి తెలిపెను. అనఁగా నాయీపలుకులఁ గలసార మెఱుంగఁ గలవాఁడు శ్రీరా ముఁడు. నాభావ మెఱింగియే తదుక్తప్రకార మెప్పు డెవ్విధ మున నేపని చేయవలయునో, ఎవరిచే నెట్లు చేయింపవల యునో నిశ్చయించుకొనును. నాయాశయముం గొనక యేదియుఁ జేయఁజాలఁడని దీనిహృదయము. ప్రకృతిపురుషు లేకరీతి నూహించువారు. ఊహించి పురుషుఁ డూరకుండును.

తదిచ్ఛాశక్తి కావునఁ బ్రకృతి తత్సాన్నిధ్యమున నేకార్యము నైనఁ జేయఁజాలును. తత్సాన్నిధ్యము లేనిచోఁ జేయఁజాల దనువాదము తెలివిలేక వచ్చినది కాని యితరము కాదు. అవినాభావసంబంధము వారికింగలదని శాస్త్రములు ఘోషించు చుండ వారికి వియోగమెట్లు? లోకదృష్టిచే నది యున్నట్లు తోఁచును. పారమార్థికదృష్టి కది యసాధ్యమనియే తోఁచును. ఇదియే శాక్తసిద్ధాంతము.

"అప్యర్కమపి పర్జన్యమపి వైవస్వతం యమమ్,
స హి సోఢుం రణే శక్తస్తవ హేతోర్విశేషతః. ౧౬
స హి సాగరపర్యంతాం మహీం శాసితుమీహతే,
త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనందిని." ౧౭

అని మూలము. ఈశ్లోకద్వయము పైనవ్రాసినభావమును సిద్ధాంతము చేయుచున్నది. "తవ హేతోర్విశేషతస్స రామః రణే అర్కం యమం వా స సోఢుం శక్తః" అనఁగా భావమేమి? జానకీ! ఎట్టివానినైన నీనిమిత్తమున నీయావేశమునఁ గలుగు శరీరమున నోర్వఁగలఁడు. అదిలేకున్న నరూపుఁ డగును. శ్రీరాముఁడు సాగరప్రాసాదమగు భూమండలమును బాలింప నీనిమిత్తముననే కోరుచున్నాఁడు. రామునిజయము నీనిమిత్త మునఁ గలుగునదియే. నీయిష్టము ననుసరించి ప్రవృత్తిమార్గ మునఁ జరించుఁగాని లేకున్న నానందరూపమునసుండి నిర్గుణుఁ డనంబరఁగుననియే కాని వేఱొక్కఁడు న్యాయ్యమైనది యొదవదని బుద్ధిమంతు లెఱుంగుదురు గాక. ఈసిద్ధాంతమునకే శాక్తమని పేరుగాని మధ్వవైష్ణవులవలెఁ బ్రాగితిరుగు మూర్ఖుల సిద్ధాంతమునకుఁ గాదని యెఱుంగునది.

"యది వా మన్యసే వీర వసైకాహ మరిందమ,
కస్మింశ్చిత్సంవృతే దేశే విశ్రాంతశ్శ్వో గమిష్యసి. ౨౦
మమ చేదల్పభాగ్యాయాస్సాన్నిధ్యాత్తవ వానర,
అస్య శోకస్య మహతో ముహూర్తం మోక్షణం భవేత్." ౨౧

అని మూలము. హనుమంతునిపయనము మఱుదినము పగలు కాఁదగియున్నది. రాఁగల ఫలములనెఱింగి జానకి పలుకుచున్నది. ఏకాహమ్మనఁగా నొకపూట యని యర్థము. ఈసంభాషణము రాత్రి ద్వితీయభాగమునఁ గదా. మఱుదినముపగలు హనుమ సాగరము దాఁటఁగలఁడు. యుద్ధము రాఁగలదని యెఱింగియే సీత అరిందమ యనువిశేషణమును హనుమ కిచ్చినది. అరిమర్దనుఁడ వగుము. రేపుపగలు పొమ్ము. ఒకానొక ప్రదేశమున. అది యెట్టిది ? సంవృతము. తరులతామంటపాది పిహితము. అనఁగా నుద్యానమునని భావము. తరులతావిశేషములు గల యుద్యానమునకుం బొమ్ము. అందువైరుల జయింపుము. విశ్రాంతుఁడ వగుము. అనఁగా యుద్ధమును జాలించి యించుక విశ్రాంతి నొంది యనఁగా రావణునితో మాటలాడి పోదువు. అల్పభాగ్యాయాః=రాముని నెడలి యిందున్నట్లుగదా కనఁబడు చున్నాను. పూర్ణభాగ్యము లేదని భావము అట్టి నాకు తవ సాన్నిధ్యాత్=నీవు సమీపమున నుండుటవలన నించుక యూఱట గలుగును నిన్ను నవాప్తకామునిగాఁ జేయుట కిది సమయము కాదు. ఇదియొక ఛాయాశరీరము. నీవు నాచెంత ననఁగా లంకానగరోద్యానమున రావణు కొలువుకూటమున నుండినముహూర్తము కల్పితశోకమునకు ముక్తి కలుగును. నీచేఁ జావఁదగినవారు చావఁగా నీపౌరుషము నాలకించి

సుంత యానందింతును. అని జానకి తెలుపుచున్నది. హనుమకుఁ దనయంతనే వనభంగమున సంకల్పము కలుగలేదనియుఁ బ్రకృతి తలంపుననే కలిగినదనియుఁ గర్మఫలముల ననుభవింపఁ గలప్రాణు లందుండుటం జేసి యామె యెఱింగియే యతని నుద్బోధించెననియు మన కీభాగము తెలుపుచున్నది.

"రామాద్విశిష్టః కోఽన్యోఽస్తి కశ్చిత్సౌమిత్రిణా సమః,
అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ." ౫౩

అని మూలము. రామునికంటె నధికుఁడు లేఁడు. లక్ష్మణునకు సమానుఁడు లేఁడు. అగ్నివాయువులతో సమానులగువారు నీయొక్క యాశ్రయముకలవారు. అనఁగా నీయాధారమున వారు వెలుంగుదురని భావము. నీయాధారములేనిచో రూపవిహీను లగుదురని సారము. ఇఁకఁ దర్వాతికథ నరయుదము.

## హనుమంతుఁడు సీతయనుమతిచేఁ బయనమగుట.

* అంత నాజానకి హనుమదుక్తుల నాలకించి హితముగా నతనితో వత్సా! ప్రియవార్తలఁ దెల్పిన నిన్నుఁ జూచుట వలన వాన కురియుటం జేసి సగము మొలిచినవిత్తనములు సంపూర్ణముగా మొలిచినట్లు నాకు సగముకార్య మొనఁ గూడెఁ గదా యని యానందించుచున్నాను. శ్రీరాముని స్పృశించుభాగ్యము నాకుఁ గలుగఁజేయుము. పావనీ! కాకాసురవృత్తాంత మొకయానవాలుగాఁ జెప్పితిఁ గదా. మఱొకగుఱుతుఁ జెప్పెద. వినుము. అని రాము నుద్దేశించి

* ఇది నలువదవసర్గమునఁ గలకథ.

శ్రీరామచంద్రా! ఒకనాఁడు నాఫాలమునఁ గలతిలకము మాసి పోవఁగా నీవు మణిసిలను దిలకముగాఁ జెక్కిటం బెట్టితివి. దానిం దలంచుకొనుము. మహావీర్యశాలివగు నీవు రావణాపహృతనై యుండు నన్నుఁ జూడరా కం దెట్లున్నావు? మహామణివరమగు చూడామణిని జాగ్రత్తతోఁ గాపాడితిని. నాకు దుర్వారదుఃఖము కలిగినపు డాచూడామణిని జూచి నిన్నుఁ గాంచినట్లే సంతోషించుదానను. రత్నాకరసంభవమగు నా చూడామణినింగూడ నీకొఱ కిపుడు పంపితిని. ఇంచుక యూఱటగలిగించు నాచూడామణియు లేదు గాన నిఁక శోకవిహ్వలచిత్తనగు నే జీవింపఁజాలను. జీవించియేయున్న నెట్టైన నిన్నుఁ గలిసికొనఁ గలనన్నవిశ్వాసమున నన్నిదుఃఖముల భరించియున్నదానను. శత్రుహంతవు కదా నీవని నమ్మి యెట్లే నొకనెల జీవించియుండఁ గల్గుదు. నెలమీఁద నొకక్షణమైన నిన్ను వదలి మనియుండఁజాలను. దురాత్ముని రావణుని జూచు నామనస్సునకు నూఱట గలుగ లేదు. నావలె నీవును దుఃఖపడుచున్న వాఁడవని విన్నాను. అని రామునిం బేర్కొని మిగుల వగచెను

జాలిగలిగించు నామాటల విని హనుమంతుఁడు తల్లీ! శోకవేగమున నేమియుం దోఁచక రామమూర్తి కార్యవిముఖుఁడై యున్నవాఁడు. లక్ష్మణుఁ డన్నను గని మఱింత వగచుచున్నాఁడు. నాయదృష్టమున నిన్నుఁ గంటిని. ఇపుడు సంతోషింపఁ గాలము కాని దుఃఖింపఁ గాలము కాదు. క్షణమాత్రమున నీకష్టములు గట్టెక్కును ఆయన్నదమ్ము లిరువురు నిన్నుఁ జూడ నువ్విళ్లూరుచు లంకను భస్మప్రాయముగాఁ జేయఁగలరు.

వారాలమున సర్వరక్షస్సంహారము గావించి నిన్నయోధ్యా నగరమునకుఁ దోడుకొని పోవుదురు. తల్లీ! యింకను దేని నిచ్చిన శ్రీరాముఁ డెఱుఁగునో యట్టిగుఱుతు మఱొకదాని నిమ్ము. అనఁగానే సీత హనుమం దిలకించి వీరాగ్రణీ! మంచి యానవా లిచ్చితిని. నానెఱికురులకు మిక్కిలి యలంకారముగ నున్న యాచూడామణిని జూడఁగనే శ్రీరామునకు నీమాట యందు విశ్వాసము కలుగును.

అనఁగా నాపావని యాచూడామణిం దిలకించి సీతాం బకు మ్రొక్కి పయనము చేయఁగోరెను. సముద్రము దాఁటి యవ్వలిదరిఁజేర నాకసంబున కెగుర నుత్సహించుచు దేహము నద్దాని కనుగుణముగాఁ బెంచుచు నురవడించుచుండఁగాఁ గాంచి సీత నగచుచు డగ్గుత్తికతో హనుమంతా! సింహాసంకాశు లగు నారాఘవులకు సుగ్రీవాదులకు నేను గుశలముగా నున్నానని చెప్పుము. నాదుఃఖమును బాపునట్టు లాశ్రీరాఘ వునకుఁ దగువిధమునఁ జెప్పవలయుఁ జుమీ. నీవారామ భద్రుని దర్శింపఁగనే నాయీదుఃఖము రాక్షసులచర్యలు వివ రించి దగ్గరఁ గూరుచుండి చెప్పుము. నీకు మార్గము సుఖమగుం గాక అనియె. హనుమయు నాజనని యిడినయానవాలును గైకొని ధన్యుఁడై పట్టరానిసంతోషము నొంది యింక నేఁ జేయఁదగినది కొలఁదియే యని యూహించి మనసున నుదీచికిం బోవఁ దలంచెను.

ఆర్యులారా! యీభాగమునఁ గలవిశేషములఁ బరికిం తము.

"ఏష చూడామణిర్దివ్యో మయా సుపరిరక్షితః,
ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వామివానఘ. ౭
ఏష నిర్యాతితశ్శ్రీమాన్ మయా తే వారిసంభవః,
అతః పరం న శక్ష్యామి జీవితుం శోకలాలసా." ౮

అని మూలము. కొన్ని మణులు శిరోధార్యములు. కొన్ని శ్రోత్రకంఠాదిభాగధార్యములు నని స్కాందపురాణము తెల్పుచున్నది. వారముల ననుసరించి కొన్ని స్త్రీపురుషులకు ధార్యములు కలవని తేలెడిని. "ఆదిత్యస్య తు పుష్యరాగమ్" అని. వజ్ర మొక్కటియే ధరింపరాదనియు మఱొక జాతిరత్న ము కూడ నేదో యొక యాభరణమున నుండవలయుననియు విధులు కలవు రత్నములు కొన్ని ఖనిజములు మఱికొన్ని జలజములు నై యుండు. రత్నాకరమను పే రద్దానింబట్టియే కలిగెను. జీవమణులని కొన్ని మణులు కలవు. జీవమును నిలుపు నవి యని దానియర్థము. అట్టిరత్నములు ధరించినవా రారోగ్యవంతులై చిరకాలము బ్రదుకుదురని శాస్త్రము లుద్ఘోషించెడిని. ఫ్రాన్సుదేశమున నిపుడొక పురుషవర్యుఁ డున్నవాఁడనియు నూటయేఁబదియేండ్లనుండి యతఁ డున్న వాఁడనియు నప్పటినుండి నేటిదనుకఁ బ్రఖ్యాతపురుషుల నతఁ డెఱుఁగుననియు నామహనీయు నేఁబదియేండ్లక్రిందఁ జూచిన వా రపుడుకూడ నిట్లే యున్నవాఁడని చెప్పుచున్నవారనియుఁ బుస్తకమునందుఁ జదువఁ గల్గితిమి. ఇపుడొకఁ డతనియాశ్ర యించి తదీయశక్తి గ్రహణపరతంత్రుఁడుగ నున్నవాఁడనియుఁ దెలియనయ్యెడిని. ఆతని కవచములకు వజ్రపుగుండీ లుండు నఁట. దానిజేబునందు వజ్రపుఁబోడు లుండునఁట. ఇవియ కనఁ

బడునట్టి గుఱుతులు. మనశ్శక్తి యెట్టిదో యెవ రెఱుంగఁ గలరు. రత్నములకు జీవమణు లనుపే రున్నది. లేనిశక్తి గల వస్తువు నట్టిశక్తిగలదానినిగా నెవరు వర్ణింపరు. నీలము తృణమునాకర్షించుట మనము చూచుచున్నాము. వైడూర్యము మఱికొన్నియు విషమును మ్రింగి దాని నిర్వీర్యముగ నొన రించుట పరికించుచున్నారము. పూర్వము రాజగృహముల యందు భోజనపాత్రములయం దొక్కజాతిరత్నము పొదుగఁ బడియుండుననియు దానియం దీపదార్థమే యునుపవలయునను నియమము చేయఁబడుననియు నందేకృత్రిమవిషమున్నను నిర్వీర్యముగ నగుననియు వినుచున్నారము. ముండ్లగరుడ యను మృగ మొకఁడు గలదు. పొట్టిగ నది యుండు. ఉలూఖ మును (ఱోలును) బోలి యది యుండును. దాని ముక్కు రంధ్రము లగ్నిజ్వాలలవలె నుండును. అది రాత్రులయందుఁ బురుగులఁ దినఁబోవుచుండును. దానింగొట్టి యూపిరి వెడలక ముందా ముక్కురంధ్రములఁ గలమణులఁ దీయవలయు. అవి యగ్నికణములం బోలి చింతగింజలంత యుండును ఆజంతువు చావఁగా నవియు రంగుమాఱి నల్లగా నుండును. వానినెట్టి దుర్భరవిషసర్పము కఱచినను ఆచోట నంటించిన నొకక్షణ మున దానిం బీల్చి క్రిందఁ బడును. వెంటనే దాని నీట నునుప వలయును. ఆనీరు పచ్చగా నుండును. చేదుగా నుండును. ఆ రత్నమునకు గరుడరత్నమని పేరని యందురు. నేనొక్క యేనాదివానికడ దీనిం జూచితిని. పరిశీలించితిని. శతరూప్యము లడిగెను. నిస్వుఁడఁ గాన నీఁజాలకపోతిని. ఈమృగములు శేషాచలమునఁ గలవని వారివలననే విన్నాఁడను విషహారణ

శక్తి యున్నపుడు రోగహరణశక్తియు నుండును. మనశ్శక్తిని గల్గించుశక్తియు నుండును. లతావిశేషములకువలె రత్నవిశేషముల కనేకశక్తులు గలవని నమ్మకపోరాదు. శరీరదౌర్బల్యమును బోఁగొట్టి ముదుసలితనమును దూలించి శరీరము నారోగ్యదశయం దునుచు మహౌషధీప్రయోగములు మహాత్ములచే సాగింపఁబడుచున్నయట్లు వినుచుఁ జదువుచు నున్నారము. కదా. లతారత్నాదులశక్తి యత్యద్భుతము ననుపమానము నవిజ్ఞేయము నగునని యెఱుంగకయుండుట మౌర్ఖ్యము గాక మఱే మగును? జలములఁ బుట్టినరత్నము గాన జీవమణి యనఁదగు నొకరత్నము సీతాదేవికడ నున్నది. దానిశక్తిచేతనే పదినెలలు సీతాదేవి క్షుత్తృష్ణలు బాధింపకయుండ నుండెను. అద్దానినే హనుమంతునకు శ్రీరామునకుం జూపఁదగు నానవాలుగా నిచ్చెను. కనుకనే చాలకాలము జీవింపఁజాలనని తెలిపెను.

ఆర్యులారా! కాలము సాగినకొలఁది వస్తువివేచనము నశించుచున్నది. దైవభక్తి యడుగంటి నామమాత్రావశిష్టమై యుండునట్లే యదియు నున్నది. తెలియనివస్తువుల భక్షించి యారోగ్యప్రదములే యవి యని యెగిరిపడునట్లే వస్తువులందు శక్తిలేదని తెలిసికొన నుంకింపకయున్నారము. కుష్ఠాదిరోగములు సూర్యసమారాధనమున నశించుమంత్రము లుద్ఘోషించుచుండఁగా వానిని జప్పరించుచు వస్తుసంయోగ మిట్టిదని యెఱుంగనివస్తువుల మహాదరమున భక్షించుచు వానిమూలమున రోగధనముల నార్జించుచు రోగనివృత్తి యగుచున్నదని భావించుచున్నారము. ఇన్నింటికిఁ గారణము దైవభక్తి నశిం

చుటయే కాని వేఱుగాదు. ఇఁకనైన నీయజ్ఞాననిద్రనుండి మేలుకాంచి యోగవిద్య నభ్యసించి యుపాసకులమై మంత్ర సిద్ధులం బడసి యణిమాదిసిద్ధులకై ప్రయత్నించుచు శక్యము లను బొందుచు నశక్యములను బొందఁ బ్రయత్నించుచుఁ జిరకాలము జీవింపఁ దోఁచుపడు మూలికాసిద్ధిని బడయఁ బ్రయత్నించుట కర్తవ్యము గాని స్వార్థైకతత్పరులయ్యుఁ బరహితైకమతులభంగి సంచరించు కుటిలాత్మకులఁపొందు మానకుండు టుత్తమము కాదు. ఇప్పటికి నెందో విరళ ముగా మూలికాసిద్ధిఁ బడయువిధులఁ దెల్పువా రున్నారు. వారు నశింపకయుండ నావిద్యను నిలుపఁ బ్రయత్నింపవల యును. జగద్ధితమునకు మనశ్శక్తి ప్రధానముగాని వాగాడం బరము నిరర్థకము. కావున మనశ్శక్తి యలవఱచుకొనుటకు మూలము భగవద్భక్తి దానిని బోఁగొట్టుకొనుటకంటెఁ బాప కార్యము వేఱొండు లేదు. ఈ విషయమునకంతటికి హేతువు సీతావాక్యమే యని యెఱుంగవలయును. ధనవంతులు కృత్రి మరత్నముల పాలుగాక సన్మణులను శాస్త్రమెఱింగి వాని మూలమున దీర్ఘాయురారోగ్యముల నొందవలయును. నిర్ధ నులు మూలికాదులమూలమున నష్టైఫలముల నొందవలయు నని కోరుటకు నాకీ పరమేశ్వరీవాక్యమే యాధారమని విన్న వించెదను.

"తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రావరిందమౌ,

త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః." ౧౫

అని మూలము. లోపలవ్రాసిన ప్రకృతిప్రాధాన్యము నిది దృఢ పఱచెడిని. పురుషపుంగవులు శత్రుసూదనులు రాజపుత్రులు

నగు నారామలక్ష్మణు లిరువురును "త్వద్దర్శనకృతోత్సాహౌ." నీ దర్శనముచేఁ బొడమునుత్సాహము గలవారలై లంకను గాల్తు రని కదా హనుమ పల్కెను. దైవవశమున నాతనినోటనుండి యీవాక్కు వెడలెను. ప్రకృతిదర్శనము లేక భగవంతున కెట్లు కార్యకరణమున నుత్సాహము కల్గును? శక్తియోగ మునఁ బురుషుఁడు రూపవంతుఁ డగునను సూక్తికిది యుదా హరణము కాదా సీతామనోవాంఛితము శ్రీరామచంద్రు నిర్గుణత్వమును బాపి సగుణునిగా నొనరింపఁ జాలెను. ఒకరిని వదలి యింకొక రేపని నొనరింపఁ జాలరనువాదమే తత్త్వము. దాని కిది యాదిమభాగ మనుకొనందగు. లోకమునందును గాంతాదర్శనముననే యుత్సాహ మతిశయించునని వినుచు న్నారము గదా. అద్దాని ననుసరించియే యిదియుఁ గలిగె ననుకొనుట యత్యుత్తమము.

"ఇమం చ తీవ్రం మమ శోకవేగం రక్షోభిరేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గతస్సమీపం శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర." ౨౮

అని మూలము. ఇది యాశీర్వాదరూపమంగళము. నీమార్గము శుభమగుఁ గాక. త్రోవయం దేబాధలు గలుగకయుండ సుఖ ముగా లక్ష్యమును జేరుదువు గాక యని జానకి దీవించెను. నీమార్గమనఁగా నీ తలంపని భావము. అది శుభమగుఁ గాక యనఁగాఁ బవిత్రమగుఁ గాక. బ్రహ్మాస్త్రము నిన్ను బంధిం పఁగా దానిని వందనపూజచే సంతృప్తినొందించి యాబంధ నము వదలఁగా మరల నింద్రజిత్తుతో యుద్ధముసేయుసంక ల్పము కలుగక సాధుసంకల్పము కలుగుఁగాక యనుభావ మిట సూచితము. సాధుభావ మనఁగా రావణసందర్శనము

హితబోధము ననునివియే శుభకార్యములు. లేనిచో నీ కార్యము మంగళము కాజాలదని సీతయాశయము. జానకి తలంపులేని కార్యమేదియు జరగదనుటయే దీని సారము. మనశ్శక్తి తదధీనమే కదా.

"మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః."

అను గీతావాక్యు దీనినే తెలుపును. ప్రకృత్యతీతుఁడు పరమాత్మ యొకఁడే గదా. ఈయర్థమే గ్రహింపఁదగినది.

"స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః కపిః కృతార్థః పరిహృష్టచేతాః,
అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం దిశం హ్యుదీచీం మనసా జగామ."
౨౫

అని మూలము. జానకీదేవి కార్యము తెలుంగు వెల్లడిచేయఁగా హనుమ కృతార్థుఁ డయ్యెను. అనఁగా నర్థమేమి? ఇఁక నా పూనినకార్యము నెఱవేఱు ననునిశ్చయము కలవాఁ డయ్యె నని కదా భావము. పరిహృష్టచేతాః = సంతోషితస్వాంతుం డయ్యెను. అక్కారణమున అల్పావశేషం కార్యం ప్రసమీక్ష్య=తాఁ జేయఁదగినకార్యము కొంచెమే మిగిలియున్న దని యెంచెనని భావము. అనఁగాఁ బరమేశ్వరీసందర్శనమే సకలశ్రమములకు ఫలము. కాఁబట్టి యిఁకఁ జేయఁదగినది మహాకార్యమయ్యు సీతాసందర్శనమునఁ గలమహాసంతోషమున నల్పముగా నతనికిం దోఁచినది. భగవత్సహాయము గలదని తోఁచునే నెంతటికార్యమైనఁ బరమాణువువంటి దగును గదా. "దిశం హ్యుదీచీం మనసా జగామ" ఉత్తరదిక్కును మనస్సునఁ బోయెను. శ్రీరామసాన్నిధ్యమునందు మనస్సును జేర్చెనని భావము. ఇఁక వేగముగాఁ బోవవలయునని తలంచె

నని హృదయము. మనశ్శక్తి నుపయోగించెనని సారము. లోక మున సాధువులు తాము చేయఁబూనిన పనిని మనస్సునఁ జక్కనాలోచించి తనమనశ్శక్తి నుపయోగించి నిశ్చయింతురు. ఆకార్యము తప్పక నెఱవేఱును. మనశ్శక్తి లేనివారితలంపులు ఫలింపవని యెఱుంగవలయు. కర్మము ననుసరించి కదా కార్యములు ఫలించునని ముందు వ్రాసినది నిష్ఫలమా యని ప్రశ్నింపరాదు. కర్మఫలమే మనశ్శక్తి యని గ్రహించిన నీ శంక యుదయింపదనునదియే సమాధానము. సీతాదర్శనము తద్ధితోపదేశము, తదాశీర్వాదములు హనుమంతుని భావి కార్యనిశ్చయస్వాంతునిగా నొనర్పఁజాలినవనియుఁ,బురుషుఁడు కార్యకరణదక్షుఁడు కాఁడనియుఁ, గర్మవశంవదుఁడనియు, నహంకారమునఁ దానే కర్త ననుకొనుననియు, నది వదలుటకే భగవదుపాసన యనియు, నది యొదవనిచో వేదాంతశ్రవణాదులు సత్ఫలముల నీఁజాలవనియు, నీ యంశము లన్నియు హనుమంతునిచరిత్రమునుండి తేలుననియు, నీసర్గమునఁ గల సారము. రాఁగలఫలముల కనువగురీతి నూహలు కలుగునని యైన మనము నిశ్చయించుకొనినచోఁ గొంత యహంకారము తగ్గును.

> "యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
> మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అన్న భగవద్వాక్యమే శరణము. కర్మసిద్ధాంత మెఱింగి వర్తించిన మేలు గలుగునుగాని లేనిచో నహంకారము పెంపొందుట తప్ప వేఱొండుఫలములు గలుగవని మనము నిశ్చ

యించుకొనవలయుననియే పై గీతావాక్యసారము. ఇంకఁ దరు వాతివృత్తాంత మెఱుంగఁ గడంగుదము.

## హనుమంతుఁ డశోకవనభంగము చేయుట.

* సీతాదేవి మేటివాక్కులఁ దన్ను వినుతింపఁగా నాపావని పయనము చేయఁగోరినవాఁడై సెలవంది యవ్వలికిం బోయి సీతాదర్శనము రావణనివాసదర్శనముఁ గోరివచ్చితిఁ గదా. అందుఁ బ్రధానము సీతాదేవీసందర్శనము. అది ఫలించి నది. రావణహృదయ మెఱుంగుట మొదలగునవి స్వల్పకార్యములే మిగిలియున్నవి. వీనివిషయమున నాల్గవదగు దండోపాయమే సుసాధనముగాఁ గనఁబడుచున్నది. రక్కసులు శత్రులు కాన సత్ప్రవర్తనము గలవారు కారు. కుత్సితుల యెడ సామోపాయము నిష్ఫలము. ధనమత్తులయందు దానము ఫలింపదు గదా. అసామాన్యుఁ డగు రావణుని భేదమున సాధింప వలనుపడదు. ఇంక దండోపాయమునకు నాధారము పరాక్రమము. అదియే నాకిపుడు సమ్మతముగ నున్నది. పరాక్రమమునఁ దప్ప నిప్పని సాధ్యమే కాదు. ఉపాయాంతరము నాకెంతమాత్రము కనఁబడకయున్నది. నే నిపు డని నొనరించి కొందఱ రక్కసుల నుక్కడంచితినేని తక్కినవా రించుకంత మెత్తఁదనము నూని శత్రుత్వమునుండి విరమింతురు. ఏదూత ప్రభువు తనకొకపని చెప్పి పంపఁగా దానిని నెఱవేర్చి దానికి విరోధము లేకుండ నితరకార్యములం గూడ సాధించునో వాఁడే కార్యదక్షుఁ డగుదూత యనంబడు. కార్య మల్పమైన

* ఇది నలువదొకటవసర్గమునందుఁ గల కథ.

నది యొక హేతువునుబట్టియే సాధింప వలనుపడదు. మహా కార్యముమాట చెప్పనేటికి? కనుక సీతాదర్శనమాత్రమున ఫలమేమి? ఒక కార్యమునకుండు పెక్కు హేతువులం గొని యనేకోపాయములచే సాధింప నెవఁడు తెలియునో వాఁడే కార్యసాధకుఁ డగునుగాని యితరుఁడు కాఁడు. ఇచ్చట పగ వారగు రక్కసులకును నావారగు కోఁతులకునుఁ గల రణ తారతమ్యమును జక్కఁగా నెఱింగి దానిచేతఁ బగవారి బలా బలముల నిశ్చయించుకొని కిష్కింధకుఁ బోయినయెడల నా ప్రభువు చేసినయాజ్ఞను సంపూర్ణముగా నెఱవేర్చినవాఁడ నగుదును. అట్లు గాదేని రక్కసులశక్తి యెట్టిదని యడిగిన బదులు చెప్ప వలనుపడు టెట్లు? ప్రకృతము బలవంతముగా రక్కసులతోఁ గలహము పెట్టుకొనవలయును. అది యాయాస విశేషమునఁ గాక సులభముగా నెట్లు పొసఁగునో యట్లే చేయవలయుఁ గాదే. దాననే రావణుఁడు తనవారిశక్తి నా శక్తిని దెలిసికొనును. నేను యుద్ధమున రావణాదుల మార్కొని సీతావిషయమున వారికిఁ గలనిశ్చయమును వారి బలశక్తియుక్తులను సులువుగాఁ దెలిసికొని పయనము సాగింతును. ఈయారామము రావణునిది. మనోనయనానందకర ముగ నున్నది. అగ్ని శుష్కారణ్యమును గాల్చునట్లు నేనీ యారామమును బాడుసేసెద. దాన నాపై రావణునకుఁ గోపము పొడసూపును. అంత రాక్షసరాజు సకలాయుధములఁ గూడినబలములఁ బంపును. నాకోరినయుద్ధము కల్గును. వారిని మార్కొని నాశౌర్యము వెలయించి వారి పొడవడంచి సుఖ ముగాఁ గిష్కింధకుం బోవుదును.

అని యీరీతి నాపావని యాలోచించి కోపముఁ దెచ్చుకొని తొడలయురవడి వాయువువలెఁ దరువుల ధరఁ బడఁ ద్రోయసాగెను. పక్షులు మధురరుతములు చేయఁగాఁ దరువులు లతావిశేషములు వెలయుచుండఁగాఁ గన్నులు పండవు చేయు నానిష్కుటమును ధ్వంసము చేసెను. చెట్లను విఱచి కొలంకులఁ గలంచి, క్రీడాపర్వతశిఖరములఁ బడఁద్రోసి దానిని జూడ నింపుగా నుండనట్లు చేసెను. ఇట్లు నేత్రపర్వముగా నుండు నాయుపవనము హనుమంతునికోపమునకు గుఱియై కార్చిచ్చు కాల్పఁగానుండున ట్లుండెను. అందలి దృశ్యవస్తువు లన్నియు దర్శనయోగ్యములు గానివయ్యెను. రావణునంతఃపురకాంతలకు సంతోషమొసంగుచు ననేకగుణములుగల్గిన యాయుపవన మత్తఱి శోచ్యముగా నుండెను. పెక్కు రక్కసుల మార్కొని యుక్కడంపఁగోరి యాహనుమంతుఁ డద్దాని వెలుపలిద్వారమున నుండెను.

మహాశయులారా! ఇందలి విశేషముల మాత్రము పరికింతము.

"న సామ రక్షస్సు గుణాయ కల్పతే
న దానమర్థోపచితేషు యుజ్యతే,
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమస్త్వేవ మమేహ రోచతే. 3
న చాస్య కార్యస్య పరాక్రమాదృతే
వినిశ్చయః కశ్చిదిహోపపద్యతే,
హతప్రవీరా హి రణే హి రాక్షసాః
కథంచిదీయుర్యదిహాద్య మార్దవమ్." ౪

అని మూలము. హనుమంతుఁడు సీతసమ్మతి వడసి పయనము సాగింప నెంచి యప్పాలఁ బోయి తనరాక రావణున కెఱిఁగింపం దలంచి యాలోచించుచున్నాఁడు. ఎవ్వఁడుకాని యొక కార్యము చేయఁబూనునపుడు బుద్ధిని సమాధానపఱచుట కొకనీతి నాశ్రయింపక తప్పదు. అది కర్మానుసారము సరిపడ వచ్చు. సరిపడక పోవచ్చును. ఆకార్యఫలము వానికిఁ జెంద వలసియున్న నానీతియు నాలోచనయు సరిపడును. రావణు నకుఁ దనరాకఁ దెలుపుటకు వనభంగమే ముఖ్యము కాదు. లంకలో గట్టిగా నార్చినఁ దెలియదా? ఎవఁడవు నీవని యడుగరా? పౌరుషముగా మాటలాడి వారిఁ దూలనాడినఁ గలహము కలుగదా? ఆయూహ యేల కలుగలేదు? వనభంగము చేయవలయునని, అతనిమూలమునఁ దరుగుల్మలతాదులు నశింపవలయునని మృగములు పక్షులు చావవలయునని ఆస్థలమునఁ గొందఱు రక్కసులు చావవలయునని హనుమ బ్రహ్మాస్త్రమున బద్ధుఁడు కావలయునని కర్మము తలంచుచుండఁగా నతఁ డెట్లు వేఱుగాఁ బ్రవర్తింపఁ దలంచును? కావున దాని కనురూపమైన యూహలు పొడసూపవలయు. తరుగుల్మాదులఁ గూల్చుట యుపపాతకములలో నొకపాపమని స్మృతులు పేర్కొనుచుండ శ్రీరామచంద్రసేవాసమాసాదితవిజ్ఞానసంపన్నుఁ డగుహనుమ యప్పని కేల పూనెనని ప్రశ్నింపరాదు. త్రిమూర్తులే కర్మబద్ధులై యుండఁగా నిఁక నీహనుమ యేపాటి?

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."

అని మహాకవి యోగివర్యుఁడు నగు కాళిదాసు చెప్పెను గదా. భావిఫలానురూపములుగ నూహలు కల్గుననుదానిని దేటపఱచుటకే యాతఁడట్లు చెప్పెను. అంతకుముందు మంచిదని తోఁచినది యాసమయమున మంచిదిగాదనియే తోఁచును. ఏల? యదృశ్యపాశములం దగిలించి కర్మము లాగుచున్నది. కాన దాని కనురూపముగా నూహించును. ఊహలు పొదలి వానిచే నతనిమనస్సు సమ్మతి నొందినఁగాని బుద్ధి నిశ్చయించి కార్యకరణక్షమము కానేరదు. కావున నెవ్వఁడుకాని యెట్టి కార్యము చేయఁబూనిన నొకనీతి నాశ్రయించి యూహించును. ఆయూహ తత్కాలమునకు హితమని తోఁచును. మనస్సు వేఱువిధముగా నాలోచింపఁ జాలదు. కావునఁ గర్మసిద్ధాంతమే బలవత్తరమని మనము నమ్మక తప్పదు.

రాక్షసులు ప్రాయికముగాఁ గ్రూరస్వభావులు. కాన సామమనఁగా మంచిమాటలచేఁ గార్యము సాధించుమార్గము. వారియందది యుపయోగింపదు. రెండవ యుపాయము దానము. అది మహాధనాఢ్యులయందుఁ బనిచేయదు. అనఁగా దానోపాయము దరిద్రులకడ నుపయోగింపఁ బూనవలయుఁగాని సంపన్నులకడఁ బనికిరాదు. లంకయందలి దానవులు ధననిర్జితకుబేరులు. కాన దానముచేత లోఁబడువారు కారు. మూఁడవది భేదోపాయము. అది దుర్బలులయెడఁ బ్రయోగింపందగు. రక్కసులు బలదర్పితులు. కాన భేదోపాయ ముపయోగింపదు. దండోపాయము నాల్గవది. అది సంగరరూపము. అదియే యీమూఁడుపాయముల సాధ్యులు కానివారియెడ నుపయోగింపందగినది. తొలుతనే దాని నుపయోగింపరాదని

నీతిశాస్త్రము హెచ్చరించును. దండోపాయము ప్రాణిహిం సాత్మకము. దేనిచేతను సాధ్యముకానితఱి నరపతులకు నా యుపాయము విహితమే. అదియే నాకిపు డాశ్రయింపఁదగిన దని హనుమ తలంచుచున్నాఁడు. అనఁగా భావిమృతులు కాఁదగినవారికర్మ మాహనమంతు నిట్టు లూహింపఁ బురికొలి పెననియు దానివశంవదుఁడు కాన నట్లే యపుడతఁ డూహించె ననియు మన మెఱుంగవలయును.

"బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి,"

అన్నసూక్తి యీసిద్ధాంతమే తెలుపును. కర్మము పురికొలు పఁగా నెంతపండితునైన నింద్రియము లాకులపడంజేయునని భావము. పరాక్రమమూలమునఁ దప్ప వేఱొక్కదాన నా యూహ ఫలింపదు. అనునిశ్చయము కలవాఁడుకూడ నాహను మంతుఁ డయ్యెను. కొందఱు చచ్చినఁగాని యీరాక్షసులు మెత్తఁదనము వహింపరు. అనఁగాఁ గొందఱ నేను జంపినఁ గాని యించుక భయంపడరని హనుమంతునిభావము. తుదకు హనుమంతుని క్రూరకర్మాసక్తునిగా నొనరించినది యతనిచేఁ జావఁగల దనుజుల దుష్కర్మముగాక మఱేది? ఎవరిచే నేరీతి నెప్పుడేపని చేయించునో కర్మమని మన మెఱుంగఁజాలమని "గహనా కర్మణో గతిః" అనువాక్యమున భగవంతుఁడే తెలి పెను. దీనిని మనము విస్మరింపరాదు.

"కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్,
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తుమర్హతి. ౫
న హ్యేకస్సాధకో హేతుస్స్వల్పస్యాపీహ కర్మణః,
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే." ౬

అని మూలలము. భక్తులారా! పరికింపుఁడు. ఎట్టియూహలు కలిగించి హనుమంతునిఁ గ్రూరకార్యాసక్తునిగఁ గర్మము కావించుచున్నదో, దూత యనఁగా తన్నుఁ బంపినవా రేమి చెప్పుమందురో యది చెప్పి వచ్చువాఁడని కదా యర్థము హనుమ దూత కాఁడు. గూఢచారి యనియే యొప్పుకొందము. గూఢచారి బహిరంగచారి కావచ్చునా? అట్లయిన వాఁడు గూఢచారి యగునా? రామునానతి దాఁటినవాఁడగుట హనుమంతుని రాజద్రోహి యనిగాని దుష్టసేవకుఁ డనికాని యన వచ్చునా? ఆతనిస్వతంత్రత యిం దేమున్నది? సీత తలంచును. కర్మ మామెకుఁ బోడకట్టును. ఆతలంపు హనుమంతుని బురి కొల్పును. దాని కనురూపముగా ధర్మములు తోఁచును. పాపము! పావని యేమిచేయఁగలఁడు? హరిహరబ్రహ్మాదులే కర్మనిబద్ధులై ప్రకృతిపాదపరాగము లనఁదగియుండ నిఁక నీవానరము పేరెత్తనేల? ఈమూల మీవిషయము నే సిద్ధాంతము చేయుచున్నది పరిశీలింపుఁడు. దూత యన్నమాట మఱచి తాఁ జేయవలసియుండుదానికి ననుగుణముగా నాలోచించుచున్నాఁడు. ఒకకార్యము చేసిరమ్మని ప్రభువు పంపఁగా దానికి విరోధము లేకుండ ననేకకార్యము లెవ్వఁడు చేయునో వాఁడు కార్యదక్షుఁ డనఁబడును. అని ఇప్పటి హనుమంతుని తలంపు లెంత యసంగతములుగ సామాన్యదృష్టిం బరికింప నున్నవో చూడుఁడు. చెప్పినపని చేయఁదగినవాఁడు కింకరుఁడు. చెప్పనిదానికంటె వేయిమడుంగు లెక్కుడుగ నొనరించువాఁడు కింకరశబ్దవాచ్యుఁ డగునా? హనుమ కింకరుఁడు గాక స్వతంత్రుఁ డనఁదగునా? శ్రీరామచరణాంబురుహ

సేవకుఁడు గదా హనుమ. ఐన నిట్లేల మతిమంతుఁడయ్యు నాలోచించెను? ఇన్ని యూహలు కల్గినఁగాని యాకార్యమును సాధింప నుపక్రమింపఁడు. అదియ గదా ప్రకృతిమహత్త్వము. ఆతని యాలోచనలం గాంచుఁడు. కార్య మల్పమే యైనను దానిసాధింప నొకహేతువు చాలదు. పెక్కుకారణముల నవలంబించి కార్యమును సాధింప నెఱింగినవాఁడే సమర్థుఁడగును. సీతాసందర్శనమాత్రమున నావచ్చినకార్యము ఫలించినట్లు భావింపరాదు. రాక్షసులఁ జంపి రావణుని గాంచి దానికి ననుకూలముగా వనభంగ మొనరించి యింక ననేకవిధములుగా నెఱవేర్చినఁగాని నాకార్యము ఫలించినట్లు భావింపరాదు. అనియు నూహించెను. భావ్యర్థమున కనుకూలముగా హనుమబుద్ధి యూహించుచున్నదనుటకంటె నింక నొకమాట యన నేమున్నది?

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."

అన్న సూక్తి ననుసరించి యిపుడు హనుమంతుని మతిమంతుఁడనియు బుద్ధిమంతుఁడనియు భావింపవలెను. కర్మదాసుఁడనియుఁ బేర్కొనవచ్చును. ఈతలంపులంబట్టి యాలోచింపఁగా మానవుల కార్యదక్షత కర్మము ననుసరించియే యుండుననియు నేను గర్తనని భావించువాఁ డజ్ఞులలో నగ్రగణ్యుఁడనియు సిద్ధాంతము తేలెడిని. ఆహా! భగవతితలంపు లెంత శక్తిమంతములు. వానిని జవదాఁట నాపరాత్పరునకు నశక్యమేకదా. అనఁగా దాఁట శక్తుఁడయ్యుఁ గార్యార్థము దాఁటఁడని భావము గ్రహింపందగు. స్వోక్తివ్యాఘాతముగఁ బ్రవ

_ర్తింప నాతఁ డంగీకరించునా ? కావున నాయిరువురతలంపు లొక్కటియే యని సారము తేలెడిని. ఇదియే తెలిసికొనఁదగినవిషయము. దీని నెఱుంగుటంజేసి యజ్ఞానము తజ్జనితాహంకారము నశించును. అంతకంటెఁ గావలసిన దేమున్నది ?

ఈభాగమున నధ్యాత్మరామాయణమునందును విశేషములు గానరావు.

## వనభంగమునఁ గోపించి రావణుఁడు రక్కసులం బంపుట.

* అంత లంకలోనివారందఱు మృగపక్షులయాక్రోశధ్వనులను వృక్షపతననినాదముల విని తొట్రుపాటు గనిరి. రాక్షసనాశనమును సూచించుచు భీతిని గొలుపుచు నశుభశకునములు పెక్కులు గానఁబడినవి. వికృతాకారములుగల రాక్షసాంగనలు ఆధ్వనికి మేలుకొని భగ్నమగువనమును దిలకించి వీరహనుమంతునిం గాంచిరి. వారింగని యాతఁడు మిక్కిలి భయముగలిగించు శరీరమునఁ బొడకట్టెను. ఆమహాకాయునిం గాంచి యాస్త్రీలు సీతకడ కరిగి వీఁ డెవ్వఁడు ? వేరెద్ది ? ఎవరిపంపున వచ్చినాఁడు ? ఎక్కడనుండి వచ్చెను ? ఏల వచ్చినాఁడు? నీతో నేమి మాటలాడెను? అమ్మా! భయంపడకుము. మాకు నున్నదున్నట్లు చెప్పుము. దేనింగూర్చి వీఁడు నీతో భాషించెను ? అని ప్రశ్నించిరి. సర్వాంగసుందరి యాసీత వారల నంతంగాంచి పరమపతివ్రతాశిరోమణి తాను

* ఇది నలువదిరెండవసర్గమునఁ గల కథయని యెఱుంగవలయును.

గావున నంగనలారా! రక్కసులు భయంకర కామరూపులు. వారినెఱుంగు నవకాశము నా కెక్కడిది? సర్పపాదముల నా సర్పములే యెఱుంగును. కాని యితరు లెఱుంగఁజాలరు. అట్లె మీరును రాక్షసులు గాన రాక్షసులగతి చేష్టితములు మీరే యెఱుంగఁగలరు. కావున వీఁ డెట్టివాఁడో? ఏమిచేయు వాఁడో మీకే తెలియును. అందులకు సందియము లేదు వీనిం గాంచి నేనును భయంపడితిని. వీఁడెవ్వఁడో నాకుఁ దెలియకున్నది. వీఁడెవ్వఁడో మీరే చెప్పుఁడు? వీనిం జూడఁ గాఁ గామరూపియగు దనుజుఁ డెవ్వఁడో యీ వానర రూపము ధరించి యరుదెంచెనని తోఁచుచున్నది. అని పలికెను.

ఆసీతావాక్యముల నాలకించి వారు భయంపడి వనమున నలువలంకులకుఁ బాఱిపాఱి యొందో దాఁగిరి. అందుఁగొందఱు సీతారక్షణమునకు నిలువఁ గొందఱు రావణున కావార్తఁ దెలుపఁ బరుగిడిరి. రావణుం గాంచి రాక్షసేశ్వరా! భయంకరా కారుఁడు మహాపరాక్రమశాలియు నగు నొక వానరుఁడు సీతతో భాషించి యశోకవనాంతరమున నున్నాఁడు. సీత నెన్ని విధముల నడిగినను వానివార్తఁ దెలుపకున్నది. రాముఁడు సీతను వెదుకఁ బంపియున్న నుండునేమో. ఇంద్రుఁడు పంపిన దూతగా నుండవచ్చును మాకేదియుఁ దెలియరాక యున్నది ఆవానరుఁడు మనోహరమగు మన యశోకారామమును నాశ నము చేసినాఁడు. జానకియుండు భాగముతప్పఁ బాడుచేయని భాగ మావనమున నింకొకటి కనఁబడదు. దానిం గాపాడుటఁ జూడఁగా సీతరక్షణార్థమో యలసటం జేసియో తెలియ

కున్నది. అంత వీనిన కాయాస ముండదు. సీతారక్షణార్థమే వాఁడద్దానిజోలికిఁ బోయినవాఁడు కాఁడనుకొందుము. సొంపుగా నా శింశుపావృక్ష మొక్కటియే కనఁబడుచున్నది ఆతఁడు సీతతో మాటలాడుట వనభంగముచేయుట యను నీ రెండపరాధములు గావించినాఁడు. వానికిఁ దీవ్రదండనము విధింపవలయును. బ్రదుకఁదలఁచినవాఁడు నీమనస్సునఁ గోరియున్న సీతతో మాటలాడఁ గలఁడా? వీఁడు బ్రదుక నిష్టము లేనివాఁడౌట మాటలాడినాఁడు.

రావణుఁ డా రాక్షసాంగనలమాట లాలకించి పట్టరాని కోపమున గ్రుడ్లు త్రిప్పుచు నాజ్యహోమోద్దీపితవహ్నిఁబోలి మండిపడుచుఁ దనయంతవారగు కింకరులను రాక్షసుల హనుమంతుని జంప నాజ్ఞాపించెను. ఆరాక్షసు లెనుబదివేలని పరిగణింపఁబడువారు సకలాయుధములఁ దాల్చి యుద్ధమున కువ్విళులూరుచు రావణునాజ్ఞఁ గొని బయలువెడలిరి.

వారట్లు వెడలి బహిర్ద్వారంబున సంగరసన్నద్ధుఁడై యుండు నా వానరుం గాంచి సమీపించి జవంబున నగ్ని మీఁదికురుకు మిడుతలవలె నతని మార్కొనిరి. వివిధాయుధములఁ బ్రహరించిరి. నలుఁగడల నాయుధధారులై నిలిచిరి. ఆప్రేటుల కాహనుమ యింతయేని చలింపక మహాతేజుండు గావున సంగరకాంక్ష యంతకంత కుప్పొంగ సంతోషము లోనిముడక యుబుక పర్వతముభంగిఁ గానఁబడి వాలము భూమిపైఁ బలుమాఱుకొట్టి భయంకరముగా నార్చెను. మఱియు నావాయుతనయుఁ డాత్మకాయమును గడుంగడుం బెద్దది గావించి లంకయందంతటఁ బ్రతిధ్వను లుప్పతిల్లునట్టులు బాహువు లప్పళిం

చెను. దానఁ గల్గిననినాదము పర్వతసానువుల మాఱుమ్రోయఁ జేసెను. దానికిం దోడుగాఁ దాను సాక్షిఁగా నాధ్వనులకులికి పైఁ బఱుగువారుచున్న యానవపక్షులు బెదరి నేలఁబడినవి.

అంత నాపావని యెల్లరకు వినఁబడునట్లు "మహా బలుఁడు రాముఁడు లక్ష్మణుఁడు సర్వోత్కృష్టులై యున్నవారు. మా ప్రభువు సుగ్రీవుఁడు వాలిం జంపి రామమూర్తి తనుఁ బాలింపఁగా సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు. నే నక్లిష్టకర్ముఁ డగు కోసలనాయకుఁడగు శ్రీరామునకు దాసుఁడను. హనుమంతుఁడని పేరునఁ బిలువఁబడువాఁడను. శత్రుసంహారకుఁడను. వాయుపుత్త్రుఁడను. తరుపాషాణాదులం గొని యనేక భంగులం బ్రహరింపఁజాలి మేటిబలము గలుగనుండు నాకు యుద్ధమున రావణసహస్రంబులు లెక్కలేదు. రక్కసులెల్లఁ గాంచుచుండఁగా లంకానగరమంతయుఁ గలవిలపాటొందఁ జేసి సీతాదేవికి నమస్కరించి ధన్యుఁడనై రామునొద్దకుం బోవుదు" అని గట్టిగా నుడివెను. వా రాతనిధ్వనికే భయం పడియు రక్తమయతనుని బావని నాతనిం గాంచి రాజాజ్ఞకు బద్ధులు గావున భయము వదలి దగ్గఱకుఁ బోవఁజాలక యంత నంత నిలిచి యాయుధముల వైచి నొప్పించిరి. హనుమయు వారట్లు తన్నుఁ జుట్టుకొనఁగా నాతోరణముననున్న యినుప గుదియ దాపున కరిగి దానిం జేకొని యాదానవులం బడఁ గొట్టెను. వా రసువుల విడిచి యమసదనమున కతిథులైరి. గరుడుఁడు సర్పముంబట్టుకొని యాకసంబున కెగురునట్లు ఆయా యుధమును బట్టుకొని యంబరమున విహరింపసాగెను. మరల యుద్ధమునకు సిద్ధపడి యాతోరణము నాశ్రయించియుండెను.

హతశేషులగు రాక్షసులు పరుగిడి కింకరులు యముకైంకర్య మున కరిగిరని తెలిపిరి. దానవాధీశ్వరుఁ డాదారుణదుర్వార్త నాలకించి నేత్రములంద్రిప్పుచుఁ బరాక్రమాధికుఁడగు ప్రహ స్తకుమారుని హనుమంతు మార్కొన నాజ్ఞచేసెను.

## హనుమ చైత్యప్రాసాదమునఁ గలరక్కసులఁ జంపుట.

* ఈరీతి నాహనుమంతుఁడు కింకరులఁ బొలియించి యంతటఁ దనలో నిట్లు తలపోసికొనఁ జొచ్చెను. నే నశోక వనము పాడుచేసితిని. కాని రాక్షసకులదేవతాలయమగు నీ ప్రాసాదమును ముట్టనైతిని. భయంకరముగాఁ గడువిశాల ముగాఁ జూపట్టు దీనింగూడ ధ్వంసము చేసెదను. అని నిశ్చ యించి స్వబలప్రకటనార్థము ఆ తోరణమునుండి యెగిరి మేరుశిఖరమువలె నత్యంతోన్నతమగు చైత్యప్రాసాదముపైకి నెక్కెను. ఇట్లెక్కి మహాతేజుఁడు గాన రెండవసూర్యునివలెఁ గనఁబడుచు దుస్సాధ్యమగుదాని నాక్రమించి పారియాత్ర పర్వతమా యనునట్లు చూపట్టుచుఁ దనమహత్త్వమువలన భూరిశరీరముం దాల్చి లంకానగరమంతయు శబ్దమయంబగు నట్లు బెడిదముగా బాహువు లప్పళించెను. ఇతరశ్రుతికటు వగు బాహునాదమున కులికి పక్షులు క్రిందఁబడినవి. ఆచైత్య మును గాచురక్కసులు మూర్ఛిల్లిరి. అంత హనుమంతుఁడు సకలాస్త్రవేత్త రాముఁడు మహాబలుఁ డగులక్ష్మణుఁడు వాన రేంద్రుఁ డగుసుగ్రీవుఁడు వీరు సర్వోత్కృష్టులై వర్తింతురు గాక. నే రామదాసుఁడను. హనుమంతుఁడని నాపేరు. శత్రు

---

* ఇది నలువదిమూఁడవసర్గమునఁ గలకథ యని తెలియందగు.

ధ్వంసకుఁడను. వాయుకుమారుఁడను. తరుశిలలఁ బ్రహరించు నాకు రావణసహస్రము సమానము కాదు. రక్కసులందఱు చక్కఁగాఁ జూచుచుండఁగా తృణప్రాయముగా నీ లంకానగరము చీకాకుపఱచి సీతాదేవికి మ్రొక్కి ధన్యుఁడనై శ్రీరాము నొద్దకుఁ బోవుదును. అని గట్టిగాఁ బలికెను.

ఆ విమానమునందున్న వాయుకుమారుఁడు అందలి రక్కసులకుఁ దెలియఁజెప్పి వారు భయంపడ మఱియు నార్చెను. ఆధ్వని విని రక్షకులగు శతరాక్షసులు నానా విధాయుధధారులై యతనిపై కడరిరి. నానాప్రహారణములఁ గొట్టుచు నతని జుట్టుకొనిరి. అత్తఱి చుట్టుదిరుగుచున్న వారిం గని క్రుద్ధుఁడై భయంకరాకారమును దాల్చి యందలి బంగారు స్తంభమును దటాలునఁ బెకలించి గిరగిరఁ ద్రిప్పి తక్కిన స్తంభములతో నది యొరసికొనుటంజేసి యగ్నిపుట్టఁగా దాన నాప్రాసాదముం గాల్చెను. దానింగని యా స్తంభము చేత నే యా శతరాక్షసవీరులం జంపి యంతరిక్షముననుండి మహా

లగు నావంటివానరులు పెక్కండ్రు సుగ్రీవునివశమున ; వారు. సీతాగవేషణార్థము భూతలమందు నంతటఁ ది చున్నారు. వారందఱు మేటిబలవంతులు. సుగ్రీవుఁ వానరవీరు లసంఖ్యాకులు కొలిచి రాఁగా మిమ్ముఁ బొలియి నిచ్చుటకి రాఁగలండు. మహానుభావుఁ డగు రామునితో మీ వైరము గల్గించుకొంటిరి ఇఁక నీనగరము నిలువదు. మీ నుండఁజాలరు. మీరాజు బ్రదుకఁజాలఁడు. మీరందఱు న పకమానరని గట్టిగాఁ బలికెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషముల నరయుదము.

"వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః. ౧
తస్మాత్ప్రాసాదమప్యేవం భీమం విధ్వంసయామ్యహం,
ఇతి సంచింత్య మనసా హనుమాన్ దర్శయన్ బలం." ౨

అని మూలము. "చైత్యప్రాసాదః రక్షఃకులదేవతాప్రాసాదః" అని మహేశ్వరతీర్థులు. చైత్యశబ్దమున కనేకార్థములు గలవు గాని సందర్భమునను సరించి యారామమునఁ గలయొక దేవతాలయమని పొడకట్టుచున్నది. వనభంగము కాఁగా వచ్చినకింకరులు చావఁగా క్రొత్తవారింకను రాకపోవఁగా నానడుమ నేమియుఁ దోఁపమి నూరకుండుహనుమ పనిలేనిమంగలి పిల్లితల గొఱిగెనన్నట్లు దేవాలయమును బాడుచేయ నెంచె ననఁగా నించుక విచారము కలుగకపోదు. రాక్షసులదేవాలయ మైనంతమాత్రమున నది పవిత్రము కాదనవచ్చునా? శత్రువు లారాధించుదేవాలయములఁ బాడుచేయుట న్యాయ్యమనఁదగునా? అను నిది యొక ప్రశ్నమే యగును. క్రూరరాజులు పరదేశము నాక్రమించి యాదేశవాసు లారాధించు దేవాలయములఁ బాడుచేసిరని యీసడించుట లేదా. అది యెవరు చేసినను మంచిపని యగుననవచ్చునా? అపరాధ మెవ్వరుచేసిన నపరాధమే. రాక్షసులు క్రూరులగుట వారి యారాధనాదులు క్రూరములుగా నుండుటంబట్టి యాక్రూర దేవాలయమును బాడుచేయుట పాపముగాదని కొంద ఱందు రేమో. హనుమంతునిమాట యిప్పట్టున నటుండఁగా వీరు క్రూరమతు లనవలసివచ్చును. రాక్షసులు క్రూరులు కావచ్చుఁ

గాని వా రారాధించుదేవతలు క్రూరులనుట తెలివితక్కువయే యగును. దేవతలక్రౌర్యము కర్మము ననుసరించియుండునుగాని వేఱుగా నుండదు. నృసింహమూర్తియుఁ గ్రూరదైవమే యనఁ దగునా? క్రౌర్యమనునది కార్యమునుబట్టియే యని హిరణ్య కశిపువధ ప్రహ్లాదరక్షణములు తెలుపుచునే యున్నవి. ఉపాస కుని మనోవ్యాపారము ననుసరించి యాదేవతయం దట్టి వారోపింపఁబడును. కాని నైజ మది కాదు. రక్కసులకుగాఁ గ్రొత్తదేవతల బ్రహ్మ సృజింపలేదు. సకలకార్యములకు దేవతలే దిక్కు. కావున నట్టి దేవాలయమును బాడుచేయుటహా హనుమంతునకు మంచిది కాదని తోఁపకపోదు. మహాభక్తుఁడు హనుమంతుఁడని యెఱింగితిమి. పరదేవిసాన్నిధ్యబలము కలి గినవాఁ డయ్యెను. వెంటనే యీపాడుపని కేల పూనెను? అనుశంక యుదయించును. ఇంచుక యాలోచింతము. హను మంతుఁ డిపు డూహించినదేమని? చైత్యప్రాసాదము ధ్వంసము చేయనైతినని కదా. లక్షణ ననుసరింపవలయు. "గంగాయాం ఘోషః" అనుచో గంగాతీరస్థమగు గొల్లపల్లియ యని కదా యర్థము చెప్పఁబడినది. "మంచాః క్రోశంతి" అనుచోటను లక్షణ ననుసరించికదా యర్థము చెప్పఁబడినది. ఇందుఁగూడ దేవాలయ గతరాక్షసవీరులని యర్థము చెప్పవలయును. ఫలము కూడ నట్లె యైనది. అందలి విగ్రహములను బాడుచేయలేదు. అందుఁ గావలియుండు రక్షోవీరులం జంపెను. వారిని గూడఁ దన్నుఁ బ్రహరించినపిదప వధించెఁగాని నిద్రాసక్తులం జంపలేదు. కావున నిచ్చో లక్షణ ననుసరించియే యర్థము చెప్పఁదగి యుండును. మహాప్రకృతిభక్తులు దుష్కార్యముల నొనరింప

రని నమ్మవలయును. దేవాలయమునఁ గలవీరులు హనుమచేఁ జావఁదగిన వా రుండఁగా నాతలంపు హనుమకుఁ గలుగకపోవు టెట్లు ? పావని స్వతంత్రుఁడు కాఁడుకదా. కర్మబద్ధుఁడు. ఏక్షణ మున నెవరికి మృతి యేకారణమున రావలెనో యది రాక తక్కదు. వారిదుష్కర్మము హనుమ కాయూహను గల్గించెను.

"మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అను భగవదుక్తి స్మర్తవ్యము. కర్మబద్ధులు కానివారు ప్రకృతి పురుషులు. వారును గూడఁ గార్యము ననుసరించి కర్మబద్ధుల వలె నటింతురు. తక్కినవారిగతి యింకఁ జెప్పనేటికి? సర్వత్ర కర్మసిద్ధాంతము వ్యాపించియున్నదని మన మెఱుంగవలయును.

"స భూత్వా సుమహాకాయః ప్రభావాన్మారుతాత్మజః." ౫

అని మూలము. ప్రభావమువలనఁ బెద్దశరీరము కలవాఁ డయ్యెననఁగా భావమేమి? యోగబలమున దేహమును బెంచ వచ్చును. సూక్ష్మముగాఁ జేయవచ్చును. ఏనుఁగుల మించిన బలము కలుగును. అణిమాద్యష్టసిద్ధులలో నిదియు నొకటి యనఁదగు. ఇది యోగుల కత్యంతసులభమగు పనియేకాని మహత్తరకార్యము కాదు. హనుమంతుఁడు యోగాభ్యాస నిరతుఁడని తేలెడిని. అట్టివాని కిది యత్యల్పకార్యమేగాని వేఱు కాదు.

యోగశాస్త్రము నశించుటకు మానవుల దుస్సంకల్ప ములే కారణములు. యోగి సర్వభూతసముఁడు కావలయును. స్వార్థపరుఁడు కారాదు. విగ్రహార్చకుఁడు కారాదు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్న శ్రీకృష్ణవాక్యము స్మరించి తదర్థము నెఱింగిన నేశంకలు కలుగవు. ధనాకర్షణమునకుఁ గపటయోగులు వేషధారులు ధర్మవ్యాజమునఁ దిరుగుదురు. వారియోగము ధనసంయోగమే యట్టివారు విగ్రహారాధకులు గారు. ఐనచో భగవద్గీతావాక్యము తుచ్ఛమగును. భగవన్మయముగా సర్వమును జూడఁదగునని భగవద్వాక్యము గనఁబడుచుండఁగా విగ్రహారాధనాసక్తికిఁ జోటెక్కడ? కపటనాటకసూత్రధారులు కొందఱు బంధుపోషణార్థము యోగివేషములఁ దాల్చి పామరులు నమ్మి శిష్యులు కాఁగా వారికి నేవో నాలుగు తుచ్ఛమంత్రములు చెప్పి ముక్తికరతలామలకమని బోధించి సర్వస్వమపహరింతురు తుద కాధనము బంధువులపాలయి వారివంశములు నిర్మూలించును. అట్టి కపటయోగులనే విద్యాధికులు నాదరింతురు. ఇక్కాలపు విద్య యవిద్యాతుల్య మనుటకన్న వేఱొకమాట యిటుఁ జెప్పఁబూనను. వారినిగురించియే మనుస్మృతి

"ధర్మధ్వజీ సదా లుబ్ధశ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౫
అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬
యే బకవ్రతినో విప్రా యే చ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭
న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనమ్. ౧౯౮
ప్రేత్యేహ చేదృశా విప్రా గర్హ్యంతే బ్రహ్మవాదిభిః,

ఛద్మనాచరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి. ౧౯౯
అలింగీ లింగివేషేణ యో వృత్తిముపజీవతి,
స లింగినాం హరత్యేన స్తిర్యగ్యోనౌ చ జాయతే.” ౨౦౦

అని సూచించుచున్నది. మనుస్మృతిభావమును బరికింపుడు. ధర్మవ్యాజమున ధనమార్జించుచు దానికై వేషములు వేయుచు ధనమును దుదకు బంధువులకొసంగు కపటయోగులు మనుష్యులుగా జన్మింపక పశుపక్షియోనులం బుట్టుదురని స్మృతి తెలుపుచున్నది. ఇట్టివారలే యిప్పటి పశుపక్షిజాతులలో ననేకులుండకపోరు. మహాత్ములెవరైన వీరు వారే యని తెలిపిన మనము వారికి నమస్కరించి పశ్చాత్తాపము గల్గఁజేసిన బాగుండును.

“దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః,
హనుమాంశ్శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః. ౯
అర్దయిత్వా పురీం లంకాం మైథిలీమభివాద్య చ,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. ౧౧

అని మూలము. “అక్లిష్టకర్మణో రామస్య కోసలేంద్రస్య అహం దాసః.” అని యన్వయక్రమము. ఇందు శ్రీరామునియందుఁగల నిర్లిప్తత్వము ప్రతిపాదితము అక్లిష్టకర్మణః=ఏకార్యముగాని యితరులకుఁ గల్గింపవలయునని చేయఁడు. అనఁగా పరులకుఁ గష్టము గలిగించువాఁడనఁగా స్వార్థైకపరుఁడని కదా భావము. తనకని దేనిని గోరఁడనఁగాఁ గోరఁదగినదే లేదని కదా తాత్పర్యము. అట్టి రామునకు దాసుఁడ ననఁగా నితరులకు శ్రమము గల్గించువాఁడను గానని కదా భావము. నావలనఁ గలుగు శ్రమములు మీకర్మమువలనఁ గల్గించినవని సారము. భగవం

తుఁడు నిర్లిప్తుఁడు. వారిమూలమున నెవరికి నెట్టికష్టములు గలుగవు కలుగుచుండునవి వారువారు చేసికొన్న కర్మమూలమున లభించునవియే కాని వేఱుగాదనునదియే హృదయము. నేను గూడ నిమిత్తమాత్రుఁడనుగాని కర్తను గానని హనుమంతునాశయము

"మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

... ... ...

మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

అను నీగీతావాక్యము లిచ్చోట స్మర్తవ్యములు.

"లంకాంపురీమర్దయిత్వా మైథిలీమభివాద్య చ సర్వేక్షుసాం మిషతాం సతాం సమృద్ధార్థో గమిష్యామి" అని యన్వయక్రమము. లంకను బీడించి నగరమును బీడించుటనఁగా దహించి మైథిలి యనంబడు మహాప్రకృతికి నమస్కరించి యెల్లరాక్షసులు చూచుచుండఁగా కృతకృత్యుఁడనై అనఁగా సఫలమనోరథుఁడనై పోవఁగలను. ఈభావములన్నియు నెట్లు స్ఫురించినవనఁగాఁ గార్యమును జేయించుకర్మమే పలుకఁజేసినదని యెఱుంగం దగియుండు. ఈభాగముంబట్టి శ్రీరామునకేదియు వలయునది లేదనియు నిర్లిప్తుఁడగు పరబ్రహ్మమనియుఁ బ్రకృతి యగుజానకి యతని మూలమున నన్నిపనులు చేయించుచున్నదనియు హనుమయు నొకసాధనమే యనియుఁ దేలుచున్నది. శక్తియగు సీతాదేవి సర్వకార్యకర్త్రి. పురుషుఁడగు శ్రీరాముఁడు నిర్లిప్తుఁడు. సాక్షిమాత్రుఁడు. కావునఁ బ్రకృతియే

యుపాస్యదేవత. పరమపురుషుఁడు ధ్యేయుఁడు అనఁగా ధ్యాన గమ్యుఁడు. కలిగినరూపము ప్రకృతిజనితము. అది శాశ్వతము కాదు. ఈభావ మెఱుంగఁజేయుటకే శాక్తము కలిగినది. ఇద్దాని నెఱింగినవారందఱు శాక్తులే. శైవవైష్ణవాది భేదములే శాక్తమున లేవు. సర్వజనాదృతిపాత్రము శాక్తము. సకలదేవతోపాసనకు మార్గము లిందున్నవి. తక్కిన మతపంచకమునం దీయనుకూలములు లేవనునది సిద్ధాంతమే. వీరవైష్ణవుఁడు శాక్తుఁడై నరసింహమంత్ర ముపాసించునేని తక్కిన సప్తకోటి మహామంత్రములు దాని కంగమంత్రము లగును. ఇట్లే యొకఁ డేమంత్ర ముపాసించిన నద్దాని కన్నియు నంగమంత్రము లగుచుండును. అనఁగా భావమేమి ? సర్వదేవత లొక ప్రధానము నుండి వెలువడినవి. ఆతేజస్సే యిన్నిమూర్తులుగా నొప్పుచున్నది. ఇందు దేని నుపాసించిన నేమి ?

"సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి."

అనుసూక్తి యీభావమును దెలుప వెలువడినదని యెఱుంగందగు. ఈభావమునే శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరి యందు

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః. ౨౫
విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ. ౨౬

జపోజల్పశ్శిల్పం సకలమపి ముద్రా విరచనా
గతిః ప్రాదక్షిణ్యక్రమణమశనాద్యాహుతివిధిః,
ప్రణామస్సంవేశస్సుఖమఖిలమాత్మార్పణదృశా
సపర్యాపర్యాయస్తవ భవతు యన్మే విలసితం." ౨౭

అని తెలియఁజేసిరి.

"అత్రేదమనుసంధేయం. సమయినాం మతే సమయస్య సాదాఖ్యతత్త్వస్య సపర్యా సహస్రదళకమలఏవ. న తు బాహ్యపీఠాదౌ. యేయే సమయినో యోగీశ్వరా జీవన్ముక్తాస్సంసారయాత్రాయామనువర్తమానాస్సాదాఖ్య తత్త్వమనుచింతయంతః ఆత్మైకప్రవణా వర్తంతే తేషాం జపో జల్పశ్శిల్పమిత్యాదినా సపర్యాప్రకారో నిరూపితః. యతస్సమయినో యోగీశ్వరాః విజనే గుహాంతరేవా బద్ధపద్మాసనాః నిగృహీతేంద్రియాః సాదాఖ్య తత్త్వజ్ఞానైకనిష్ఠా వర్తంతే తేషాం వక్ష్యమాణచతుర్విధషడ్విధైక్యానుసంధానమేవ భగవత్యాస్సపర్యేత్యర్థాదుక్తం భవతి. అతశ్చ పక్షద్వయేఽపి బాహ్యపూజాయాం తత్క్రియాకలాపే చ తత్సంపాదనాయాం చ క్లేశో నాస్తీతి సమయినామితి రహస్యం. యత్తు చంద్రజ్ఞానవిద్యాయాముక్తం.

"సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం,
పాశాంకుశధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్."

అని వ్యాఖ్య.

యోగమతమునకు శాక్తమునకు నభేదమని యీ వ్యాఖ్యయే స్పష్టపఱచుచున్నది కదా. శాక్తమునఁ జక్రారాధనము కలదు. విగ్రహారాధనమే లేదు. చక్రార్చనయుం గూడ మధ్యమపథము. సమయమతమే యుత్తమమని తేలెడిని. భగవదారాధనార్థవస్తుసంపాదనమునఁ గలశ్రమము లిందు లేవు.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అనునట్లు సమయమతాచారనిరతులు శుద్ధజ్ఞానైకప్రవణులు శాక్తులు సహస్రకమలాంతర్వర్తినిగా నారాధింతురు. అట్టి మతమే యోగమతము గాక మఱేయది యోగసమ్మత మగును? ఇచ్చో నీవిషయము నెఱింగినఁ గృతార్థు లగుదురు. రామాయణకథాభాగము నెఱింగిన లాభ మత్యల్పము. విశేషాంశముల నెఱుంగుటయే తెలుఁగు.

"ప్రాసాదస్య మహాంతస్య స్తంభం హేమపరిష్కృతం,
ఉత్పాటయిత్వా వేగేన హనుమాన్పవనాత్మజః. ౧౬
తతస్తం భ్రామయామాస శతధారం మహాబలః,
తత్ర చాగ్నిస్సమభవత్ప్రాసాదశ్చాప్యదహ్యత." ౧౭

అని మూలము. దేవాలయస్తంభ మనఁగా ధ్వజమని యర్థము చేయరాదు. స్తంభాంతరము లున్నట్లున్నది. ఆ స్తంభమును త్రిప్పుచుండఁగాఁ దక్కిన స్తంభములతో నది యొరసికొనుటం జేసి యగ్ని కలిగి ప్రాసాదమును గాల్చెనని యున్నది. కావున ననేక స్తంభము లుండుట యప్పటి శిల్పవిధానమే యని యూహింపఁదగును. ధ్వజప్రతిష్ఠలు లోనగునవి నవీనాగమముల ప్రకార మేర్పడును. ప్రాచీనాగమములయం దీవింత లంతలుగాఁ గానరావు. కావున వింధ్యోత్తరములయందు వానిప్రాధాన్యము గానరాదు. దధ్యోదనాదులకుం గూడ నందుఁ జోటులేదు. ముఖ్యముగా తిరుపతి మొదలుకొనియే యీ పాపాటు రామన్నలపెత్తన మెక్కినది. బ్రహ్మోత్సవము లని యింక నేవేవో పేరులతో నైవేద్యవిశేషములు కుక్షింభరుల సంరక్షణార్థ మేర్పడియున్నవి. "భక్తిశూన్యమైనను భుక్తిశూన్యము కారాదు." అన్నసామెత యేర్పడినది.

విగ్రహస్థాపనము పామరులకు దేవతారూపము ధ్యానగమ్యమగుట కేర్పడినది గాని దానికి నైవేద్యములు చూపి వాని మూలమున నన్నవిక్రయవ్యాపారము హెచ్చుగావలయునని కాదు. ఈయనాచార మర్వాచీనమనక తప్పదు. వీనిం జూచి కాఁబోలు పీఠస్వాములు కూడ బంగరుపీఠములు సుందర విగ్రహములు వాని కలంకారములు తదర్థమై ధనార్జనము నను నీయనాచారముల కలవాటుపడిరి. సన్న్యాసులకు భగవ ద్ధ్యానమున నధికారము కలదు గాని విగ్రహాద్యర్చనమున నధికారము లేదు.

"అనగ్నిరనికేతస్స్యాద్గ్రామమన్నార్థమాశ్రయేత్,
ఉపేక్షకో౽సంకుసుకో మునిర్భావసమాహితః. ४३
కపాలం వృక్షమూలాని కుచేలమసహాయతా,
సమతా చైవ సర్వస్మిన్నేతన్ముక్తస్య లక్షణం. ४४
నాభినందేత మరణం నాభినందేత జీవితం,
కాలమేవ ప్రతీక్షేత నిర్దేశం భృతకో యథా." ४५

అను నీమొదలగు మనుస్మృతివాక్యములు కొందఱు కన్వయింపఁజాలవు. ధనార్థులు కారాదని.

"యతిభ్యః కాంచనం దత్వా రౌరవం నరకం వ్రజేత్,"

అని సూక్తికలదని పెక్కండ్రెఱుంగరు. ఎఱింగినను శంకరాజ్ఞ యని లోకోపకారముగా నీమహావ్యాపారమును సాగించుచుందుమనియు నందురు. వీరి కింక నూతనస్మృతులు కావలసియున్నవనునూహ పొడముచున్నది. ఇట్టివారిమూలమున నుపకారమా లోకమున కపకారమా యని ప్రశ్నించిన రెండ

వదియే కలుగునని యుత్తరము చెప్ప నే సాహసింతును. కొందఱు

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్న గీతావాక్యము నుదహరించి పామరులకు సదాచారములు నేర్పుటకే సన్న్యాసు లిట్లు పూజించుచున్నవారని కొందఱు వాదించిరి. ఈయుక్తి కాళియుక్తివలె నున్నది. అనర్థామగుమార్గము నవలంబింపరాదని విధియుండఁగా నట్టివారల కీవాక్య మన్వయించుటకంటె నసంగతవిషయ ముండదు. ఆయాచారములు నేర్పువా రున్నారు. సన్న్యాసులు తప్పఁ దక్కినవారందఱు పామరు లనరాదు కదా. పండితు లందుల కున్నవారు. వారల కది యన్వయించును గాని సర్వసంగపరిత్యాగము చేసినయతివృషభుల కది యన్వయింపరాదు. అంతకంటెఁ బాపకార్యము లేదు. వేదాంతశ్రవణము గలుగఁ జేయుటయే వారికి విధి. తక్కినది యవిధియని మన మెఱింగి మెలంగవలయును. హనుమంతుఁడు చూచిన దేవాలయమున ననేక స్తంభము లుండుట యాకాలమునఁ గల యాగమపద్ధతి ననుసరించియే యని మనము నిర్ణయింతము. ఇందు మఱొక్కవిశేషము కలదు కాష్ఠద్వయసంయోగమున నగ్ని యుప్పతిల్లునని పూర్వులే కనుఁగొనిరి పదార్థవిజ్ఞానశాస్త్రము పూర్వకాలమున నున్నయట్లు మనము నమ్మవచ్చును. పాషాణద్వయసంయోగమున నగ్నిని గలిగించుట యిప్పటికిని గాంచుచున్నారము. పాషాణాయస్సంఘర్షణమునను గలిగించుటయుఁ గానవచ్చుచున్నది. రామాయణ మీవిషయమును గూడ

బోధించుచున్నది కదా. మన మానందపరవశులము కావచ్చును. ఇఁకఁ దరువాతికథ నరయుదము.

## హనుమంతుఁడు జంబుమాలిని వధించుట.

* రావణునానతిం గొని ప్రహస్తతనయుండగు జంబుమాలి హనుమంతునితోఁ బోరఁ బయనమయి భయంకర దంష్ట్రలు మెఱయఁ జూచువారల నాకులంపడఁ జేయురూపమునఁ బోయెను. ఆతనిసైన్యము నట్టిద యనందగినది. ధనుర్ఘోషములు నింగిముట్టినవి వేగవంతుఁడగు పవనాత్మజుఁడు జంబుమాలిరాక కానందించి యుద్ధ మింతసేపటికి మరలఁ గలిగెఁగదా యని యుబ్బుచు సింహనాద మొనరించెను మహాబలుఁడగు జంబుమాలి తోరణముపైనున్న వానరోత్తమునిపై బెడిదములగు బాణములను బఱపెను. మఱియుఁ గోఁతిమోమునఁ గత్తివాయిబాణమును గ్రుచ్చెను. సహజారుణమగు నాహనుమంతుని మొగము మఱెంత యెట్టిదైన శరత్కాలమున రవికిరణములు వ్యాపింపఁగా నున్న తామరవలెఁ గనంబడియెను. ఆరక్కసుం డిట్లు బాణముల నొప్పింపఁగా నావానరేంద్రుఁడు క్రుద్ధుఁడై తనప్రక్కనున్న చట్రాతినిలాగి బలము మెఱయించి వానిపై వైచెను దానఁ గోపించి యాజంబుమాలి బాణములఁ బదింట నాపాషాణము భస్మముచేసెను. తనసాధనము వ్యర్థము కాఁగా నొక సాలవృక్షమును బెఱికి గిఱ్ఱునఁ ద్రిప్పుచుండఁ గాంచి రాక్షసుఁ డాతనిఁ బెక్కుబాణములు వైచి మఱి నాలుగమ్ముల వైచి యాచెట్టును జూర్ణించి

* ఇది నలువదినాల్గవసర్గమునఁ గలకథాభాగమని తెలియందగు.

యతనిబుజమున నైదుశరములును హృదయమున నొకశర మును హృదయాంతరాళమునఁ బదినారసములను నాట నేసెను. హనుమ తనదేహము బాణవిద్ధము కాఁగా మహాకోప మున నాయినుపగుదియనే గ్రహించి త్రిప్పెను జంబుమాలి యొమ్మును దాఁకఁ బ్రయోగించెను. ఆవ్రేటున కాతని యవ యవభాగములలో నేదియు నచటఁ గానరాకుండెను. రథము తోడ నతఁడు చూర్ణమయ్యెను. హతశేషు లాతనిచావును దెలుప రావణుఁడు కోపంబునఁ గన్ను లెఱ్ఱవాఱఁగా మంత్రి కుమారులం బిలిచి వేగముగా వానరునితోఁ బోరఁ బొండని యాజ్ఞాపించెను. వారు నాతనియానతిం గొని బలపరాక్రమ సంపన్నులు గాన వానరుం డనుభావమున యుద్ధమునకుఁ బ్రయాణమైరి.

## హనుమంతునిచే మంత్రిపుత్త్రసప్తకము మృతినొందుట.

* రావణునాజ్ఞ శిరస్సుల ధరించి మంత్రికుమారు లేడు గురు హుతవహునరీతిఁ బ్రజ్వరిల్లుచు మహావాహినీసమేతులై ధనుస్సులు మెఱయుచుండఁగా వెడలిరి. అస్త్రవిద్యారహస్య వేత్తలగుట మహారథములనెక్కి ధనుష్టంకారముల దిక్కులఁ బిక్కటిల్లఁజేయుచు నడచిరి. వారలంగని వారితల్లులు బంధు వులును శోకించిరి. వేగమున వారెల్ల బహిర్ద్వారముననున్న హనుమంతునిపైకిఁ బోయి బాణములవర్షమున నాతనిం దడి పిరి. బాణవర్షము తన్నుఁ గప్పఁగా భూధరేంద్రముం బోలి

* ఇది నలువదియైదవసర్గమునఁ గలదు.

హనుమ యూరకుండెను. వారిబాణములు తన్నుఁ దాఁకక యుండ వారల రథవేగమునకుఁ దాఁ జిక్కకయుండఁ దప్పించుకొని విహరించుచుఁ గొంతవడి వారితో నీరీతిఁ బోరాడి యంతట వారిం బొలియింపఁగోరి గట్టిగా నార్చెను. ఆవీరులలోఁ గొందఱఁ గరతలాఘాతములను, గొందఱఁ బాదఘాతములను, గొందఱ ముష్టిఘాతములను గొందఱ నఖాయుధముల వ్రేటులను, గొందఱ హృదయస్పర్శమునను మఱికొందఱ నూరుప్రహారములను జంపెను. కొంద ఱప్లవనాత్మజుని సింహనాదమునకే చచ్చిరి. చావఁగా మిగిలినవారు లంకకుం బఱగిడిరి. త్రోవయంతయు రక్తసిక్తమయ్యెను. నగరమందంతట రోదనధ్వనులే వినఁబడసాగెను. హనుమంతుఁడు రాక్షసులతోఁ బోరఁగోరి మరల నాబహిర్ద్వారమునకే పోయి యందుండెను. హతశేషు లామరణవార్తను రావణునకుఁ దెలుపఁబోయిరి.

ఈ రెండుసర్గములందును జర్చింపఁదగినంత విశేషాంశవితతి గన్పట్టదు. కేవలయుద్ధము. నీతికిందగినవిషయము లున్నతావులనే మన మరయుదము. గ్రహింపఁదగువిషయముల గ్రహింతము. ఇంకఁ దడవు చేయక తరువాతి కథాభాగమును బఠించి యందేమేని విశేషము లున్నవా యని నెమకుదము.

## సేనాపతిపంచకము హనుమంతునిచేఁ బొలియుట.

* మంత్రికుమారులను హనుమంతుఁడు చంపుటెఱింగి రావణుఁడు మనస్సున నించుక జంకియు నితరులకుఁ దెలియ

* ఇది నలువదాఱవసర్గమునఁ గలదు.

కుండ నభినయించి చక్కనాలోచించి విరూపాక్ష యూపాక్ష దుర్ధర ప్రఘస భాసకర్ణనామములుగల సేనాపతులను రావించెను. వా రాక్షోతి నెపుడు పట్టుకొందుమా యని యువ్విళ్లూరుచుండిరి. కావున వారు రాఁగానే బలాధ్యక్షులారా! మీ రెల్లరు బలంబులం గూర్చుకొని వెడలి యావానరుని దండించియే రావలెను. మీ రావానరునికడఁ బ్రమాదం పడక వర్తింపవలయును దేశకాలవిరుద్ధకార్యములు పోసఁగ నీయకయుండఁ జూడవలయును. ఆవానరుని పనులంబట్టి యూహింపఁగా వాఁడు వానరుఁడని తోఁపకయున్నది. సకల విధముల నూహించి యతఁడొక మహాభూతముగాని వానర మాత్రుఁడు కాఁడు. ఇంద్రాదులలో నెవఁడో మనల హింసించు కొఱకు నీమహాభూతమును సృజించెనేమో · తపోబలమున నది సాగనోపు. నేను మీరును గలిసి దండయాత్ర చేసి నాగయక్షాదుల నోడించియున్నాము దానికి బదులు కీడు వారు మనకుఁ జేయవలసినదే. అదే యిది యని తలంతును ఏసందియము లిందులకుండవు. బలాత్కారమున నా భూతమును బట్టుకొనుఁడు. ఆవానరుఁడు ధైర్యపరాక్రమములఁ జూపువాఁడు కావున వానిని మీ రవమానింపకుఁడు. పూర్వము నేను వాలిసుగ్రీవ జాంబవత్ప్రముఖుల ననేకులఁ గాంచియున్నాను. వారియం దెవ్వరికిఁగాని యిట్టి శక్తులఁ జూపు నేర్పు లేదు. ఏదోయొక మహాశక్తి యీరూపమున వచ్చియున్నదని యూహింపవలసి యున్నది. మహాప్రయత్నమున వానిని గ్రహింపవలయును గదా. త్రిలోకవాసు లింద్రాదిదేవతలం గూడి యొక్కసారి మీపై కడరినను మీ

ముందు వారియాటలు సాగవు కదా. కాని యుద్ధమున జయ సిద్ధి స్థిరము కాదు కనుక నీతిజ్ఞుఁ డెవ్వఁడు కాని జయకాంక్ష గలవాఁ డగునేని ప్రయత్నమున స్వరక్షణము చూచుకొనం దగు కనుకనే మీరును జాగరూకులరై వర్తింపవలయును.

అని రావణుఁడు పలుక నాతనియానతి శిరంబులం దాల్చి మహాతేజస్వు లగువారు చతురంగబలంబులం గూడి జవము మెఱయ హనుమంతునిపైకిఁ బోయిరి. బహిర్ద్వారమున నుదయభానునిం బోలి వెలుంగుచుఁ దేజోరాశియై పట్టుదల గలిగి సకలశక్తులు వెలయనుండు హనుమంతుని గనుంగొనిరి. నలుప్రక్కల నిలిచిరి. భయంకరసాధనములం గొని తలపడిరి. దుర్ధరుఁడు వాఁడినారాచము లైదు హనుమపై నేసెను. అవి శిరమున నాటఁగాఁ బదిదిక్కులు మాఱుమ్రోఁగునట్లు సింహ నాద మొనరించెను. ఆకాశమునకు దాఁటెను. దుర్ధరుఁడు బల శాలి గాన సజ్యచాపుఁడై రథముననుండి యాకసమున కెగసి వందలకొలఁది తీవ్రనారాచములు ప్రయోగించుచుఁ బైకడ రెను. శరత్కాలమున వర్షించు మేఘమును సులభముగా వాయువు నివారించుచందమున హనుమ యాకాసమునఁ జరిం చుచు వానినుండి శరీరమును గాపాడుకొనియెను. దుర్ధ రుఁడు తనచెంతకుఁ జేరకుండునట్లు చేయఁజాలెను. కాని యా రక్కసుఁ డుక్కుమిగిలి యింకను బాధించుచుండఁగాఁ దనశరీ రము నింకను బెంచి యని సాగించెను. అంత నతిజవమున దూరమున కరిగి హఠాత్తుగాఁ బిడుగు కొండపైఁ బడున ట్లాతనిరథముపై దుమికెను. ఆపాటున రథరథ్యకేతువులు

చూర్ణములు కాఁగా దుర్ధరుఁడు వానితోడఁ దాను మృతి నొందెను.

దుర్ధరునిపాటు చూచి పరాక్రమదుర్జయుఁడగు విరూపాక్షుఁడు యూపాక్షుఁడు నను వారిరువురును క్రోధాతిరేకమున నాకాశమున కెగసిరి. అందున్న హనుమంతునివక్షమునినుపగుదియల నొప్పించిరి. వారివేగమును దనజవమున నడంచి హనుమ మరల నేలకు దిగెను. అంత నొక మద్దిచెట్టు కడకేగి పెకలించి దానివ్రేటున కా యిరువురను బలిచేసెను. ఇట్లు బలవంతులగు మూవురుదానవులు వానరోత్తమునిచేఁ జంపఁబడఁగాఁ గన్నులారఁ గాంచుచున్న ప్రఘసుఁడు హఠాత్తుగా నాహనుమపైకిఁ బోయెను. భాసకర్ణుఁడు వీర్యంబు నెఱపమిగులఁ గ్రుద్ధుఁడై శూలముం గొని వానరేంద్రునిపై కరిగెను. ప్రఘసుఁడు ఖడ్గముంబూని హనుమతోఁ బోరసాగెను. భాసకర్ణుఁడు శూలమున నొప్పింపసాగెను. ఆయిరువురు తన్ను మిక్కిలి నొప్పింపఁగా నాగ్రహించి వాయునందనుఁడు రక్తసిక్తాంగుఁడై బాలభానునిపగిదిఁ గనఁబడుచు మృగసర్పవృక్షాకీర్ణంబగు నొక పర్వతశిఖరమును బెకలించి దానివ్రేటున వారి నిరువురం జంపెను. ఇట్లా సేనాపతిపంచకము పంచత్వము నొందఁగా మిగిలినసేనల నాశము చేసెను. గజహయరథంబులఁ జూర్ణములు గావించెను. ఇట్లు వారెల్లరు చావఁగా మరల నాబహిర్ద్వారమును జేరి యమునిచందమున నూరకుండెను.

మహామతులారా! ఇందలివిశేషములఁ బరీక్షింతము

"హతాన్ మంత్రిసుతాన్ బుద్ధ్వా వానరేణ మహాత్మనా,
రావణస్సంవృతాకారశ్చకార మతిముత్తమాం." ౧

అని మూలము. మనుష్య వానరులచేఁ జావకయుండ వర మడుగక వదలిన రావణుఁడాసమయమున వానరునిచేఁ దాఁబంపిన రాక్షసవీరు లెల్ల హతులగుట విని సంవృతాకారుఁడై అనఁగా సంశయించినవాఁడై యని యర్థము. శాపము తీఱు సమయము దాఁపురకు వచ్చినదని శంకించి యని భావము. ఉత్తమాం మతిం చకార = "మతిరాగామి గోచరా" యన్న నియమము ననుసరించి రాఁగల ఫలములనుగుఱించి మంచి యాలోచన మొనరించెనని తాత్పర్యము. జానకీ సంభాషణానంతర మిది పొసఁగుటయు వానరుఁ డొక్కండె డిందఱ మహాశూరుల నక్రమంబునఁ జంపుటయు నచ్చెరువు కలిగింపఁగా వరదానకాలము స్మృతిగోచర మగుటయు సనత్కుమారుని హితము మనోవీధిఁ బొడకట్టుటయు నను నీకారణములచే నుత్తమపద్ధతి నాలోచించెననియే దీని హృదయము. మహాభక్తుఁడు మహాపండితుఁడు నగు రావణుఁడు భావిఫలముల నాలోచించుట సుసంగతమే కాని యసంగతము కాదు. కనుకనే మహర్షి వాల్మీకి మతి ముత్తమామ్=అని ప్రయోగించెను. సనత్కుమారుఁడు చెప్పినప్రకారము తా నొనరించుట దానికి ననుకూలముగా నొకకోఁతి లంకకు వచ్చి నిర్భయముగా వనభంగ మొనరించుటయ కాక పెక్కండ్ర రాక్షసవీరుల నుక్కడంచుట తలంచి కాలమును స్మరించెననియే యిందలి సారము. ఇట్టి రావణుఁడు మూర్ఖుఁ డగునా? నీతిశాస్త్ర కోవిదుఁడు రావణుఁ డనువిషయము నీక్రిందిమూలము తెలుపుచున్నది.

"యత్రైశ్చ ఖలు భావ్యం స్యా త్త మాసాద్య వనాలయం,
కర్మ చాపి సమాధేయం దేశకాలవిరోధినం. ౫

న హ్యాహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్,
సర్వథా తన్మహద్భూతం మహాబలపరిగ్రహం. ౬
భవేదింద్రేణ వా సృష్టమస్మదర్థం తపోబలాత్,"

అని మూలము. వీరులారా! వానరమాత్రుఁడని తలంచి ప్రమాదంపడి వర్తింతురేమో? అది తగదు. దేశకాలవిరోధమగుకర్మము చేయరాదు. ఆతఁడు వనాలయుఁడు. యుద్ధస్థలము ఉపవనము. అం దాతనికి బలమెక్కుడు. అటులైన యుద్ధము మానరాదా యందురేమో ఈకాలము దనుజులకుఁ బ్రధానము. కావున సమానముగా బలముగలదు. ఐన జాగ్రత్త గలిగియుండు టుత్తమము. అనఁగా బలవంతుఁ డగు శత్రువును సమీపింపక యుద్ధనైపుణ్యము గలిగి మెలఁగుఁడని హృదయము. సేనాపతులారా! ఆతని కార్యములఁబట్టి నే నతని గపిమాత్రునిగా భావింపను. కపుల నే నెఱుంగుదును. వారివాక్యములు వేఱు. ఈ కపివాక్యములు వేఱు. కనుక సర్వప్రకారములచేత నతిశయబలపరాక్రమములుగల మహాభూతమునుగా నిర్ణయించుచున్నాను. పృథివ్యాదిపంచభూతములలో బలవత్తరము వాయువు. కావున నే మహాబలుఁడని వాయువునకుఁ బేరుగలదు. అట్టిభూత మిది యని యాశయము. వాయుకుమారుఁడు కానోపునని యూహ. మనలఁ జంపఁ దపం బొనరించి యింద్రుఁడో మఱొక దిక్పాలకుఁడో దీనిని బుట్టించియుండును. అనఁగాఁ గపులవలన మరణము కలుగఁగూడదని నేను బ్రహ్మను వరమడుగలేదు. కనుక నా వానరరూపమున నీతనిఁ బుట్టించియుందురని యతని యూహ. నేనెట్లు తపోబలమున నింతటిబలము నార్జించితినో యింద్రా

దులుకూడ నాబాధల ననుభవింపఁజాలక గట్టితపము సల్పి దీనిని సృజించియుందురని శంకించెను. ఈశంక యుక్తమే. తపోబల మెఱింగినవారలకు దానిశక్తి తెలిసియుండును. అది లేనివారికిఁ దపశ్శక్తి యెట్లు తెలియును? ఈకాలమున ననేకులు మహర్షులు కలరు. కాని వారు నిర్విష సర్పరాజముల కరణిఁ దపోబలవిరహితులు. శాపానుగ్రహసామర్థ్యములు లేని వారల ఋషులనుటఁ బరిహాసాస్పదము. అనేకబిరుదములలో నదియు నొకబిరుద మనందగియుండును. ఋషులే లేరని యీ వ్రాఁత బోధింపదు. వృద్ధులను బాలురనుగాఁ జేయు శక్తిగల సిద్ధులుగలరు. వాగ్బాణులును గలరు. వారలు హిమాలయమునఁ గలరు. పుణ్యగిరులయందును గలరు. కాని వారు గూఢవర్తనులు. ఇతరులపాగడ్తలకు వారు గుఱికారు. ఆత్మారాములు. పరిహితప్రవణులు నగుదురు. అట్టివారే ఋషులు. బిరుదములు గలఋషు లనేకు లుండవచ్చును.

"తదేవ నాత్ర సందేహః ప్రసహ్య పరిగృహ్యతామ్,
నావమాన్యో భవద్భి శ్చ హరి ర్ధీరపరాక్రమః. ౯

... ... ... ... ...

నీల స్సేనాపతి శ్చైవ యే చాన్యే ద్వివిదాదయః,
నైవం తేషాం గతిర్భీమా న తేజో న పరాక్రమః. ౧౧

న మతి ర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్,
మహ త్సత్త్వ మిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితం. ౧౨

ప్రయత్నం మహ దాస్థాయ క్రియతా మస్య నిగ్రహః,
... ... ... ... ... ...

తథాపి తు నయజ్ఞేన జయ మాకాంక్షతా రణే. ౧౪

ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధి ర్హి చంచలా,"

అని మూలము. ఇవియన్నియు రావణుని నీతిజ్ఞతను దెట పఱచుచున్నవి. దేవతల నోడించితిమి వారు సమయమున మన కపకారముచేయుట న్యాయ్యమే కదా ? ఆయపకారమే యీ మహాభూతమని తలంచి బలము గనఁబఱచి పట్టుకొనవలెను. అను నీవాక్యముంబట్టి దేవతలు పగసాధింపఁ బూనియుండుట ధర్మమే యనియు వారిప్రయత్నమే యీభూతమనియు రావణుని యాశయము. దేవతలప్రార్థనము విని భగవంతుఁ డవతరించునని సనత్కుమారుఁడు చెప్పినమాట యతని కపుడు స్మృతికిం దగిలినది. తచ్చిహ్నమే యీ మహాభూతమని యెఱింగెను. సేనాపతులారా! యీహరి ధీరపరాక్రముఁడు· పండితుఁడు. శూరుఁడు నగును. కావున మీరతని నవమానింపరాదని రావణుం డనియెఁ గదా. ఏల? తన శరీరముక్తికి హేతుభూతురాలు సీతాదేవి. ఆమెకడకు వచ్చినవాఁడు పుణ్యాత్ముఁడుగా నుండక తప్పదు. అట్టిమహాభక్తుని సాగరము నుత్తరించివచ్చిన పరాక్రమశాలి నవమానింపరాదని నీతి. ఒకవేళ మీకు దొరికినను మర్యాద నతిక్రమింపక వర్తింపవలయునని యతనిభావము. అట్టిరావణుఁ డామూర్ఖుఁడు? నే నీవఱకుఁ జూచినవానరుల కింతటి బలపరాక్రమాదులు లేవు. కపిరూపమునఁ దోఁచెడు మహాతత్త్వ మిది నిర్ణయింపందగు. అనఁగాఁ బ్రకృతిపురుషులు పరస్పర మవలోకింపఁ గలిగినదే మహత్తత్త్వము. అదే యిది. అనఁగాఁ బ్రకృతిపురుషులగు సీతారాముల కటాక్షపాత్రమగువ్యక్తి యిది. దీనికిఁ గలశక్తియే

కపులకుఁ గలదు? వేనికి నుండదని భావము. అట్టిమహాత్ముఁడు దొరకిన నవమానింపరాదని హెచ్చరించుచున్నాఁడు. తన ముక్తి కిదియొక సాధనమని యతఁడు తలంచెను. కావుననే తనబలములఁ జంపినను గూడ నానందించుచున్నాఁడు. మహా ప్రయత్నము చేసి జయింపుఁడని వారినిఁ బురికొలుపుచున్నాఁడు. రణమున జయముకొఱకు నీతిజ్ఞుఁడు తొలుత నెన్ని యత్నములు చేసియైనఁ దన్నుఁ గాపాడుకొనవలయును. జయము స్థిరము కాదు అనఁగా జయపరాజయములు నిలుకడఁ గలవిగావు కావున నాత్మరక్షణము ప్రధానము. శత్రు విజయము తరువాతిదని రావణుఁడు చెప్పుచున్నాఁడు. దీనిచే నాతని నీతిశాస్త్రపాండిత్యము జ్ఞానమహత్త్వము తేటపడుచున్నది.

"అనిత్యో విజయో యస్మా ద్దృశ్యతే యుధ్యమానయోః,
పరాజయశ్చ సంగ్రామే తస్మా ద్యుద్ధం వివర్జయేత్. ౧౯౯
త్రయాణా మప్యుపాయానాం పూర్వోక్తానా మసంభవే,
తథా యుధ్యేత సంపన్నో విజయేత రిపూ న్యథా." ౨౦౦
మను. ౭ అ.

అను నీ మనుస్మృతివాక్యముల నెఱింగినచందము రావణుని మాటలే తెల్పుచున్నవి కేవల దుర్మదాంధుఁడు రావణుం డనుటకంటె నల్పజ్ఞత వేఱుగానుండదు.

ఇంత తెలిసినవాఁడు యుద్ధమేల చేయఁబూనెనని కొందఱు ప్రశ్నింతురు. అది విచారమూలము గాని ప్రశ్నము. ఎవరెవరు తనమూలమున రణమునఁ జావవలయునో వారి

కడి కలుగునట్లు ప్రయత్నింపక మాననయితి గాదు. గీతా వాక్య మిట్లే బోధించును.

"స్వభావజేనకౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్."

అనునదియే యీ గీతావాక్యము. కర్మసిద్ధాంతము బలవత్తమ మని భగవంతుఁడు తెలుపుచుండఁగా నిఁక వాదించుట తెలివి తక్కువ గాక మతేమి? ఇట్టు లీఘట్టము రావణాసురవర్యుని నీతిజ్ఞతను వెల్లడించుచున్నది.

## హనుమంతుఁ డక్షకుమారునిఁ బొలియించుట.

* సేనాపతులు బలములతో నంతకుచెంత కరుగుట హతశేషులగు దనుజులమూలమున నెఱింగి రావణుండు రణక్రీడాభిరాముఁడగు నక్షకుమారుఁడు ముందుండం గాంచెను. ఆచూపుచేతనే యతఁడు యుద్ధమునకుఁ బురికొల్పఁబడినట్టు లయ్యెను. ధనుశ్శరాదిసాధనములం గొని బ్రాహ్మణోత్తములు హవిస్సు వ్రేల్చి వర్ధిల్లఁజేయఁగా జ్వాలలు పయికిలేచు నగ్నివలె నాసభనుండి లేచెను. బంగారురథమెక్కి హనుమంతునిపై కరిగెను. ఆరథమును దపస్సుచేసి యతఁడు సంపాదించెను. అది సామాన్యస్యందనము కాదు. సకల పరికరసంభృతము. సూర్యస్యందన ప్రతీకాశము. మహాయుధము లందు వెలుంగుచుండెను. అనేకచాపములు శరములు లోనగునవి లెక్కకు మిక్కిలిగా నుండెను. ఆరథ మాకాశమున సూర్యరథమువలె

* ఇది నలువదియేడవసర్గమునఁ గల కథ.

సంచరింపఁ గలదు. ఇంద్రపరాక్రమశాలియగు నక్షకుమారుఁ డాస్యందనము నెక్కి సేనాసమన్వితుఁడై గతివేగమునఁ గలుగుధ్వనులచే దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచు నశోకవనబహిర్ద్వారమునఁ గూరుచున్న యాహనుమంతునిఁ జేరవచ్చెను. సింహదృష్టిగల యా యక్షకుమారుఁడు ప్రాణిసంహారణతత్పరుఁ డగు ప్రళయకాలాగ్నివలెఁ గనఁబడుచు హనుమకడకుఁ బోయి యాతని యాకృతివిశేషమును యుద్ధసన్నాహమును బరికించి యచ్చెరువు సంభ్రమము కలుగఁగా నీతఁడు మహావీరుఁడుగాని సామాన్యుఁడు కాఁడని తలంచి సగౌరవదృష్టి నా శూరోత్తమునిఁ దిలకించెను. మఱియు నాతనిలక్షణములం గాంచి తన బలాదులను నిర్ణయించుకొని వసంతకాలమున భానుఁడు వృద్ధి నొందునట్లు తేజంబున వెలింగెను.

అట్లు సంగరమున సన్నద్ధుఁడై నిలిచి యాయక్షుఁడు హనుమపరాక్రము నూహించి యతనిజయించుట మహాశ్రమ మనియు నెఱింగి కోపంబుఁ దెచ్చుకొని కడుజాగ్రత్త గలవాఁ డగుచు వాఁడులగు నారసములు మూఁడు వైచి యాకపివీరుని యుద్ధమునకుఁ బురికొలిపెను. ఆకపివీరుఁడు గర్వి యనియు నెంతటి కష్టమునైన లెక్కింపక మహాలాఘవమునఁ బగవారి నోడింపఁజాలుననియుఁ బరికించి తాను నట్టివాఁడే గావున మనోగర్వము మెఱయఁ గేల శరశరాసనంబులఁ దాల్చి యాకపిపై యుద్ధమును దెలుపుచూపుఁ బఱపెను. అత్తఱి వారిపోరాటము సాటిలేనిదై దేవాసురులనెల్లర విభ్రాంతులనుగా నొనరించెను. ఆసంగరమును గాంచి భూమి మ్రోసెను. ఎందో యున్నసూర్యుఁ డడలెను. వాయువు స్తం

భించెను. పర్వతము లూగెను. ఆకసము ధ్వనించెను. సముద్రము కలఁగినది. లక్ష్యశరసంధాన విమోచనదక్షుఁడగు నా యక్షకుమారుఁడు విషలిప్తశరత్రయము హనుమ శిరమున నాట నేసెను దాన నెత్తురుపాఱి నాతనివలయము లగు కన్నులు తడిసి శరీరము తడియఁగా నుదయభానునిభంగి రక్తమయాంగుఁడై యరుణమండలముభంగిఁ గానఁబడియెను. ఇఁక నూరకుండరాదని పావని యాతనిం దలపడియెను. అత్తఱి నా యనిలకుమారుఁడు భూమధ్యమునసుండు మందరపర్వత శిఖరమునకు వచ్చియున్న మధ్యాహ్నసూర్యునివలె నుగ్రుఁడై కోపాగ్నిజ్వాలలు వెడల నాయక్షకుమారుని నాతనిబలమును జక్కఁగాఁ జూచెను. అంతలో నారావణతనయుఁడు బాణ వర్షమున నతని పర్వతాకారమును ముంచెను. సింహనాద మొనరించెను. ఆతఁడు బాలుఁడు కనుక నాహనుమశక్తి యింతయని యెఱుంగఁడు. పరాక్రమగర్వమునఁ గోపము వృద్ధి కాఁగా నాతనిపై కడరెను.

హనుమ యతని సాయకబాధకు నోర్చికొని గట్టిగా ధ్వనించుచుఁ గరముల నూరువుల విదుర్చుచు నాకసమున కెగసెను. అతఁడు డాతనిపై బాణముల వైచుచుఁ దాను నంబరమున కెగసెను. ఆబాణంబులు తన్నుఁ దాఁకకుండునట్లు చరించుచు హనుమ యంబరమున విహరించెను. హనుమను బాణముల నొప్పించుచుఁ దాను నాకసమునఁ జరించుచుండఁగా నారావణ కుమారుని సగౌరవదృష్టిఁ గాంచి పావని "యింతటి వీరునెట్లు చంపఁగలను" అని చింతింపఁ బూనెను. అంతలో నారాక్షస వీరుఁ డాతనివక్షము బాణంబుల భేదించెను. దాన మఱింత

యాగ్రహించి పెడబొబ్బ యిడి యాతనిం జంపఁబూని తనలోని ట్లూహించెను. వీఁడు సామాన్యుఁడు కాఁడు. బలశాలి. బాలసూర్య సంకాశ తేజుఁడు. బాలుఁడయ్యును బెద్దవారివలె యుద్ధముల నాఱితేఱినవాఁడు. మహాహవము నిపుడు చేయుచున్నాఁడు. సమస్త యుద్ధతంత్ర వేత్త. అట్టి వీనిని జంపవలయునన్న మనస్సు రాకయున్నది. మఱియు నీతఁడు మహాత్ముఁడు. పరాక్రమమునఁ బేరు గన్నవాఁడు. కష్టముల నోర్చువాఁడు. కనుక వీనిని నాగయక్షదేవతాదులు మునులును బూజించుచుందురు. ఇందులకు సందియములే లేవు. పరాక్రమోత్సాహములు నెక్కొనఁగా వీఁడు నాయెదుట నిలువఁబడి నన్నే చూచుచున్నవాఁడు వీని యురవడిం బరికింపఁగా సురాసురుల గుండియ లవియునని తోఁచెడిని. వీని నిఁకఁ జంపక యుపేక్షించినయెడల నన్నుఁ గ్రిందుపఱుపక మానఁడు. వీని శౌర్యము ప్రతిక్షణవృద్ధిని గాంచుచున్నది. ఇంక నూరక యున్న నది యేమగునో? కనుక నాలసింపక పొలియించుటయే సముచితముగా నున్నది. మించి కాల్చునగ్ని నుపేక్షింపక యార్పవలయుం గదా యని యూహించెను.

ఇట్లు వీర్యవంతుఁడగు హనుమ యాలోచించి తాను జేయందగు సమరవిధానము నాలోచించుకొనుచు నతనిం జంపుతలంపు గొని యంతఁ దనయురవడి హెచ్చింపసాగెను. అంత వాయుకుమారుఁడు జవము మెఱయించి సవ్యాపసవ్యములగు చిత్రగతులుగాఁ బోవునపుడు అక్షకుమారుని రథ్యముల నెనిమిదింటిని గరతలఘాతమునఁ జంపెను. ఆవ్రేటునకే చక్రములు విఱిగెను. నొగపఱియ లయ్యెను. గుజ్జములు

మ్రందెను. రథ మాకసమునుండి క్రిందఁ బడియెను. అక్షకుమారుఁడును మహోగ్రపరాక్రముఁడు గావున రథము డిగ్గనుఱికి శరాసనఖడ్గములం గైకొని మహర్షి తపోమహత్త్వమున దేహమును వదలి దేవలోకమున కరుగునట్లు నింగి కెగిరెను. ఇట్లంబరమున విహరించు నా దనుజరాజతనయునిం గని పావని వానిం గూడఁ బోవఁ గదిసి తటాలున వానికాళ్లనొడిసి గట్టిగాఁ బట్టుకొని సహస్రవారములు త్రిప్పి జవమున నేలపయిం బడఁగొట్టెను. వాని సర్వాంగములు తిలప్రమాణశకలములయ్యెను. అక్షుఁ డిట్లు మృతి నొందెను. అతనిం జంపి వాయుతనయుఁడు రావణునకు మహాభీతిని గల్గింపఁజాలెను. శింశుమారచక్రంబునం గలమహర్షులు భూతములు పన్నగులు నింద్రాదులు నచ్చెరువంది హనుమంతునిఁ గాంచి సంతసించిరి. అక్షకుమారు నీచందంబున మ్రందించి యథాపూర్వముగా బహిర్ద్వారమును జేరి హనుమంతుఁ డూరకుండెను

మహాభక్తులారా! యీభాగమునఁ గలవిశేషములఁ గనుఁగొందము.

"సమీక్ష్య రాజా సమరోద్ధతోన్ముఖం,
కుమారమక్షం ప్రసమైక్షతాగ్రతః.
తదస్య దృష్ట్యర్పణసంప్రబోధితః ౧
ప్రతాపవాన్ కాంచనచిత్రకార్ముకః.
సముత్పపా తాథ సద స్యుదీరితో
ద్విజాదిముఖ్యై ర్హవిషేవ పావకః." ౨

అని మూలము. "కాల స్సృజతి భూతాని కాల స్సంహరతి ప్రజాః" అన్నసూక్తి యతిప్రాచీనము కదా. పంచసేనాపతి మృతి

వార్త వినఁబడఁగా రావణుని నేత్రగోళములయందు వసించి మృత్యుదేవత అక్షకుమారునిఁ జూడుమని పురికొలిపెను. ఎప్పు డెపుడు సమరమునకు వెడలుదునా యని త్వరపడుచున్న కుమా రుని రావణుఁడు చూచెను. అంతియకాని యింతకుముందు రణమునకుఁ బొమ్మని యాజ్ఞాపించినట్లు అక్షకుమారు నాజ్ఞా పింపలేదు. సేనాపతులకుఁ గఱపిననీతిని దెలుపఁ బూనలేదు. రావణుని దృష్టులమూలమునఁ దనయదృశ్యరశ్మిలం గలిగించి మృత్యువా యక్షకుమారు నీడ్చినది రావణునిచూపులు పొలయుట అతఁడు సభనుండి లేచుట యేకకాలమున జరిగిన కార్యములు.

"భూతానా మంతకృ త్కాలః కాలోఽన్యః కలనాత్మకః."

అన్న సారోపనిషద్వాక్యము వ్యర్థమగునా? కాలరూపుఁ డీభగవంతుఁడు. కాలమునకు రూపాదికల్పన యెట్టిదో భగ వంతునకు నది యట్టిది. మనవ్యవహారార్థ మెట్లు కాలమున కఖండమునకు ఖండత్వము కల్పింతుమో యుపాసకులు స్వోప యోగార్థము నామరూపాదులను భగవంతునకుఁ గలవని కల్పింతురు. కాలకర్త భగవంతులొక్కటియ. వారితలంపులకు నడ్డులేదు. మార్పులేదు. కాలమను ఘటికాయంత్రమునకు నప్పు డపుడు మైలతుడువ నవసరముండదు సర్వదా నిర్మలముగా నది యుండును. అట్టికాలరూపభగవంతుఁ డక్షకుమారా! యీ తనువు మోయఁజాలవు. లెమ్మా యిఁకనా లోనికి రమ్మా యని కాలము పురికొల్పఁగా నస్వతంత్రుఁ డగునతఁ డేమిచేయఁ గలఁడు? వేదాంతు లించుక స్వాతంత్ర్యము కలదందురు. అది మిథ్యారోపితస్వాతంత్ర్యమే గాని పారమార్థికదృష్టి నాలో

చింప నవిదబ్బుఱు. కర్మమునకే కర్తృత్వ మారోపించినమానవు నకుఁ బుణ్యపాపములు లేవనవలసివచ్చునేమో యనుశంక యొదవుటం జేసి కొంతస్వాతంత్ర్యము గలదనిరి కాని కలదన్నది ఫలవంతముగావని యీఘట్టమే మనకుఁ దెల్పుచున్నది. అక్షకుమారుఁడు తక్కినవారికంటెఁ బ్రేమాస్పదుఁడు. ఔరసుఁడు. అతనికి సేనాపతులకుఁ దెల్పినట్లు నీతులు విశేషించి తెలుపవలసియుండెను. ఆపని రావణుఁడు చేసెనా? ఏల చేయలేదు అంత తడవులేదు కాలము సమీపించుచున్నది. ఎవరు ముఖమెత్తి మాటాడఁగలఁడు. రావణుఁడు చూడకముందే యతఁ డభిముఖుఁడై యున్నయట్లు వాల్మీకి తెలిపెను "సమరోద్ధతోన్ముఖం కుమార మక్షమ్"అని కథామూలము. రావణునిదృష్టి యుద్ధోన్ముఖుండగు నక్షకుమారునిపై వ్యాపించెననఁగా ముందేది? వెనుకనేది? అని యూహింపవలయుఁ గదా. కనుకనే గీతాశాస్త్రము. "గహనా కర్మణోగతిః" అని యొక్కమాట చెప్పి నమస్కరించి నోరుమూసెను. ఏల? దానితత్త్వ మెఱుంగ రానిదియే ఇప్పట్టున నొక చిట్టికథవ్రాయుట యధిక ప్రసంగము కాదనవచ్చును.

ఒకయోగి తపమొనరించుచుఁ గాలతత్త్వ మెట్టిదని తర్కించుకొన నారంభించెను. ఏకాంతవాసము గనుక రెండవవాఁడు లేమిఁ గలహింప నవకాశము లేకపోయెను. వెఱ్ఱియెత్తినట్లు దానిపుట్టుకస్థితిలయము ననువానిని దలఁపోయుచుండెను. స్నానముచేయుతరుణ మాసన్నమయ్యెను ఈయూహాలు పొలయుచుండఁగనే కమండలువు తీరమున నునిచి సరస్సులో దిగియెను. నీట మునిఁగెను. లేచుటకుఁ గొలఁదినిమేష

ములుకూడఁ బట్టవు కదా. అంతలో భగవంతుఁ డతనికి బుద్ధి చెప్ప గోరెను. అతఁ డొకచోటికిఁ బోయినట్లు వివాహము చేసికొనినట్లు అదియొక నీచవర్ణమయినట్లు, ఆసంతాన మొక గ్రామముగా నుండఁదగినట్లు వారెల్లరు నొకసారి చచ్చినట్లు సంసారము చాలవత్సరములు చేసినట్లు ధనార్జనవ్యయములు వాని లెక్కలు మొదలుగునవి లిఖింపఁబడినట్లు ఇఁక నెన్నియో వ్యాపారములు సాగినట్లు ఆయత్యల్పకాలమునఁ దోఁచెను ఇంతేదియు నబద్ధమన్నచోఁ బైఁబడి ప్రహరించునట్టివిగనే యుండెను. జలములనుండి లేచెను. ఒడ్డుననున్న వస్తువు లట్లే యున్నవి కమండులు వట్లేయున్నది. యథాపూర్వకాలమే. యది. ఆతని కెంతయోవిచారము కలిగెను. యోజింపఁగా యోజింపఁగా నేను గాలతత్త్వ మెఱుంగఁగోరితిని. అది దురవగాహమని తెలుపుట కిట మునిఁగిన క్షణకాలమున నిన్ని వింతలు గలిగినవి. నాయవివేకిత నడంపఁ బరమేశ్వరుఁ డీయుక్తిఁ బన్నెను. భగవత్తత్త్వము నెఱుంగఁగోరుట సాధ్యమా. అది యనంత మవాఙ్మానసగోచరము నగుంగదా. అని తలపోసి యింటికిం బోయి నాఁటంగోలె నావిచారమును మాని "గహనా కర్మణోగతిః" అన్న గీతావాక్యమును స్మరించుకొనుచుండెను. ఈకథ చాలఁ బెద్దది. ఒక్కవిధమగు రామాయణములోనిదే. దానిసారమును వ్రాసితిని. కర్మసిద్ధాంతము అప్రతర్క్యమనియుఁ ద్రిమూర్తులు కర్మబద్ధులే యనియు నిందలిసారమని గ్రహింపవలయును. అక్షకుమారుఁడు మృత్యువదృశ్యపాశముల బంధించి లాగఁగాఁ దానే హనుమంతుని పైకిఁ బోయెనని యిందుఁగల హృదయమని గ్రహింపవలయును.

"స తం సమాసాద్య హరిం హరీశ్వరో
యుగాంతకాలాగ్ని మివ ప్రజాక్షయే,
అవస్థితం విస్మితజాతసంభ్రమ
స్సమైక్ష తాక్షో బహుమానచక్షుషా." ౯

అని మూలము. ఇదియుఁ బైన వ్రాసినభావమును మఱింత దృఢత నొందించుచున్నది. తమవారినిఁ జంపి విఱ్ఱవీఁగుచున్న యీవానరు నక్షుఁడు సమీపించి చూచెను. అతనిదృష్టి కాహనుమ యపుడు ప్రజాక్షయముచేయు ప్రళయకాలాగ్ని వలెఁ దోఁచెను. అనఁగా భావమేమి? తనకు మృత్యువువలెఁ జూడఁగనే తోఁచెననియే కదా. కనుకనే విస్మయము తొందఱపాటుగలవాఁ డయ్యెను అక్షుఁ డుదారుఁడు కాననే యీ శూరోత్తముని మర్యాదతోఁ గాంచెను. అనఁగా.

"సర్వః కృచ్ఛ్రగతోఽపి వాంఛతి జన స్సత్త్వానురూపం ఫలమ్."

అన్నసూక్తి ననుసరించి తనసత్త్వమునకుఁ దగిన ట్లతఁడు పగవాఁడైనను మెచ్చుకొనెను. "నైజగుణం న ముంచతి" అనుట సుప్రసిద్ధమే కదా. నీచుఁడైన నెదుటివానిని మెచ్చుకొనఁడు. రావణసంతతి సద్వంశమని యుదారస్వభావవంతమని యీ భాగము తెల్పుచున్నది.

"స జాతమన్యుః ప్రసమీక్ష్య విక్రమం
స్థిరం స్థితస్సంయతి దుర్నివారణం,
సమాహితాత్మా హనుమంతమాహవే
ప్రచోదయామాస శరైస్త్రిభి శ్శితైః." ౧౦

అని మూలము. తనవారిఁ జంపెఁగదా యన్నకోప మతనికిం గల్గుట సహజమే. ఆత్మబల పరబలముల నెఱింగినవాఁడే యక్ష

కుమారుఁడని తేలెడిని. యుద్ధమున హనుమంతు నోడించుట సాధ్యము కాదనియు నెఱింగెను. చేయఁదగినపని శ్రద్ధగాఁ జేయవలయుఁ గదా. తరువాత "ఫలం భాగ్యానుసారతః" అన్నసూక్తిననుసరించి ఫలించును. కనుకనే సమాహితాత్మా= బుద్ధినంతయు నేకముఖముగా నొనరించెను. స్థిరచిత్తుఁడు కాక యేపనిని జక్కఁగాఁ జేయఁజాలఁడని భావము. మూఁడు వాడి బాణములు వైచి హనుమను సంగరమునకుఁ బురికొలిపెను. బాణమోక్షకాలమున స్వకీయదేవతల నేకాగ్రమనస్కుఁడై ధ్యానించి యుద్ధమున కున్ముఖుఁ డయ్యెనని యిందలి యాశయము. ఉపాసకుఁడు తాఁ జేయఁబూను ప్రతికార్యమునందును దొలుత నిష్టదేవతకు నమస్కరింపవలయు. పూనినకార్యమునకుఁ దోడుసూపవలయునని ప్రార్థింపవలయును. ఆప్రార్థన యనన్యమతి యై చేయవలయును. మనశ్శుద్ధిలేక యేపనియు ఫలింపదుగదా. చిత్తశుద్ధిగలిగి చేసినకార్యమే తదనురూప ఫల మొసంగును.

"శ్రద్ధధాన శ్శుభాం విద్యా మాదదీ తావరాదపి,
అంత్యా దపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులా దపి. ౨౩౮
మను. ౨ అ.

యే మే మతమిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. ౩౧
శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. ౩౯
అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః." ౪౦ గీత.

అను నీసూక్తులు శ్రద్ధాప్రధానములుగ నారంభింపందగినవి కర్మములని తేటపఱచుచున్నది. అది లేనిచో నిష్ఫలము లే యగునని స్పష్టము చేయుచున్నవి. సత్కార్యములం జేయఁగోరు వాఁడు శ్రద్ధావంతుఁడు కావలయుననియు నతఁడే స్థిరచిత్తుఁ డని చెప్పఁబడుననియు సమాహితాత్ముఁ డనఁగా నొకవిష యమునందే యాత్మను నిలిపినవాఁడనియు భావములని యెఱుంగవలయు. మనస్సు బహుభంగులం బరువెత్తుచుం డఁగాఁ జేయుజపము నిష్ఫలమని తంత్రములు ఘోషించు చున్నవి. సదుద్దేశము సద్వాక్కు సత్కర్మము ననునవి మూఁడును గలిసిననే సమాహితాత్ముఁ డనంబడును. సత్సం కల్ప మున్నను దుర్వాక్యోచ్చారణము దుష్కర్మరతియు నుండిన నదియు నిష్ఫలమే యగును. త్రికరణశుద్ధి గలవాఁడే సమాహితాత్ముఁడని తాత్పర్యము. ఇష్టదేవతాధ్యానమునం గార్యసిద్ధియగునా యని కొంద ఱడుగుదురు. చేయఁదగినపద్ధతి యదియనియు ఫలము కర్మానుసారము లభించుననియుఁ గర్మానురూపముగా లభించుఫలమునకుఁ బ్రయత్న మేటికను ప్రశ్న మజ్ఞానమూలమే యనియు దైవపరున కేకార్యములు ఫలింపవనియుఁ జేయఁదగినకర్మముల నాచరించుచు ఫలప్రాప్తి యం దసక్తుఁడై యుండవలయుననియు సమాధానము.

"సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత!
కుర్యాద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్."

అనుగీతావాక్యము పైన వ్రాసినదానిని సిద్ధాంతము చేయు చున్నదని యెఱుంగవలయును.

"దదాహ భూమిర్న తతాప భానుమాన్
వవౌ న వాయుః ప్రచచాలచానలః."

అని మూలము. సూర్యుఁ డెండ కాయ మానెననఁగా నారాత్రి కాలమున నెండకాయునా యని కొందఱాక్షేపించిరి. లోక బాంధవుఁ డగుసూర్యుఁడు తనశిష్యుఁడు మహావీరునితో యుద్ధముచేయఁ బూనుటఁ జింగి నిష్ప్రభుఁడయ్యెనని తాత్పర్య మని యెఱుంగందగు. యవకోటిపత్తనము లంకకుఁ దూర్పు దెసయం దున్నది. రోమకపత్తనము పడమర నున్నది. క్రింది భాగమున సిద్ధపురమున్నది. ఈనాలుగు భూగోళమున సమాం తరములుగా నున్నవి. ఒకపురమునుండి వేఱొకనగరమునకు సూర్యబింబము నడచుటకు రెండుజాములు పట్టునని తాత్ప ర్యము. సూర్యబింబమునకు గతిగలదా యని ప్రశ్నించు మహాత్ము లుందురు. తప్పక కలదనియు నది భూమిచుట్టు మాత్రము తిరుగదనియు దాని నాకర్షించు నక్షత్రపుంజము చుట్టుతిరుగుననియు వా రెఱుంగుట తెలుఁగు. ఆచర్చ యిచ్చో నక్కఱయుండదు. ఈయుద్ధము సాగునప్పటికి లంకో దయము కాలేదనియు యవకోటిపురము లంకానగరము అను నీ రెండింటినడుమ సూర్యుఁ డుండుసమయమనియుఁ బాఠక మహాశయు లెఱుంగుదురు గాక.

"స మందరాగ్రస్థ ఇవాంశుమాలికో
 వివృద్ధకోపోబలవీర్యసంయుతః,
కుమారమక్షం సబలం స వాహనం
 దదాహ నేత్రాగ్నిమరీచిభి స్తదా." ౧౭

అని మూలము. "మందరాగ్రస్థః మందరోనామ సాలగ్రామ పర్వ

తో త్తరభాగే భారతఖండ మధ్యే వర్తమానః కశ్చనపర్వతః తదగ్రస్థః అనేన ఉత్తరాయణే మధ్యాహ్నగతత్వముక్తం భవతి." అని రామానుజీయమనువ్యాఖ్య తెలిపెను. ఆకాశరామన్న పంచాంగమన్నట్లు ఏల యీ వ్యర్థకల్పన. అసంగతముకూడ నిది యగును. సాలగ్రామపర్వత మొకఁడున్నట్లు అద్దానికి నుత్తరభాగమున నీమందరాద్రి యున్నట్లుగ నసత్యకల్పన యేల చేయవలయును. ఈరెండు నసంగతములే. ఇందుపమానముగా గ్రహింపవలయునే కాని వేఱుగాదు. మందరపర్వతము పైభాగమున నున్న సూర్యబింబముమాడ్కి హనుమ ప్రకాశించెనని చెప్పవలయు. మందరాద్రి యొందున్న నేమి? ఉపమానము కదా. దానికి భూగోళశాస్త్రజ్ఞానము కలదని చూపఁ బూననేలాకో? అక్షకుమారునిబాణములు తగుల రక్తము స్రవింపఁగా వాని దహింపఁబూని కోపమున నెఱ్ఱగా నేత్రములుండఁగా హనుమ ప్రకాశించెనని కథాభాగము.

"అవైక్షత తాక్షం బహుమానచక్షుషా
జగామ చింతాం చ స మారుతాత్మజః. ౨౪

అబాలవ ద్బాలదివాకరప్రభః
కరోత్యయం కర్మ మహ న్మహాబలః,
న చాస్య సర్వాహవకర్మశోభినః
ప్రమాపణే మే మతి రత్ర జాయతే. ౨౮

అయం మహాత్మాచ మహాంశ్చ వీర్యత
స్సమాహితశ్చాతిసహశ్చ సంయుగే,

అసంశయం కర్మగుణోదయా దయం
సనాగయక్షై ర్మునిభిశ్చ పూజితః. ౨౭
పరాక్ర మోత్సాహవివృద్ధమానస
స్సమీక్షతేమాం ప్రముఖాగ్రత స్థితః,
పరాక్ర మో హ్యస్య మనాంసి కంపయే
త్సురాసురాణా మపి శీఘ్ర గామినః." ౨౮

అని మూలము. తనతోఁగూడఁ బోరాడఁ రథసహితుఁడై యంబరమునఁ దిరుగుచున్న రావణకుమారు నక్షునిం గాంచి హనుమ యాలోచించు విషయ మిదియని కథాసారము. అక్షకుమారుని బొలియింప హనుమకు మనస్సు కలుగలేదు. కావునఁ దదనురూపము లగునూహలు పొడమసాగెను. రూప మేవాస్య మహిమానం వ్యాచష్టే = అని శ్రుతి తెలుపుచున్నది. అక్షకుమారుని గాంచఁగనే యతఁ డసామాన్య విక్రమశాలి యని హనుమ యెఱింగెను. "బాలదివాకర ప్రభః" అనుటఁ జేసి లేఁతప్రాయము తోఁచును. "మహాత్కర్మ కరో త్యయమ్" అనుటచే నదివఱకుఁ దాఁజూచి యెఱుంగని రణక్రియాదక్షుఁడని తేలెడిని. "మహాబలః" అనుటచే నతని బాణముల సంస్పర్శము దృఢతరమని యెన్నందగియున్నది కావుననే బహుమానచక్షుషా అక్ష మవైక్షత=మర్యాదతోడి చూపులచే నతని హనుమంతుఁడు చూచెనను వాల్మీకి వాక్యము సార్థకమే యగుచున్నది. తనబుద్ధి ననుసరించియే ప్రతివ్యక్తియు నూహింపఁజాలును గాని దానినిమించి యూహింపఁ జాలఁడనుట సిద్ధాంత మే యని యీఘట్టమే మనకుఁ దెలుపుచున్నది. శక్తి యెందున్నను శక్తిమంతుఁడు మెచ్చు

కొనును. అనునీతి నీభాగము దృఢపఱచుచున్నది. సర్వాహవ కర్మశోభినః అస్య ప్రమాపణే మే మతి రత్ర న జాయతే = యుద్ధసర్వస్వవేత్తయగు నీకూరునివధింప నాకిపుడు బుద్ధిపుట్టక యున్నది. అని హనుమంతుఁ డూహించుట సమంజసమే యన వలసియున్నది. ఏలయనఁగా నక్షకుమారుఁడు తనకంటెఁ జిన్న వాఁడు. ఆతనియుద్ధనైపుణి యసాధారణము. అంబరమున రథ ముతోఁ దిరుగుట తపఃప్రభావ సంజనితమహత్త్వము ప్రత్య క్షమగుచున్నది. అద్ది మెచ్చఁదగక యెట్లుండఁగలదు. పగ వారిశక్తియు నుత్యమే యగును. ఉత్తమగుణ మెందున్నను మెచ్చఁదగినదే కదా. "అమేధ్యాదపి కాంచనమ్" అన్న మను వాక్యము దీనినే దెలుపుచున్నది. గుణము ప్రధానము కాని వస్తువు ప్రధానము కాదని పెద్ద లందురు. కనుకనే మను స్మృతి "అంత్యాదపి పరంధర్మమ్" అని తెలుపుచున్నది. జ్ఞాన మెవ్వానినుండియైన గ్రహింపవచ్చుననఁగా సారమేమి? నిర్మలమగు వస్తువు వస్తుగుణము ననుసరించి మలినముగాఁ గనఁబడినను అది నిర్మలమే యని గ్రహింపవలయునని కదా తాత్పర్యము తేలును. కనుక జ్ఞాని యెవ్వఁడైనను ప్రశంస్యుఁడే యని స్పష్టమగును. ఈనియమము ననుసరించియే హనుమ రావణకుమారుని పొగడుట యుక్తమే యని తోఁచుచున్నది. సమాహిత శ్చాతిసహశ్చ సంయుగే = అని పావని భావించెను. వీనిమనస్సు చంచలము గాదు. యుద్ధములయం దాఱితేఱిన వాఁడు. కావుననే సనాగయక్షైః ర్మునిభిశ్చ పూజితః = అను మాట నిశ్చయ మనవలయును. ముని పూజితుండగుట యె ట్లని యడుగుదురేమో. సమాహితత్త్వము మునిస్తుత్యము

కాదని యెవ్వఁ డనఁగలఁడు? స్వానుభవజ్ఞానము గలవారు మునులు. యోగాభ్యాసక్రమముల వా రెఱుంగుదురు. కావున నట్టివా రట్టివారిని సంభావించుట యుక్తమే గాని యయుక్తము కాదు. అస్యపరాక్రమః సురాసురాణామపి మనాంసికంపయేత్. కుతః శీఘ్రగామినః = వాయువేగమున నిరాధారమగు వ్యోమమునఁ దిరుగుచుఁ బాణమోక్షణము చేయు నీతనిపరాక్రమము సురాసురులమనస్సులఁ గంపింపఁ జేయునని వాయుతనయుఁ డూహించుటెంతయుఁ బ్రశంసింపం దగియున్నది. వాయుకుమారుని మెప్పుకొనుటకుఁ గారణమైన సద్గుణము సమాహితత్వమే. అచంచల మగుమనస్సు కలుగుట కంటె గొప్పదనము వేఱొకటి యుండదు.

"యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ! ౪౧

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతి ష్ఠోత్తిష్ఠ భారత!" ౪౨

అన్న గీతావాక్యములు యోగమహత్త్వమునే తెల్పుచున్నది. గీతాశాస్త్రము యోగశాస్త్ర మనఁబడినది అనఁగా యోగమే సర్వాధారమని తెలుపుశాస్త్రమని తాత్పర్యసారము. తక్కిన విషయము లంగములుగానుండునని మన మెఱుఁగవలయును: సద్గుణము లుండినచో శత్రువునుగూడ నుతింపవలసినదే. అనఁగా సద్గుణమును శ్లాఘింపవలయుఁ గదా. పగవాఁడని వానియందుఁ గలసద్గుణమును దూషింపరాదు. ఈవిషయము లీభాగమునుండి మనము నేర్చుకొనవలయును.

"న ఖల్వయం నాభిభవే దుపేక్షితః
పరాక్రమో హ్యస్య రణే వివర్ధతే
ప్రమాపణం త్వేవ మమాస్య రోచతే
న వర్ధమానోఽగ్నిరుపేక్షితుం క్షమః." ౨౯

అని మూలము. ఇంతకుముందే పొగడిన హనుమంతుఁడా యక్షకుమారునిఁ జంపవలయునని యూహించుట తెలివితక్కువచేతఁ గాక మతేమి? అని యూహింతురేమో. అట్లూహింపకుఁడు. తత్త్వ మరయుఁడు. ఊహల ననుసరించి యుక్తులు తోఁచునని మున్నే వ్రాసితిఁ గదా. అక్షకుమారునకు మృతి సమీపించుచున్నది. కర్మ మత్యంతబలీయము కదా. క్షణకాలమున వాయుతనయుని మానసమును మార్చివైచెను. త్వరఁగా వధింపుమా యని యతనిని బురికొలిపెను. కర్మమట్లు తెలుపఁగా నిఁక నత డేమిచేయఁగలఁడు. తదనురూపము లగునూహలు కలవాఁ డయ్యెను. ఇఁక నూరకయున్న వీఁడు నన్నుఁ జంపకమానఁడు. అగ్ని వృద్ధికాఁగా నుపేక్షించినఁ గాల్చును. కావునఁ జల్లార్పవలసినదే యనుతలంపులు పొడసూపసాగెను. కర్మ మెంత బలవత్తరమో యిప్పుడు తెలియఁగలదు. పొగడుట కెట్టికారణము లపుడుతోఁచెనో యిపుడు ఆవస్తువునే పొడవడంచుటకుఁ దగినకారణములే మరలఁ దోఁచెను. దీనింబట్టి మానవుఁడ స్వతంత్రుఁడని తేలకమానునా? స్వతంత్రుల మనుకొనుటకంటె వెఱ్ఱితనము వేఱుగనున్నదా?

"కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్,"

అన్న గీతావాక్యము నెన్నిసారులు వ్రాసినను జాలకున్నదని నాయాశయము. పరమపావనచిత్తుఁడగు హనుమంతునకు నొక

క్షణమున నిన్ని యూహలు పరస్పరవిరుద్ధములు తోఁచుట అతఁ డారీతిగా వర్తించుట పరిశీలించితి మేని కర్మము బలవత్తరమని తేలక మానునా ? తేలిననుగూడ దానిని జయించితిమని ప్రల్లదము లాడుటకన్నఁ బాపకార్యము వేఱుగ నేమున్నది ?

"మహర్షిభి శ్చక్రచరై ర్మహావ్రతై
స్సమేత్య భూతైశ్చ సయక్షపన్నగైః. 32
సురైశ్చ సేంద్రై ర్భృశజాతవిస్మయై
ర్హతే కుమారే స కపి ర్నిరీక్షితః."

అని మూలము. జ్యోతిశ్చక్రమునకుఁ బురాణములయందు శింశుమారచక్రమని పేరియ్యఁబడినది హనుమంతుఁ డక్షకుమారుని జంపఁగనే జ్యోతిశ్చక్రమునందుండు మహర్షులు మిగుల నచ్చెరువు నొంది యతనిం దిలకించిరి. ఇంద్రాదులు చూచిరనియుఁ గలదు. జ్యోతిశ్చక్రమునఁ దిరుగుచున్న మహర్షులనఁగా దేవర్షులా లేక భూలోకవాసులా? లేక మృతి నొంది పుణ్యఫలముల ననుభవించువారలా ? అనుశంకలు గలుగకమానవు. స్కాందమహాపురాణమునందు ఖగోళమునఁ గలజీవకోటులు చెప్పఁబడినవి. ఋషిమండలమున నేఁడుగు రుండునట్లు కలదు. వసిష్ఠమునియు నరుంధతియు నందుఁ గలరు. వారు శ్రీరామాయణకాలమున నయోధ్యలో నున్నట్లు ప్రమాణము కలదు. ఈసంశయము బాధింపకమానదు. వీరు వారు కానవలయు. ఏతన్నామకులే యిరువురు నందున్నవా రన్న యుక్తి అంత బాగుండదు. స్థితస్య గతిశ్చింతనీయా— అనున్యాయము ననుసరించి సమాధానము చేసికొందము.

సప్తర్షులని మనముచూచునవి నక్షత్రములు. అనఁగాఁ దేజో గోళములవలెఁ గనఁబడు జలమయగోళములు.

"తేజసాం గోళక స్సూర్యో గ్రహర్క్షా ణ్యంబుగోళకాః."

అని ప్రమాణము. భానుకాంతిప్రసారమున నవియుఁ బ్రకా శించును. కొన్ని నక్షత్ర గోళములు సూర్యు నాకర్షించునవి కలవని పెద్దలు తెలిపిరి. ఈగోళములన్నియు బ్రహ్మాండములని మన మెఱుంగవలయు పరస్పరాకర్షణమువలనఁ గదలకయున్న ట్లగపడును స్థిరవస్తువు సృష్టియందే లేదుకదా. మనదృష్టిచే నవి స్థిరములుగా నుండును. నిశ్చలములుగా నుండును. మానవదేవతద్భేదసృష్టులు గలవానికే బ్రహ్మాండములని పేరు అనేకబ్రహ్మాండాధిపతి యనఁగా నట్టివానికిఁ బ్రభుఁవని భావము. సృష్టికృత్పరిపాలకసంహారకులు అన్నింటికిం గలరు. కనుకనే త్రిమూర్తులు స్థిరులు కారనివ్రాయుట కవకాశము. ప్రకృత మనుసరించెద. హనుమంతుఁ డాకసమున రావణపుత్త్రునిం జం పఁగామహర్షులు లోనగువారు బహుమానదృష్టిం దిలకించిరని భావము. లోకోపకారకార్యము చేయువారిని మహాత్ము లాద రింతురని విషయసారము. సప్తర్షులు లోకములని వ్రాసి వారు పావనిం దిలకించిరని వ్రాయుట సమంజసమా యని యడుగుదు రేమో. గోళము లచేతనములే. కాని గోళాధిష్ఠానదేవతలు గలరని యెఱుంగవలయును. భూదేవియనఁగా భూగోళము నకు నాధారభూత యగుదేవత యని యర్థము. ఇట్లే తరు గుల్మాదులకు దేవత లున్నవారలని వారి నారాధింపక యాతరు లతాదుల గ్రహింపరాదనియు గ్రహించిన నవి నిష్ఫలము లగుననియుఁ దంత్రములు చాటుచున్నవి. ఇపుడిపుడు లతా

మహాత్త్వము తేటఁబడుచున్నది కదా? వృద్ధులు జవ్వనము గలవారలగుట కొంతకాలము చూడఁగలమని తోఁచెడిని. నాస్తికులు వృద్ధికాకయుండఁజేయ నందందు నిట్టి విచిత్ర కార్యములు భగవంతుఁడే మునులమూలమునఁ జేయించుచుండును. అపుడు స్వభావవాదులు నోరు తెఱవక యూరకుండక తప్పదు కాఁబోలు. ఇట్లు లీయక్షకుమారవధ కథనుండి విశేషవిషయములు గ్రహింతము. తర్వాతికథను బరికింతము.

## ఇంద్రజిత్తును రావణుఁడు పంప నతఁడు బ్రహ్మాస్త్రమున హనుమంతుని బంధించుట.

* అంత నక్షకుమారుని హనుమంతుఁడు వధించుటాలించి రావణుఁడు మిగుల దుఃఖించి రోషమున ధైర్యము కొంత నిలువఁగా నింద్రజిత్తుని బంపఁదలంచి యతనితో నిట్లు భాషించెను. కుమారా! నీవు బ్రహ్మాస్త్రవేత్తవు. శస్త్రవిద్యాపారంగతుఁడవు. దేవతార్తిప్రదుఁడవు ఇంద్రాదులు మారు కొన్నతఱి నీపరాక్రమమును జగము తెలిసింగినవి. బ్రహ్మనుపాసించి యతనియస్త్రమును బడసితివి. నీయస్త్రబలము ముందు నిలువఁదగువారు సురాసురులలో లేరు. రణరంగములయందుఁ బురుషయత్నమున నీ కశక్యమైన దెద్దియు లేదు. వివేకపురస్సరముగా నీ వాలోచించినఁ దెలియరానిదేదియు నీకు లేదు. త్రిలోకవీరులలో నీయస్త్రమహిమము నెఱుంగనివాఁడే లేఁడు. తపోబలయుద్ధనైపుణములందు నాకు సమానుఁడవు. నీకెత్తఱినైన విజయము చేకూరుట నిశ్చయము. కష్టములు

* ఇది నలువదెనిమిదవసర్గమునఁ గల కథ.

యుద్ధములందుఁ గలుగఁగా నిన్నుఁ దలంచుకొందునే నేవి షాదమును నాకు నుండదు. విషయము నాలకింపుము.

కింకరులు హతులైరి. జంబుమాలి యమసదనమున కరిగె. మంత్రికుమారులు మడిసిరి. పంచసేనాపతులు పంచత్వము నొందిరి. చతురంగబలములు రూపటినవి. నీప్రియానుజుఁ డక్షకుమారుఁడు కూలెను. నీయందు నాకుఁగలవిశ్వాస మెవరియందును లేదు. ఇందఱఁ బొలియించిన యావానరుని శరీరబలబుద్ధిపాటవాంతశ్శక్తిపౌరుషములఁ జక్క విమర్శించి నీశక్తిని లెక్కించుకొని దానికి ననురూపముగా నురవడింపుము. ఇచ్చటనుండి వెడలి వైరిని సమీపించి స్వపరబలముల నాలోచించుకొని స్వబలములకు హానిలేకయుండునట్లుగా యుద్ధమునకుఁ గడంగి పగవాని నిర్మూలింపుము. వీరాగ్రణీ! తా నొక్కఁడేయయ్యు నిందఱఁ గలంచి రూపుమాపెఁ గదా. అట్టి యావానరునివిషయమున నీకు సేనలు తోడుపడఁ జాలవు. హనుమవిషయమున వజ్రాయుధముకూడ నిస్సారమే. కనుక దానిం గొని యతనిచెంత కరుగకుము ఎందులకందువో. వానికిం గల గమనవేగము వాయువునకును లేదు. అతఁ డగ్నిహోత్రునకు సమానుఁడు కావున ముష్ట్యాదిఘాతముల వానిం బొలియింప నలవికాదు. కనుక నింతకుముందు నేఁ జెప్పినవిషయములఁ జక్కఁగా విమర్శించి నీయత్నము ఫలించుటకై ప్రమాదము పొందక ధనుస్సంబంధములగు నస్త్రములం దలంచుకొనుచుఁ బొమ్ము అస్త్రబలము తప్పఁ దక్కిన వేఱొకం డాతనియెడఁ బనిచేయదు గాన నస్త్రదేవతల స్మరించుచుం బొమ్ము. కార్యభంగము గానట్లు యత్న మొనరిం

పుము. కుమారా! నిన్ను నేను యుద్ధమునకుఁ బంపుట యుత్తమ మగు పనికాదు. ఐనను రాజనీతిధర్మములకు వాని నాచరించు ప్రభువునకు సంగతమైనదే యని తలంచి నిన్నుఁ బంపుచున్నాఁడను. శత్రుసూదనా! యుద్ధముచేయుతఱి బహువిధాయుధములం గైకొని యరిని బ్రహరించుశక్తిని దప్పక నీవు తలంచుకొనవలయుఁ జుమీ! జయము తప్పక కలుగవలయునని కోరవలయును. తదర్థమై సకలాయుధములను దలంచుకొనవలయును.

ఇట్లు తండ్రి తనకు నీతి నుపదేశింపఁగా విని యమర్త్యప్రభావముగల యా మేఘనాదుఁడు యుద్ధమునకుఁ బోఁగోరి జనకునకు వలగొనియెను. బలములు వెంటరాఁగా మిగుల నుత్సాహమున సెలవుకైకొని రణమునకుఁ బోయెను. సింహములఁ బూనిచిన రథము నెక్కి సకలాస్త్రములం దాల్చి హనుమంతుఁ డున్నయెడ కరిగెను. వీరుఁడగు నా పవనసూనుఁడు రాక్షసుని రథఘోషమును జ్యారవము నాలకించి మరల సమరము చేయ నదనుగలిగెఁ గదా యని సంతుష్టుఁ డయ్యెను. ఇంద్రజిత్తు మహాధనుస్సును బాణములను ధరించి హనుముపైకి బోయెను. యుద్ధముచేయునుత్సాహమున బాణములు కేలంగొని రణమునకు బయలుదేఱఁగా దిక్కులుమాసిన ట్లుండెను. ఆసంగరమును జూచుకోర్కిని సిద్ధముని భూతాదులు వచ్చినవి. పక్షులు గుంపులుగాఁగూడి హర్షమునఁ గూసినవి.

వేగముగల యాహనుమ యింద్రజిత్తును గాంచి సింహనాద మొనరించి మేనుపెంచి నిలిచెను. రావణియు నారి సారించెను. హనుమయు జంకు నెఱుంగనివాఁడు కాన సిద్ధపడఁగా

నాయుపుత్రుడు తలపడిరి. మహాబలుఁ డా రావణి బాణమేయఁగా హనుమ వెనుకాయముగలవాఁడై యది తగులకయుండఁ జేయుచు నాకాశమున విహరించెను. వజ్రసదృశ బాణముల నింద్రజిత్తు హనుమంతునిపైఁ బఱపెను. పవనాత్మజుఁడు మరల నాకసమున కెగసెను. లక్ష్యశుద్ధిగలవాఁడయ్యు నింద్రజిత్తు హనుమసంచారమునుబట్టి లక్ష్యశుద్ధి లేనివాఁడుగా నగ్తపడెను. బాణములు వైచునపుడు హనుమ వైరికెదుటం దోఁచి యవి ప్రయోగింపఁబడఁగా నాకసమున కెగురుచుండెను. వా రిరువురు వేగవంతులు గాన నచ్చెరువు కలిగించుచుఁ బోరాడిరి. పరస్పరలోపములు కనఁబడకయుండ వారు పోరుచుండిరి. ఒకరినొకరు జయింతుమని యూహింపఁ జాలక పోరాడిరి. బాణప్రయోగమున రావణి ప్రమాదము నొందువాఁడు కాఁడు. ఆ బాణములన్న నమోఘములే. కాని వానిం దగులకుండ నతఁడు తప్పించుకొనుచుండుటవలన వ్యర్థము లగుచుండెను. దానికా రావణి చింతింపసాగెను. అంత నా రావణి హనుమంతుని వధించుట శక్యముగానిపని యని యూహించి యుపాయ మాలోచించి సకలాస్త్రవర్యమగు బ్రహ్మాస్త్రమును సంధించెను.

రావణకుమారుఁ డా వాయుకుమారుని జంప నలవిగాదని తెలిసికొని సకలాస్త్రస్వభావముల నెఱింగినవాఁడు గావున నాసమయమునకుఁ దగినది బ్రహ్మాస్త్రమని యెఱింగి యాయుత్తమాస్త్రమును బ్రయోగించి వాయుకుమారుని బంధించెను. అంత నా హనుమంతుఁడు బ్రహ్మాస్త్రబద్ధుఁడై చేష్టలుపదలి నేలఁ బడియెను. పిదపఁ దానా బ్రహ్మాస్త్రముచే

బద్ధుఁడనైతినని తెలిసికొని తనవేగము నది తూలించెనని నిశ్చయించి ము న్నాపరమేష్ఠి యొసంగినవరమును స్మరించెను. మఱియు నాయింద్రజిత్తు తనపై బ్రహ్మాస్త్రము నభిమంత్రించి వైచె ననియెఱింగి తనకా బ్రహ్మదేవుఁడే యిచ్చియున్నవరము నెఱింగి లోకగురుండగు నా బ్రహ్మవలన నాయస్త్రబంధమును వదలించుకొనఁగలనని వీఁడెఱుంగక నన్ను బంధించినాఁడను కొనుచు నేవిధముననైనను బ్రహ్మాస్త్రబంధము నించుక యనుసరించియుండఁ దగునని నిశ్చయించుకొనియెను. తనకాయస్త్రము ప్రాణాపాయకరము గాదనియు బంధవిముక్తిని గాంచున ట్లిచ్చినవరముగలదనియుఁ దెలిసికొనియు నా దేవదేవునాజ్ఞ ననుసరించి యుండెను. నాకుఁగల వరములమూలమున నీ యస్త్రము కట్టివైచినను భయమేదియుఁ గలుగఁబోదు. రాక్షసులు నన్నుఁ బట్టుకొన్నను నది నాకు మహోపకారముగా నగును. రావణునితో సంభాషించునవకాశము గల్గించును. కనుక శత్రువులు నన్నుఁ బట్టుకొన్నను మంచిదే. యని కార్యవిచారపరతఁ గాంచి యేపనియుఁ జక్కఁగా నాలోచించి చేయువాఁడు కావునఁ జేష్టలుడిగి వైరులు తన్నుఁ జుట్టుకొని బాధించుచుండఁగా గట్టిగా నార్చెను. వా రావానరుఁడు చేష్ట లుడిగియుండఁ గాంచి బహువిధము లగుత్రాళ్లం గట్టి వైచిరి.

హనుమయు రావణుం గాంచుకుతూహలమున నన్నుం గాంచు కుతూహలముననైన రావణుఁడు మాటలాడుననుకొనుచు రక్కసులు బంధించుచుండ నూరకుండెను. వారు హనుమంతుని త్రాళ్లం గట్టివేయఁగా నాయస్త్రబంధము వద

లెను. మఱియొకదానిచేఁ బంధింపఁబడఁగా నాయస్త్రబంధము నిలువదని నియమము. దాని నింద్రజిత్తెఱింగి యక్కటా! మహాకార్యమొనరించిన నది వ్యర్థమైనది. మూర్ఖులగు నీ రక్కసులీయస్త్రబంధశక్తి నెఱుంగనివారైరి. ఈయస్త్రము ప్రతిహతమగునేని వేఱొకయస్త్రము పనిచేయఁజాలదు. దానినే మరలఁ బ్రయోగించినను ఫలము శూన్యము. కావున ఫలము సంశయాస్పదమైనదని విచారించెను. వాయుసుతుఁ డాయస్త్రము వదలినను రక్కసులు బాధించుచు నీడ్చుకొని పోవుచుండినందునఁ దన్శక్తిని దలంపకయుండెను. క్రూరులగు నారక్కసులా వాయువుకొడుకును గట్టుచుఁ గొట్టుచుఁ బిడికిటిపోటుల నలయించుచు రావణాసురునికడ కీడ్చుకొనిపోయిరి. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రబంధము వీడుట త్రాళ్లచేఁ గట్టఁబడి యతఁ డుండుట తెలిసికొని సభాభవనమును జేరి రావణునకు నతని సభ్యులకు వీఁడే యావానరుఁడని చూపెను. మదగజమువలె బద్ధుఁడై యుండు నాగాలికొడుకుం గొనిపోయి రాక్షసులు రావణునకుం జూపిరి. అందలిసభ్యు లెవఁడు వీఁడు? ఎవ్వరి వాఁడు? ఎందుల కిట వచ్చెను? ఏపని యిందు వీనికిఁ గలదు? ఎవరియొద్దకు వచ్చినాఁడు? అని యొండొరులతో ముచ్చటించుకొనసాగిరి. అందుఁగల కొందఱురక్కసులు మహోగ్ర క్రోధమూర్తులై వీని వధింపుఁడు. కాల్పుఁడు. పట్టుకొని భక్షింపుఁడు. అని పలుకసాగిరి.

హనుమంతుఁ డంత మార్గముదాఁటి సభాభవనమును జేరి రాక్షసనాయకుని, తత్పాదమూలముల నుండుమంత్రులను గాంచెను. మహాతేజుఁడగు నారావణుఁడు వికృతాకారము

గలరాక్షసులు లిట్టులట్టు లీడ్చుచున్న యా వానరవీరునిం గాంచెను. తేజము బలము విశేషముగాఁ గలిగి మధ్యాహ్న భానుమంతుఁడువోలెఁ బ్రకాశించు రాక్షసరాజును హనుమంతుఁడు చూచెను. రావణుఁ డంత నాగ్రహమునఁ గన్నులం ద్రిప్పుచు వానరుం గాంచి యతనివృత్తాంత మడుగుటకై కుల వృద్ధులై యుండుమంత్రుల కాజ్ఞ చేసెను. వా రంత వాయు కుమారునిం గాంచి చేయవచ్చినకార్య మేమనియు నెవ్వరు పంపఁగా వచ్చితి వనియుఁ గ్రమముగా నడుగఁగా నేను సుగ్రీవునిదూతను. ఆ విభుఁడుపంపఁగా వచ్చితినని తెలిపెను.

మహాశయులారా! ఇందుఁ గలవిశేషము లెవ్వియని పరిశీలింతము.

"తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
హనూమ తాక్షే నిహతే కుమారే
మనస్సమాధాయ తదేంద్రకల్పం
సమాదిదే శేంద్రజితం సరోషమ్." ౧

అని మూలము. రావణుఁ డింతదనుక వానరుఁడనియే తలంచి బలవంతుఁడని యెఱింగి వరుసఁగా బలాధికులఁ బంపుచు వచ్చెను. అక్షకుమారుఁడు చావఁగా నితఁడు ప్రతిహతము గాని బలముగలవాఁడనియు నిఁక నెవరినిబంపినను మరణ వార్త వచ్చుటయే గాని పోయినవారు రారనియుఁ దలంచెను. కనుకనే తనకుమారుఁ డక్షుఁడు హనుమచేఁ జంపఁబడియె నన్న ఘోరవార్త చెవి సోఁకగనే యులికిపడి స్థిరమనస్కుఁడగుచు నూహించెను. బలపరాక్రమము లీతనికడ నుపయోగింపవు. మహాస్త్రవీర్యమే పనిచేయవచ్చును. అనునూహ

కలుగఁగనే మనస్సమాధానము గలవాఁడయ్యెను. సమాధానము సమాధియను నీరెండును సమానార్థకములు సమాధానమ్=బ్రహ్మణి మనస్థిరీకరణమ్. చిత్తైకాగ్రమ్. నిగృహీతస్య మనసః శ్రవణాదౌ తదనుగుణవిషయే చ సమాధిః సమాధానమ్. ఇతి వేదాంతసారః. ఇదానీం సమాధానం లక్షయతి. నిగృహీతస్యేతి. శబ్దాదివిషయేభ్యో నిగృహీతస్యాంతఃకరణస్య శ్రవణాదౌ తదనుగుణేషు అమానిత్వాది సాధనవిషయేషు సమాధిః నైరంతర్యేణ తచ్చింతనం సమాధానమిత్యర్థః. ఇతి తట్టీకాసుబోధినీ. భాగవతే యథా.

"స్వధిష్ణ్యానామేకదేశే మనసా ప్రాణధారణా,
వైకుంఠలీలాభిధ్యానం సమాధానం త దాత్మనః."

అని శబ్దకల్పద్రుమము తెలుపుచున్నది.

సమాధానం = వివాదభంజనమ్. సిద్ధాంతానుకూల్యతర్కాదినా సమ్యగర్థావధారణం వా. నిద్రాలస్య ప్రమాదత్యాగేన స్థితిః. శ్రవణాద్యపేక్షిత చిత్తైకాగ్ర్యమ్. అని సర్వతంత్రసిద్ధాంత పదార్థలక్షణసంగ్రహము. సమ్యగధీయతేఽనేనేతి సమాధానమ్. అని వ్యుత్పత్తి యిట్టు లుండుటంబట్టి యోజింపఁగాఁ జిత్తైకాగ్ర్యము తేలెడిని. తనమనస్సు యోగాభ్యాసశక్తిని సంచరింపకయుండ నొనరించి రావణుఁడుపాసకుఁడు కావునఁ జక్కఁగా నాలోచించెనని తేలుచున్నది. విశేష కార్యసంఘటనయందు ముఖ్యము చిత్తైకాగ్ర్యత యని యోగమతము. దానిచేతఁ జక్కనియూహాలు కలుగును. కనుక రావణుఁడు మనస్సునిలిపి యోజించెనని యిందలి సారము. ప్రాయికముగా సత్కార్యములయందుఁ దోలుతఁ

ప్రాణాయామము చేయవలయునని విధికలదు. అది మంత్రము నుచ్చరించి ముక్కును దాఁకినంతమాత్రమునఁ గాదు. అట్లే యిపుడు జరగునాచారము. చేయఁబోవు కార్యమున కేది యధిదేవతయో దానిని ప్రాణనిరోధకాలమునఁ జక్కఁగా ధ్యానింపవలయును. మనోవీథి నది కనఁబడవలయును. అద్దానికిఁ దనసంకల్ప మెఱిఁగింపవలయునని శాస్త్రము బోధించును. దీనికి విరుద్ధముగా నిపు డాచారము సాగుచున్నది. కనుకనే కర్మములు నిష్ఫలములగుచున్నవి. మంత్రోచ్చారణము నిష్ఫలమా యందురేని చిత్తైకాగ్ర్యము కానిచో నది యత్కించిత్ఫలప్రదమే కాని సామాన్యఫలప్రదముకూడఁ గాఁజాలదు. ఏసత్కార్యముగాని సమాధానముగలిగి చేసిననే ఫలవంత మగునను నీవిషయ మీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"త్వ మస్త్రవి చ్ఛస్త్రవిదాం వరిష్ఠ స్సురాసురాణా మపి శోకదాతా,
సురేషు సేంద్రేషు చ దృష్టకర్మా పితామహారాధనసంచితాస్త్రః. ౨

అని మూలము. తండ్రి కుమారు నగ్గించుట న్యాయ్యము కాదని పెద్ద లందురు. కాని యుద్ధకాలములందు నిది ఫలకారి యని యీభాగము తెలుపుచున్నది. ఉత్సాహకల్పన ముఖ్యమని భావము. అస్త్రవేత్తవని తొలుతఁ జెప్పి శస్త్రవిద్వరిష్ఠుఁడ వని పిదప రావణుఁడు తెల్పెను. అస్త్రము లుపాసనాధిగమ్యములు. శస్త్రములు ప్రకృతిబాణములు లోనగునవి. ఒక్కయస్త్రమును సంపాదింపవలెనన్న వానిప్రాక్కర్మము ననుసరించి యుపాసింప నది ఫలింపవచ్చును ఫలింపక పోవచ్చును. శస్త్రమునకు దేవతారాధన మక్కఱలేదు. ఒక్కదేవత నుపాసించి

యాదేవత ప్రత్యక్షము కాఁగా నది యస్త్రరూపమున నుండ వేఁడవలయును. కావున నస్త్రలాభము మహాకష్టైకఫలము. కావుననే యద్దానిం దొలుతఁ దెల్పెను. తర్వాతఁ బితామహా రాధనపంచితాస్త్రః=బ్రహ్మదేవు నుపాసించి యతనిమూలముననే యాయస్త్రమును సంపాదించితివి. గురువుకడ నుపదేశింపఁబడి యుపాసించి యాయస్త్రమును సంపాదింపవచ్చు. దానికంటె నాదేవతకడనే యద్దాని నార్జించిన నది యనంతఫలద మగును. భారతములో దుర్యోధనునకు నర్జునునకుం గూడ బ్రహ్మాస్త్ర ములు కలవు. కాని యవి ద్రోణాచార్యదత్తములు. అందును భేదము కలదు. రెండవవాని దమోఘము. అశ్వత్థామ పరశు రామునికడ నార్జించెను. అది యంతకంటె నుత్తమము. రావ ణుఁడు బ్రహ్మాస్త్రము సంపాదించెను. కాని బ్రహ్మ సాక్షాత్క రించి మంత్రోపదేశపూర్వకముగా నద్దాని నొసంగెను. కావున నది యప్రతిహాత మయ్యెను. ఈవిషయము యుద్ధకాండమున వ్రాయఁబడును. కాన నిపుడు పెంచి వ్రాయఁ దలంపను.

మంత్రములు ద్వివిధములు. ఉపాసనామంత్రములు. అస్త్రమంత్రములు అని. ఉపాసనామంత్రములు చతుర్విధ పురుషార్థప్రదములు. అస్త్రమంత్రములు స్వరక్షణపూర్వక శత్రుసంహారక్షమములు. ఉపాసనామంత్రములే యస్త్ర మంత్రము లగును గాని బీజవిన్యాసమున మార్పుగలదు. అట్టివానితోఁ జేరిన దాని నుపాసింపరాదు. అనఁగా ధర్మార్థ కామముక్తులకుఁగా భజింపరాదని తాత్పర్యము. దానికి నియ మము లెక్కువగ నుండును. వానినుండి చ్యుతుఁడైనచో నశించును ఈయుపాసనావిషయమున నట్లుగాక వేఱుగా ఫల

ముండును. క్రూరోద్యమమునకుఁ గట్టుబాటు లెక్కువగ నుండును. సదుద్యమమునకుఁ దక్కువగ నుండును. కావున నారాధనవిషయమున వీని కెంతయో భేదము కలదు. దానిం బరికించి యుపాసింపవలయును. మనస్సమాధి ద్వారకనిచో నుపాసన యత్యల్పఫలద మనుట ప్రతిహతము లేనిసిద్ధాంతము. ఈవిషయము నెఱింగినవాఁడు కావుననే రావణుఁ డింద్రజిత్తును "త్వమస్త్రవిత్" అని హెచ్చరించెను. అనఁగా నస్త్రబలము ప్రధానముగా భావింపుమనియు బ్రహ్మ తానే యొసంగిన యస్త్రవర్యమున సాధింపుమనియు నాతనిభావమని మన మూహించుట మంచిది.

"భుజవీర్యాభిగుప్తశ్చ తపసా చాభిరక్షితః. ౪
దేశకాలవిభాగజ్ఞ స్త్వమేవ మతిసత్తమః,
న తే ఽ స్త్యశక్యం సమరేషు కర్మణా
న తే ఽ స్త్యకార్యం మతిపూర్వమంత్రణే. ౫
న సో ఽ స్తి కశ్చిత్త్రిషు సంగ్రహేషువై
న వేద యస్తే ఽ స్త్రబలం బలం చ తే,
మమానురూపం తపసో బలం చ తే
పరాక్రమశ్చాస్త్రబలం చ సంయుగే. ౬
న త్వాం సమాసాద్య రణావమర్దే
మనశ్శ్రమం గచ్ఛతి నిశ్చితార్థమ్."

అని మూలము. భుజశౌర్యమునఁ గాపాడఁబడువాఁడవు. తపోబలమునఁ జక్కఁగా రక్షింపఁబడువాఁడవు. అని రావణుఁడు పలికెను. బాహుబలమునకంటెఁ దపోబల మెక్కుఁడని కదా యతనిభావము. రక్షణమనఁగా నాపదలనుండి యుద్ధ

రించుట. గోపనమనఁగా కాపాడుట అని యర్థభేదము. రక్షకుఁ డను పేరు భగవంతునకు వచ్చుట కిదియే కారణము. ఆపదుద్ధారకుఁ డొక్క భగవంతుఁడే. తపస్సనఁగాఁ దదారాధనమని యర్థము. తపోబలము ఆపదలను దొలఁగించుచుండ బాహాబలము కాపాడుచుండ నుండువాఁడవని హెచ్చరించెను. అనఁగాఁ దాత్పర్య మేమి? తపోబలము నిన్ను నానారు నుండి యాపద రాకయుండఁ గాపాడఁగలదు. యుద్ధమున బాహుబలము తోడుపడఁగలదు. అనియే కదా. రావణుఁడు తపస్వి గావునఁ దచ్ఛక్తి నతఁ డెఱుంగును. ఇతరుల కెట్లు తెలియఁగలదు? భగవదనుగ్రహపాత్రముగాఁ జేయునది తపస్సనియే మన మెఱుంగవలయు. తపస్సనఁగా దేహాసుఖమును దపింపఁజేసి మానసానందమును వృద్ధిచేయునది యని యెఱుంగవలయును.

తపః—మనస శ్చేంద్రియాణాం చైకాగ్ర్యమ్. అంతర్ముఖాని యది ఖాని తపస్తతః కిమ్? నాంతర్ముఖాని యది ఖాని తత స్తపః కిం? అంత ర్బహిర్యది హరిశ్చ తప స్తతః కిమ్? నాంతర్బహిర్యది హరిశ్చ తప స్తతః కిమ్? అని సర్వలక్షణసంగ్రహము.

ఇంద్రియములు మనస్సు నేకాగ్రత నొందుట తపస్సనఁబడును. దీనికే యుపాసనయని పేరు. స్వాభీష్టదేవతాకల్పిత రూపమును మనఃపదమున నెలకొల్పి తన్మంత్రమును జపించుచు దృష్టియారూపమునుండి విడిపోవకుండఁ చేయుట. తపస్సునకే యోగశాస్త్రమున నాకర్షణయోగమని పేరు. ఆకర్షణా బీజసంపుటిత మగుమంత్రమును ధ్యేయమూర్తిని గాంచుచు జపించుచున్న యెడల నుపాసకుని మనస్సునుండి దైవతముండు

దాఁకసాగినయదృశ్యతంతువు భావనాబలమున దేవత నాకర్షించును. అపుడు దేవత బహిర్గతరూపమునఁ బ్రత్యక్ష మగును. మహర్షులు చేయునుపాసనకే తపస్సందురు. గృహస్థులు చేయుచో నుపాసన యందురు. నియమబాహుళ్య భేదమే గాని విషయభేదము లేదు. జితేంద్రియులైనచో నీరెండింటికి ఫలము సమానమే. అట్టి తపోబలమే బలములలో నుత్తమ మని రావణునిమూలమున మహాకవి వాల్మీకిమహర్షి మనకుఁ దేటపఱచెనని మనము విశ్వసింపవలయును. అంతమాత్రమునఁ జాలదు. దాని నాచరింపవలయును.

దేశకాలవిభాగజ్ఞః=దేశకాలములవిభాగ మెఱింగిన వాఁడు. అనఁగా నెవ్వఁడుగాని మహాకార్యము చేయఁ బూనుచో దేశకాలముల నెఱుంగవలయును. ఆచారములు దేశకాలముల ననుసరించి యుండును. మనకు సదాచారము లని తోఁచునవి దేశాంతరమున మార్పునొంది యుండును. మనదేశమున స్నానముచేసి కవచము తొడుగుకొని జపము చేయుట దురాచారమని యెంచఁబడును. హిమాలయమునకు మనమేపోవునపు డందు శీతబాహుళ్యమున నదియే సదాచారముగా మాఱును. బాహ్యాచారములన్నియు నిట్టివే యని యెఱుంగవలయును. కాలభేదమున నివి మార్పునొందును. ఈ విషయ మెఱింగినఁగాని తనకృత్యమును నిర్వహింపఁ జాలఁడు. మొండిపట్టుదల యుండునేని ప్రధానకార్యము నశించును. బాహ్యాచారముల నంతగాఁ బాటింపక ప్రధానమునే సంభావించుచు భగవదారాధనము చేయవలయును. త్వమేవ మతిసత్తమః = మతిసత్తముఁడవు నీవే యనియె. బుద్ధిమంతుఁడవని

యిట నర్థము చెప్పిన నీరసముగా నుండును. రావణునియాశయ మదిగాదు. "మతిరాగామి గోచరా" అన్నసూక్తి ననుసరించి రాఁగలవిషయ మాలోచించునది యని యర్థ మేర్పడును. అది గల వారలలో నీవే యుత్తముఁడవనియెను. ఇట్లు కాఁబోవునని యెఱుంగుటయే మతిమంతుల లక్షణము. అది యెల్లరకునుండదు. కొందఱకే యుండును. కావుననే ముందిట్లు కాఁగలదని యూహించి దేశకాలముల నెఱింగి కార్యము పండించుకొని రమ్మా యని రావణుఁడు కొడుకును హెచ్చరించుచున్నాఁడు. ఈభావము ముఖ్యము కనుకనే "మతి పూర్వమంత్రజ్ఞే" అని మరల రెండవసారియుఁ దెలిపినవాఁడయ్యె. యుద్ధకార్యములందు నీకు శక్యముకానిది లేదు. ఏల? మతిమంతులలో మేటివి గనుక, దేశకాలవిభాగజ్ఞుఁడవు కావునని రావణు నాశయము. ముల్లోకములందు ని న్నెఱుంగనివాఁడు లేఁడు. నీయస్త్రబలము దేహబలముఁ గూడ నెఱుంగనివాఁడు లేఁడు. అనఁగా నీవు తపశ్శాలివని తన్మూలముగ మహాస్త్రముల నెఱుంగుదువని బలశాలివనియు నెల్లరెఱుంగుదురు. ఈమాట యిపుడేల? అప్రస్తుతము కదా యనకుఁడు. ఆకీర్తికి భంగము వాటిల్లకయుండఁ గార్యదక్షుఁడవు కమ్మని రావణు నుపదేశమని నిగ్రహింపుఁడు. మమానురూపం తపసో బలంచ తే=అనుచున్నాఁడు. నాతపశ్శక్తి యెల్లరెఱుంగుదురు. దాని కనురూపమైనదే నీతపోబలమని తాత్పర్యము. 'పితృసమో జ్యేష్ఠః' అన్నన్యాయ మిందుఁ దోఁచెడిని. ఇట్టి నిన్నుఁ దలంచుకొనఁగా నాకు మనఃకష్టము తొలఁగుచున్నది. నీవుండఁగా నాకే మనఃకష్టములు రావని భావము.

నీవు మృతుఁడవు కాఁగా నాకును గష్టములు గలుగునను నాశయ మిట సూచితము. సర్వత్ర విజయం చేచ్ఛే త్పుత్రాది చ్ఛేత్పరాజయమ్. అనున్యాయము సుప్రసిద్ధమే. తనను మించినవాఁడు కొడుకు గావలయునని కోరుట న్యాయ్యమే యని యీఘట్టము మనకుఁ దెలుపుచున్నది. రావణునియాశ యము తెలుపుచు మహర్షి తల్లజుఁడు తపశ్శక్తి తప్పక సంపా దింపఁదగునని మనకు బోధించెను గదా. ఉపన్యాసవేదాంత మున నెంతకాలమువుచ్చినను ఫలము శూన్యమే. తపస్సుచేయ యోగాభ్యాసము చేయవలయును. ఆత్మశక్తిని సంపాదింప వలయును.

"ఇదం హి దృష్ట్వా మతిమన్ మహద్బలంక పేః ప్రభావం చ పరాక్రమం చ,
త్వమాత్మనశ్చాపి సమీక్ష్య సారంకురుష్వ వేగం స్వబలానురూపం. ౧౦
బలావమర్ద స్త్వయి సన్నికృష్టే యథా గతే శామ్యతి శాంతశత్రౌ,
తథా సమీక్ష్యాత్మబలం పరం చ సమారభస్వాస్త్రవిదాం వరిష్ఠ! ౧౧
న వీరసేనా గణశోచ్యవంతి న వజ్రమాదాయ విశాలసారం,
న మారుతస్యాస్య గతేః ప్రమాణం న చాగ్నికల్పః కరణేన హంతుం. ౧౨
తమేవమర్థం ప్రసమీక్ష్య సమ్యక్ స్వకర్మసామ్యాద్ధి సమాహితాత్మా,
స్మరంశ్చ దివ్యం ధనుషోఽస్త్రవీర్యం వ్రజాక్షతం కర్మ సమారభస్వ." ౧౩

అని మూలము. ఎంతటిరోషము మనస్సు నలముకొన్నను నైజమగు పుత్త్రప్రీతిని బ్రకటించుచు బుద్ధి నింద్రజిత్తునకు రావణుఁడు తెలుపుచున్నాఁడు. "స్వభావో దురతిక్రమః" అనుట సుప్రసిద్ధమే కదా. ఆయుపదేశ మిది యని పాఠకమహా శయులు చక్కఁగాఁ బరికింతురు గాక! మతిమన్=ఆగామి గోచరమగు మతిబలముగలవాఁడా యని భావము. ఎట్లు

యుద్ధము చేసిన వీఁడు సాధ్యుఁడగునని తలంతువు గాక యని హెచ్చరిక. కపేః మహత్ బలం ప్రభావం పరాక్రమంచ దృష్ట్వా=కపిమాత్రుఁ డన రాదు. అక్షకుమారాదులను వధించిన మేటి? ప్రభావసంపన్నుఁడు. ప్రభావమనఁగాఁ దేజస్సు. అది దైవత మనంబడు. దేవతోపాసనాసంప్రాప్తము తేజస్సు. అది నిర్మలమనశ్శక్తి సంపాద్యము. వెలుకారణములచే సాధ్యము కాదు. నిర్మలమనస్సంపద యోగసాధ్యము. కావున హనుమంతుఁడు మనశ్శక్తిసంపన్నుఁడని రావణుం డెఱింగియే యిట్లనుచున్నాఁడని మన మెఱుంగవలదా? కనుకనే, త్వమ్ ఆత్మనః పరస్య చ సారం సమీక్ష్య=నీశక్తిని వానరునిశక్తిని జక్కఁగాఁ బరికించి వేగము కనఁబఱుపుము. ఎట్లు లాపరీక్ష? తేసన్నే యతనిశక్తి యింతయని తెలుపునని యాశయము. ఆత్మబలానురూపం వేగం కురుష్వ=ఆత్మ శక్తికిఁదగినట్లు ఉరవడింపుము. పరుని తేజస్సును బరికించి నీ తేజస్సునకుఁ దగిన చందమున నతనిపై నురవడించి లోఁబఱచుకొనుమని హితోపదేశసారము. కుమారా! ఆ వానరునిచెంతకు నీవరిగి తన్మూలమున మనసేనలకు నష్టము కలుగకుండునట్లు పరబలాత్మబలములఁ జక్క నెఱింగి శత్రు లెట్లు జయింపఁబడునో యట్లు పరాక్రమింపుము. నీవస్త్రవిదులలో శ్రేష్ఠుఁడవు కదా యనియె. అనఁగా నేయస్త్రమున నతఁడు దొరకునో లేక చచ్చునో యది యూహింపుము. ఇతరసాధనములు పనిచేయవు కావున నస్త్రములతో సాధింపవలయునని తెలుపుచున్నాఁడు. ఇట్లు తెలిపి యంత నక్షకుమారుని మృతిస్మృతిగోచరము కాఁగాఁ బుత్రప్రీతి యుప్పొంగఁగా నింక నుపదేశించుచున్నాఁడు.

వీరా! ఆవానరుఁడు సేనల రూపుమాపుచున్నాఁడు. కాన నతని జయింప నీకు సేనలు తోడుపడఁజాలవు. అనఁగా సేన లున్నవి. నాకేమిభయ మనుకొనకుము. ఇతరసహాయము నిరుపయోగ మని సారము అల్పసారం=అల్పసారముగల, వజ్రమాదాయ= వజ్రాయుధముం గొని, నవిశ=అతనిపైకిఁ బోకుము. అతనిపై నల్పసారముగల వజ్రాయుధము వైవకుము. నిరుపయోగమని తాత్పర్యము. వజ్రముకలదని గర్వించి యావైరిచెంత కరుగకుమని హెచ్చరిక. ఏలయనఁగా ఆ వానరునిగమనము వాయుగతిని మించినది. కావున నేదిక్కునుండి వచ్చి ప్రహరించునో తెలియుట కష్టము. కావున నీ వాతనిచెంతకుమాత్ర మరుగకుము. దూరమునందుండి యస్త్రమున వాని జయింపు మని హృదయము. నచాగ్నికల్పః కరణే న హంతుం=పిడికిటి పోటుల వానిం జంపెదనందువేమో, వత్సా! ఆకార్యము వలదు. అతఁ డగ్నికల్పుఁడు. స్పృశింతువేని దహించును జుమీ. అనఁగా బాహుయుద్ధముచేయఁ దలఁచెదువేమో యది మానుము సమీపించిన నతఁ డడంచును. సమీపమున కరుగకుము. వజ్రాద్యాయుధములుగాని బాహుయుద్ధముగాని పనికి రావు. సేనలు తోడుపడఁజాలవు. కావున దివ్యాస్త్రము లనఁబడు వజ్రాదులు పనిచేయఁజాలవు. కావున బ్రహ్మాస్త్రము నాధారముగాఁ గొని యుద్ధముచేసి జయింపుమని రావణుని యాశయమని మన మెఱుంగందగు. "సమాహితాత్మా" యని మరల హెచ్చరించుచున్నాఁడు. ఏలయనఁగా వానరునిపై నాగ్రహావేశమున నురవడింతువేమో యపుడు మనోబలము తగ్గును. కావున సమాహితాత్ముఁడ వయినఁగాని బ్రహ్మాస్త్రము

పనిచేయదని భావము. దివ్య మస్త్రవీర్యం స్మరన్=దేవతాసంబం ధమగు నస్త్రవీర్యమనఁగా నప్రతిహతమగు బ్రహ్మాస్త్రమును స్మరింపుము. అక్షతంకర్మ సమారభస్వ=బలములకు నీకును బాధింపనిరీతిగా యుద్ధము చేయుమా. అని హితవు తెలిపెను.

"న ఖల్వియం మతిశ్శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయా మ్యహం,
ఇయం చ రాజధర్మాణాం క్షత్రస్య చ మతిర్మతా. ౧౪
నానాశస్త్రైశ్చ సంగ్రామే వైశారద్య మరిందమ,
అవశ్యమేవ యోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే." ౧౫

అని మూలము. వత్సా! నిన్నుఁబంపుట మతిమంతుఁడ నగు నాకుఁ దగదు. రాజధర్మముల ననుసరించినచో రాజు నగు నాకు నీతి హితమైనదే. అని రావణుఁ డనెను. ఏల? క్షత్రియుఁడు సర్వాధారుఁడు. వృక్షమూలమును గాపాడిన వృక్షమునంతయుఁ గాపాడిన ట్లగును. సర్వాధారుఁడగు తన్నుఁ గాపాడుకొనుటకు క్షత్రియులధర్మము. పదార్థమై తనప్రాణము నిచ్చుట యితరులకు విధి. రాజు సేనల ముందు పంపక తానే ముందుగ యుద్ధమున కరుగరాదని రాజనీతి బోధించును. కావున ఆధర్మము నాదరించి నిన్నుఁ బంపుచున్నాఁడను. విజయము కోరవలసినది. అట్లు కోరినఁగాని యుద్ధమున శ్రద్ధ యుండదు. అది యుండినఁగాని వెనుదీయక పోరాడఁజాలఁడు. మునులకు మోక్షకాంక్ష యెట్లు విధివిహితమో క్షత్రియున కట్లు విజయేచ్ఛ విధివిహితమే కావున దాని నవశ్యము కోరి బ్రహ్మాస్త్రమునను సరించి విజయము పొందుమా యని తండ్రి యాశీర్వదించెను. ఈభాగమునుండి నేర్చుకొనఁదగినవిషయ

ములు కొన్ని కలవు. వానిని వ్రాయక వదలరాదు ఏ మహా కార్యమును సాధింపఁబూనినను మనోనిశ్చలత్వము ముఖ్యము. భగవదనుగ్రహము నొందినఁగాని మహాకార్యమును సాధించు శక్తి కలుగదు. తపస్సునఁగాని భగవంతు ననుగ్రహము పొంద శక్యముకాదు. తపస్సునకు నచంచలచిత్తము ప్రధానాంగము. అది కుదురుటకు యోగాభ్యాసము ప్రధానము. యోగమునకు ఫలము జ్ఞానము. జ్ఞానయుక్తమగుమనస్సున నిష్టదేవత నుపాసించి తదనుగ్రహము పొందినవాఁడే మహాకార్యములు సాధించును. దైవసహాయము లేక పౌరుషము వ్యర్థము. దేశకాలముల నెఱింగి యాచారముల నూనవలయును గాని బాహ్యాచారములను బ్రధానములని యూఁగులాడరాదు. అంతశ్శుద్ధి ముఖ్యము. అదిలేనిది యెన్నిమంత్రములు జపించినను లాభములేదు. అనునివి యీభాగము మనకుఁ దెలియఁ జేయుచున్నది.

"తస్మింస్తత స్సంయతి జాతహర్షే
రణాయ నిర్గచ్ఛతి బాణపాణౌ,
దిశశ్చ సర్వాః కలుషా బభూవు
ర్మృగాశ్చ రౌద్రా బహుధా వినేదుః. ౨౩.
సమాగతా స్తత్ర తు నాగయక్షా
మహర్షయ శ్చక్రచరాశ్చ సిద్ధాః,
నభ స్సమావృత్య చ పక్షిసంఘా
వినేదు రుచ్చైః పరమప్రహృష్టాః." ౨౪.

అని మూలము. ఇంద్రజిత్తు పైపై మహోత్సాహము పొంగ వచ్చుచున్నాఁడు. అనుటచే నతనికి విజయ సూచింపఁబడు

చున్నది. మహోత్సాహ మాగామి శుభఫలమును సూచించును. దిక్కులు కలుషములగుట భయంకరముగాఁ బక్షులు కూయుట యశుభఫలమును సూచించును. హనుమ కశుభఫలము. రావణికి శుభఫలము రానున్నదని యవి తెలిపెనని మన మెఱుంగవలయును. మృగములు భీతికరముగా నార్చిన వనుటయు నట్టిదే కదా. తెల్లవారుజామునఁ బక్షు లెట్లువచ్చి ధ్వనించె నని సందియము కలుగవచ్చు. తెల్లవాఱవచ్చుచున్నది. కాన నపుడు తిరుగునవి కొన్ని పక్షు లుండుననుకొనిన మహా ప్రమాద మేదియుఁ గలుగఁబోదు. ఆ యుద్ధముచూడ శింశుమారచక్రమునందుండు మహర్షులు వచ్చిరి. అంతలో మహా సంతోషమున నంబరమునఁ బిండుగట్టి పక్షులార్చినవి. అనుటం జేసి హనుమంతున కోటమియు మంచికొఱకే యగునను భావము సూచింపఁబడినది. అనఁగా సత్కార్యములకుఁ గలుగు విఘ్నములు దానిప్రాశస్త్యమును దెలుపుటకే యని మన మెఱుంగవలయు.

"ఛిన్నోఽపి రోహతి తరుం క్షీణోఽప్యుపచీయతే పునశ్చంద్రః,
ఇతి విమృశంత స్సంతః సంతప్యంతే న తే విపదా."

అను భర్తృహరిసూక్తి క్రొత్తది కాదు కదా.

"తతస్తు లక్ష్యే స విహన్యమానే శరేష్వమోఘేషు చ సంపతత్సు,
జగామ చింతాం మహతీం మహాత్మా సమాధిసంయోగసమాహితాత్మా. 37
తతో మతిం రాక్షసరాజసూను శ్చకార తస్మిన్ హరివీరముఖ్యే,
అవధ్యతాం తస్య కపేస్సమీక్ష్య కథం నిగచ్ఛే దితి నిగ్రహార్థమ్. 38

అని మూలము. లోపల వ్రాసినదంతయు యథార్థమని యీ

శ్లోకములు దృఢపఱచుచున్నవి. తనగుఱితప్పుట అమోఘ బాణములు మోఘములగుట యింద్రజిత్తునకు విచారమును గల్గించెను అంతకుమున్నెన్నఁడు నిట్టులగుట యతఁ డెఱుంగఁడు. తండ్రి చేసిన హెచ్చరికయుఁ దనయనుభవము నీరెండింటి కద్వైతము చేకూరినది. కానఁ జింతింపవలసినవాఁడయ్యెను. ఇచ్చో వాల్మీకిమహర్షి యింద్రజిత్తునకు మహాత్మా యనువిశేషణమును జేర్చెను. శ్లోకము కుదురక యని పల్కువారల కొక్కనమస్కారము. తపస్సిద్ధుఁడు మహాత్ముఁడే యగును. బ్రహ్మ నలరించినవాఁడు మహాత్ముఁడు గాక లోకమత ద్రోహు లనుమహాత్ము లనవలయునా? సమాధిసంయోగ సమాహితాత్మా=అనునది రెండవవిశేషణము. ఇంద్రజిత్తునందు వాల్మీకిమహర్షి కెంతగౌరవము కలదో యిదియే మనకుఁ దెలుపును. ఇందు వ్యాఖ్యాతలు సమాధి యనుదానికి యోగికార్థముగా లక్ష్యమని వ్రాసి కథాసంవిధానమును నడిపించిరి. మహాత్మా=అనుదానిని జాఱవిడిచిరి. కావున నిట యోగికార్థము తెలుపక రూఢ్యర్థమునే చెప్పవలయును. సమాధి= మనోలయముయొక్క, సంయోగ=కూడికచేత, సమాహితా = విచంచలమగు, ఆత్మా=అంతఃకరణము గలవాఁడై. కనుకనే మహాత్మా యని మహర్షిచేఁ బేర్కొనఁబడియెను. అనఁగా మనస్సు నిగ్రహించి స్థిరముగా నుండఁజేసి (తనయోగాభ్యాస బలసంపదను వినియోగపఱచి) యని భావము. గొప్పగ నాలోచించెనని తాత్పర్యము. ఇష్టదైవమగు కమలాసనుని నిశ్చల మనస్సున నిలిపి యీయాపదనుండి యెట్లు తప్పింతువో నీదయ యని ప్రార్థించెనని సారము. వ్యాఖ్యలు తెల్పినశ్లో

యూహింతుమేని 'లక్ష్యే విహన్యమానే'యనియున్న దేమర్థ
నిది యేల? అనుప్రశ్నము వచ్చును. సంయోగశబ్దము నిరర్థ
కముకూడ నగును.

"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

యనిగదా పెద్దల యాశయము. వాల్మీకివాక్కునే యర్థము
తనయంతన తా ననుసరించును. ధ్యానమునకు శ్లోకము
మంత్రములు ప్రధానములు గావనియు నిశ్చలమనస్సు
మాత్రమే ప్రధానమనియు నదిలేనిచో శ్లోకములు వ్యర్థ
ములే యనియు నదియే కుదిరిన శ్లోకమంత్రములు లేకున్నను
బాధలేదనియు మన మెఱుంగవలయును. తతః=ఆధ్యానా
నంతరమందు, మతిం=రాఁగలవిషయము నెఱిఁగించు మతినని
యర్థము. తస్మిన్ హరివీరముఖ్యే చకార=ఆ హనుమంతుని
విషయమునఁ జేసెను, అనఁగా నీతనివిషయమున నిపుడు చేయ
మిదియేగాని వేఱొకఁడు పనికిరాదని నిశ్చయించెనని భావము.
తస్యైకవే రవధ్యతాం సమీక్ష్య=అనునదియె పైన వ్రాసిన
యర్థమును విశేషించి సిద్ధాంతము చేయుచున్నది. తనయమోఘ
బాణములు వ్యర్థములగుటచే నీతఁడవధ్యుఁడని యెఱింగెను.
కనుకనే మహాత్మా యనుపదము సార్థకమని పైన వ్రాయఁబడి
నది. నిగ్రహార్థమ్ కథం నిగచ్ఛేత్=వధింప నలవిగాకున్న
నిఁకఁ బట్టుకొనవలయుఁగదా. ఇంతవేగముగా సంచరించువాఁ
డెట్లు పట్టుపడును? అని విశేషించి యాలోచించి యీయదియే
దానికిమార్గమని నిశ్చయించెనని సారము. మహర్షియుదారాశ
యనిబద్ధ పదప్రయోగవైచిత్ర్య మెట్లున్నదో యోజింపుఁడు.
బ్రహ్మాస్త్రము తప్ప నితరాస్త్రము లాతనికడ నుండునవి పనికి

రాదని యతఁ డెఱుంగును. సకలాస్త్రశ్రేష్ఠము బ్రహ్మాస్త్రమని లోకవిదితము కదా. దానిఁ బ్రయోగించి బంధింతునని యూహించెననుభావము సూచితము. అదెట్లు? భగవంతుని బ్రహ్మను నిశ్చలమనస్సున ధ్యానింపఁగాఁ దోఁచినమతి యేది? ఇదియే. ఇదియే తపఃఫలము. విపత్కాలమున నుపాస్యదేవతాధ్యానమునఁ గలుగుఫల మెద్ది? తత్కాలకుశలానుకూలవ్యాపారము స్ఫురించుటయే గాక మఱే మగును? ఇంద్రజిత్తు నీచుఁ డన్న వాదము దుర్వాదమనియుఁ దపోమహత్త్వసంపద్భూషితుఁడనియు సత్యోత్తమోపాసకుఁడనియుఁ బరమేష్ఠికరుణాపాత్రుఁడనియు నీభాగమునుండి మన మెఱుంగవలయును. ఆరీతిగాఁ దపస్సొనరించి దైవశక్తిని సంపాదింపఁ గోరిక లు గలిగియుండవలయు. అదియే ముఖ్యము.

"తతః పైతామహం వీర స్సోఽస్త్ర మస్త్రవిదాం వరః,
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి. 3౭
అవధ్యోయమితి జ్ఞాత్వా తమస్త్రే ణాస్త్రతత్త్వవిత్,
నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మింద్రజిత్. 3౮
తేన బద్ధ స్తతోఽస్త్రేణ రాక్షసేన స వానరః,
అభవన్నిర్విచేష్టశ్చ పపాత చ మహీతలే." 3౯

అని మూలము. ఇంద్రజిత్తు తండ్రిమాటలు తలంచి తన యనుభవమునుబట్టి యీతఁ డవధ్యుఁడని నిశ్చయించి యస్త్రవిద్వర్యుఁడు గావునఁ బితామహునస్త్రమును సంధించెను. సుమహాతేజాః=అమితతేజస్సు గలవాఁడు. అనఁగా ధ్యానబలమున మిగులఁ దేజస్సుగలవాఁ డయ్యెనని భావము. దేవతాతేజస్సు భక్తునియందు వెలయునని యోగశాస్త్రము తెలుపుచున్నది.

శిరస్సును జుట్టియుండుతేజస్సు బాహ్యదృష్టి కగోచరమయ్యు భక్తుని సదుద్దేశముల ననుసరించి వృద్ధియయి లోపలఁ బ్రవేశించును. దురుద్దేశము లుండినది క్రమముగా నశించును. ఆ నియమము ననుసరించి యింద్రజిత్తు తనకిష్టదైవమగు బ్రహ్మను ధ్యానింపఁగాఁ దేజస్సు వృద్ధియయ్యెనని భావము. సందధే= ధనుస్సున దానిం గూర్చెననఁగా నొకరూపమున దాని నారాధించుచుండును. జపముచేసి దాని కర్పించుచుండును. దానినే పూజించుచుండును. ఆరూపమునే ధనువునఁ గూర్చెనని యెఱుంగందగు. కొందఱు చక్రరూపమున నారాధింతురు. కొందఱు సాలగ్రామాద్యకృత్రిమవ్యక్తుల నారాధింతురు. విగ్రహమున నారాధించువా రధములు. విగ్రహపూజ యత్యల్పఫలప్రదము. పామరులకు ధ్యానముకొఱకది యేర్పడినది. ఇపు డింద్రజిత్తు తా నారాధించువ్యక్తిని ధనువునఁ గూర్చెను. సంకల్ప మెట్లు? అవధ్యోయ మితిజ్ఞాత్వా= వీఁడు వధింపఁదగినవాఁడు కాఁడని యెఱింగినవాఁడు కావునను అస్త్రతత్త్వవిత్=అస్త్రప్రయోగరహస్యముల నెఱింగినవాఁడౌట, అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచే, మారుతాత్మజమ్ నిజగ్రాహ= హనుమను బంధించెను.

ఇచ్చోఁ బామరులకొఱకు నస్త్రప్రయోగరహస్యము నించుక వ్రాయక తప్పదని తోఁచి వ్రాసెదను. ఉపాసకుఁడు మంత్రమును జపించును. ఇష్టదేవతాసాక్షాత్కారమును గోరువాఁడు కావున నామంత్రమున నేది బీజక్షేపణస్థానమో యందు నాకర్షణబీజమును జేర్చి జపించును. ఇది సామాన్యోపాసకు లొనరించుకార్యము కాదు. తపస్వులమార్గము. ఆ

మంత్రముచే నాదేవత యాకర్షింపఁబడును. అనఁగా నాదేవత నామంత్రము కట్టివైచి తెచ్చి ముం దునుపదు. ఈతనిభక్తి యాదేవత కెఱుఁగఁజేయును. దాన హృష్టుఁడై యాదేవత ప్రత్యక్షమగు. ధనుర్వేదదీక్షితులైన నీయస్త్రము ననుగ్రహింపుమని వరము కోరుదురు. అనఁగా నేఁగోరినపు డాయస్త్రరూపమునందు నీతేజ స్సావహించి శత్రుక్షయముచేయ వరమిమ్మని యడుగునని తాత్పర్యము. వరమిచ్చును. పిదప ననుదినమారూపమును బూజించుచుండును. ప్రయోగకాలమున సంకల్పమునందుఁ దనకిష్టమెద్దియో దాని నొనరింపుమని ప్రార్థించును. ఇమం శత్రుం మారయ=వీనిం జంపుము. అని సంకల్పించి దేవతాధ్యానబలమునఁ దత్తేజమందు నెలకొనఁగా నది తనదృష్టి కది గోచరింపఁగా మంత్రపూర్వకముగా వైచును. అది తత్తేజోబలమునఁ బ్రజ్వరిల్లుచు నడరి యతనిం ద్రుంచును. ఆతఁడు నిట్టివాఁడైనచో నాయస్త్రమునో దానికివైరియగు నస్త్రమునో వైచును. రెండు నేకదేవతాకములైన శాంతించును. దాని నడంచునదియైన నది యాయస్త్రము నడంచి పైకడరును. దానికి వైరియగు నస్త్రమునో దానినో మరల నతఁడు ప్రయోగింపవలయును దేవతావరముననుసరించి కొన్ని మరల మరలఁ బ్రయోగింప నర్హములు గాకయుండు. తఱుచుగా నట్టివి లేవని యెఱుంగందగు ఇది యస్త్రప్రయోగలక్షణము. ప్రయోగమనునది యాకృతిగానుండక యదృశ్యరూపమునఁ బగవానిని బాధించును. లేక చంపును. కర్మసిద్ధాంతము దీనికి విరుద్ధముగాదా యనకుఁడు. విరుద్ధ మేమాత్రమును గాదు. ఆయస్త్రముచే లేక ఆప్రయోగమును వాఁడు

చచ్చునట్టి దుష్కర్మము ఫలోన్ముఖమైనఁగాని యాప్రయోగము చేయఁబడదు. చేయఁబూనిన నది నెఱవేఱదు. కాలకర్మసంయోగమన విందుము కదా. కర్మసిద్ధాంతమును దాఁటి భగవంతుఁడుకూడఁ బూనుకొనఁడన నితరులమాట యొకలెక్కఁగాఁ జెప్పనేల ? ఇఁకఁ బ్రకృత మనుసరింతును. అవధ్యుఁడని తెలిసికొన్నవాఁడు గాన నింద్రజిత్తు సంకల్పమును స్తంభనప్రయోగమున కనుగుణముగా నొనరించి యాబీజమునే మంత్రమునఁ గూర్చి కమలాసనుని బ్రార్థించి తద్వరదానము రీతిగా నామహాత్ముల దివ్యతేజ స్సందువెలయఁగాఁ బ్రయోగించెను. ఆయస్త్ర మరిగి యదృశ్యరూపపాశముల హనుమంతుని బంధించెను బద్ధుఁడై కదలఁజాలక హనుమంతుఁడు భూమిపైఁ బడియెను. ఈతఁ డవధ్యుఁడని యెట్టు లెఱింగెననిన సమాధిసంయోగ సమాహితాత్మా = అనియున్నదని ముందే వ్రాసితిని గదా. ఎట్టివిజ్ఞానముకలిగినను సమాహితాంతఃకరణముమూలముననే కలుగవలయుఁ గాని అదిలేక కేవలశాస్త్రవిచారముచేతఁ గలుగదనుట సిద్ధాంతము. ఇది ప్రతిహతములేనిదని యెఱుంగందగు.

"తతోఽథ బుధ్వా స తదాస్త్రబంధం
ప్రభోః ప్రభావాద్విగతాత్మవేగః,
పితామహానుగ్రహ మాత్మనశ్చ
విచింత యామాస హరిప్రవీరః. ౪౦

తత స్స్వాయంభువై ర్మంత్రై ర్బ్రహ్మాస్త్ర మభిమంత్రితం,
హనుమానిశ్చింతయామాస వరదానం పితామహాత్. ౪౧

న మేఽస్త్రబంధస్య చ శక్తిరస్తి విమోక్షణే లోకగురోః ప్రభావాత్,
ఇత్యేవ మత్వా విహితోఽస్త్రబంధో మయాత్మయోనేరనువర్తితవ్యః.
స వీర్యమస్త్రస్య కపిర్విచార్య పితామహానుగ్రహ మాత్మనశ్చ,
విమోక్షశక్తిం చ విచింతయిత్వా పితామహాజ్ఞామనువర్తతే స్మ. ౪౩
అస్త్రేణాపి హి బద్ధస్య భయం మమ న జాయతే,
పితామహామహేంద్రాభ్యాం రక్షితస్యానిలేన చ. ౪౪
గ్రహణే చాపి రక్షోభి ర్మహాన్మే గుణదర్శనః,
రాక్షసేంద్రేణ సంవాద స్తస్మా ద్గృహ్ణంతు మాం పరే. ౪౫

అని మూలము. హనుమ యాయస్త్రము తనవేగమును గుదియించి బంధింపఁగా నాలోచించి యిది జగద్గురువగు బ్రహ్మదేవుని ప్రభావము. అనఁగా బ్రహ్మాస్త్రమహత్త్వము. నాకును బితానుగ్రహము గలదు కదా యని విచారించెను. హనుమ చిఱుతుకవాఁడై నతఁడ్ (జననానంతరమే యని భావము) సూర్యుని మ్రింగఁబోఁగా నింద్రుఁడు వజ్రాయుధమున బ్రహరింప హనువు దెబ్బవలన నలఁగఁ గ్రిందఁబడియె. వాయువాగ్రహమూని తనసంచారవ్యాపారమును గుదియించెను. లోకవ్యాపారము లడంగెను. దేవతలు బ్రహ్మకడకుం బోయి మొఱ్ఱపెట్టుకొనిరి. వారిం దోడుకొనివచ్చి వాయువును సంతుష్టునిఁ గావించి హనుమంతుఁడని నామకరణము చేసి శరీరముతడివి శ్రమము వాసి యతఁడు లేవఁగా నాతని భావిస్థితి నెఱింగినప్రోఢ గావున నెల్లరను వరములీయఁ బురికొల్ప నందఱు తమతమ యస్త్రములచేత మృతిగలుగక యుండ వరమిచ్చిరి. తాను వరమిచ్చుచుఁ దనయస్త్రమున మృతికలుగదు గాని యది నిన్ను బంధించును. నామంత్రము

నుచ్చరించినంత నవి తొలంగునని వరమిచ్చెను. ఏలయనఁగా లోకమున దేనిచేతను మృతిలేదని వరముదొరకిన నెంతవాఁడైన గర్వించును. అది వానిశీలము నడంచును. కావుననే దానివలననో కొంతబాధ యున్నట్లు వాఁ డెఱింగిన నా యహంకారము లేకయుండఁ గలఁడు. అదియు నతనికే మహోపకారము. కావున బ్రహ్మ యట్లే వరమిచ్చెను. అను వార్త నపుడు హనుమంతుఁ డాలోచించెను. తనవైరి బ్రహ్మాస్త్రమంత్రములచేత నభిమంత్రించి యాయస్త్రమును వైచెననియు నది తన్ను బంధించెననియు నూహించెను. మంత్రైః= అనుచోఁ గలబహువచనము పూజ్యార్థద్యోతకమని యెఱుంగవలయు. మంత్ర మొక్కటియే. ప్రయోగభేదమున మంత్ర భేదము గలుగదు. బీజసంయోగమునందు భేద ముండును. దానినే మంత్రాంతర మనఁబడదు. తన్నుఁ జంపక యెపుడది బంధించి తనవేగమునడంచెనో యది బ్రహ్మాస్త్రమనియే యతఁడు నిశ్చయించెను. వరము తనకు నాలోకగురు వొసంగినదియు స్మరించెను. ఇచ్చో హనుమంతుఁ డూహించినవిషయమునుండి మనమేమి నేర్చుకొనవలయు ననునిదియే యిట ప్రశ్నము. అస్త్రబంధము విహితమే. దానిని దప్పించుకొను శక్తి వరప్రభావమునఁ దనకున్నను దాని ననుసరించుటయే మంచిది. దానిచే నాగుణములు లోకమున వెల్లడియగును. అనఁగాఁ దాత్పర్య మేమి ? పూర్వకర్మముల ననుసరించి దుష్ఫలములు తన కనుభవమునకు వచ్చినను వానిని దొలఁగించుకొనఁ బ్రయత్నింపక యనుభవించు టుత్తమము. దాన

భగవంతుఁ డనుగ్రహించును. సుఖము ననుభవించి కష్ట మనుభవింపకయుండుట సాధులక్షణము కాదు.

"సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః,
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః. ౨౪
మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. ౨౫

అను నీ గీతావాక్యములయాశయ మిదియే కదా శీతోష్ణాది ద్వంద్వసహిష్ణుత యొకపరీక్ష. దానినుండి తేలినఁగాని భగవదనుగ్రహపాత్రుఁడు కాఁజాలఁడు. అను నీవిశేషధర్మముల మన మెఱుంగవలయును. ఇట్లాలోచించి హనుమంతుఁడు రాక్షసులు తన్నుఁ బట్టుకొనిపోయినను రావణునితో మాటలాడు నద నొదవునని ముదితుఁ డయ్యెను.

"స బద్ధస్తేన వల్కేన విముక్తోఽస్త్రేణ వీర్యవాన్,
అస్త్రబంధ స్సచాన్యం హి న బంధ మనువర్తతే. ౪౯
అథేంద్రజిత్తు ద్రుమచీరబద్ధం
విచార్య వీరః కపిసత్తమం తం,
విముక్తమస్త్రేణ జగామ చింతాం
నాన్యేన బద్ధో హ్యనువర్తతేఽస్త్రమ్. ౫౦
అహో మహత్కర్మ కృతం నిరర్థకం
న రాక్షసై ర్మంత్రగతి ర్విమృష్టా,
పునశ్చ నాస్త్రే విహతేఽస్త్రమన్య
త్ప్రవర్తతే సంశయితా స్స్మ సర్వే." ౫౧

అని మూలము. రక్కసులు హనుమంతుని రశ్మిబద్ధుని జేయఁ

గనే యస్త్రబంధనము వదలెను. ఏలయనఁగా దివ్యాస్త్రము బంధింపఁగా నది దృఢబంధము కాదని కదా త్రాళ్లం గట్టుట విశ్వాసరహితులపై దేవతలకుఁ బ్రీతి యెట్లుండును? ప్రాకృత రశ్మలు (త్రాళ్లు) గట్టిగా బంధించునని మంత్రబంధ మంతగా దృఢము కాదనుటయే యజ్ఞానము. కాన దాని నాయస్త్రమును సహింపఁదనఁగా నాయస్త్రదేవత సైఁపఁడని కదా భావము. కావుననే హనుమంతు నాయస్త్రము వదలెను. ఆవిషయ మింద్రజి త్తెఱింగెను. మహావిచారమున మునిఁగెను. మంత్ర గతిని రాక్షసు లెఱుంగరని నిస్స్పృహుఁ డయ్యెను. మరల నింకేయస్త్రమును వైచినను సర్వాస్త్రవర్యమగు బ్రహ్మాస్త్రమే పనిచేయనపుడు మనచేత నేమగునని తక్కినయస్త్రదేవత లూర కుందురు. కావున నాప్రయత్నమెల్ల వ్యర్థమైనదని యతఁడు చింతించెను. ఇచ్చో నొకసంశయము కలుగవచ్చును. రాక్షసు లతనిఁ గట్టఁబూనఁగా వలదని యతఁడేల వారింపలేదు? పిదపఁ జింతింపనేల? ఊరకుండుట యింద్రజిత్తు ప్రమాదముననే కదా. అనునదియే యాసందియము. వీరుఁడు శత్రువును గుది యించి పడఁగొట్టవలెను. ఏయస్త్రములు వైవక శస్త్రములచేఁ గొట్టఁజాలక బ్రహ్మాస్త్రముచేఁ గట్టివేయుట శూరలక్షణము కాదు. ప్రధానాస్త్రమును బ్రయోగించుట కడపటిచికిత్స వంటిది. కనుక నీసంగతిని దనసేన లెఱింగినఁ దనమర్యాదకే హానిగల్గునని యెఱింగి వలదనఁజాలఁ డయ్యెను. మంత్రతంత్ర రహస్యవేత్త కావున నది నిరర్థకమయ్యెననిమాత్ర మతఁ డెఱింగెను. ఏకార్యముగాని భగవంతునిపై విశ్వాసముగలిగి చేయవలెఁగాని యవిశ్వాసముతోఁ జేయరాదనునదియే

యిచ్చోటునుండి యెఱుంగఁ దగిననీతి. ఈప్రయత్నము ఫలింపకున్న నెట్లు? అని శంకకలిగిన నది ఫలింపదనుట నిశ్చయము. భగవంతుని నమ్మి యేకాగ్రతగలిగిచేసిన నది కర్మ మనుకూలించునేని ఫలించును. ఫలింపకున్నను ఇష్టదేవతా విశ్వాసము తగ్గరాదు. మఱియొకసారి ఫలించును. విశ్వాసము ప్రధానము అదిలేనిచో నేకార్యము నెరవేఱదనుట సత్యము. ఈవిషయమున నధ్యాత్మ రామాయణమునందు విశేష మెద్దియును గానరాదు.

## రావణుని తేజోవిశేషములంగని హనుమ యచ్చెరువందుట.

* అంత హనుమంతుఁడు ఈరావణుఁడు తాను సింహాసనమునందే యుండి నన్ను బంధించి యిచ్చుటికి రప్పించెఁ గదా యని యాకార్యమును మెచ్చుకొనుచుఁ గోపమునఁ గన్నులరుణములు కాఁగా రావణుని గనియెను. ఆరాక్షసాధిపతి ధరించిన కిరీటాదు లమూల్యరత్నఖచితములు. అమూల్యవస్త్రముం గట్టుకొని రక్తచందనముఁ బూసికొనియుండెను. ఆతని దశశిరస్సులు చూచువారలకు భయంకరములై యుండెను. నల్లనిశరీరము. రక్తాక్షులు చూడంజూడ దిగులుగలిగింపఁ జాలియుండెను. భద్రాసనమునఁ గూరుచుండియుండ నాతనిమంత్రులు లోనగువారు సేవించుచుండిరి. పేరోలగంబున్న మహేంద్రుంబోలి యతఁడొప్పుచుండెను. రక్కసులు తన్ను బాధించుచున్నను సరకుచేయక హనుమ రావణునే

* ఇది నలువదితొమ్మిదవసర్గమునఁ గల కథ.

తేఱి చూచుచుండెను. ఆతని తేజోమహత్త్వమునకు విస్మితుఁడై మనస్సున నౌరా! ఏమి యీదివ్యరూపము! ఏమి యీధైర్యము! ఏమి యీబలము! ఏమి యీకాంతి! ఈతనియందు సర్వలక్షణము లమరియే యున్నవి. ఈతఁ డీయధర్మకార్యము నొక్కదానిని జేయకుండునేని రాక్షసులకే కాక యింద్రాదులకుఁగూడ నధిపతియై యుండుఁగదా. భీతికరములు ద్రోహకరములు లోకనింద్యములు నగుదుష్టకర్మములు పెక్కు లొనరించియున్నాఁడు. మహాధర్మము నొనరించియున్నాఁడు కనుకనే యంద ఱీతనింగని భయపడుచున్నారు. అదొక్కటి లేకున్నఁ ద్రిలోకముల నేలం దగియుండును గదా. ఇతఁడు కోపగించెనా జగంబంతయు సముద్రమునఁ గలిపివేయఁ గలఁడు. అని యనేకప్రకారంబులం జింతించెను.

"భ్రాజమానం తతో దృష్ట్వా హనూమాన్ రాక్షసేశ్వరం,
మనసా చింతయామాస తేజసా తస్య మోహితః. ౧౬
అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా. ౧౭
యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః,
స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా. ౧౮
అస్య క్రూరైర్నృశంసైశ్చ కర్మభిర్లోకకుత్సితైః,
తేన బిభ్యతి ఖల్వస్మాల్లోకాస్సామరదానవాః. ౧౯
అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తుమేకార్ణవం జగత్,"

అని మూలము. ఇందలివిశేషములనే పరిశీలింతము తన్నింత శ్రమంపఱచినవాఁడు రావణుఁడని హనుమ యెఱుంగును. సీత నపహరించెనన్నక్రోధము దుర్భరముగా నున్నది. కట్టివైచి

యీడ్చుకొని తెప్పించినది యతఁడే యని తెలియఁజాలును? మహాక్రూరుఁడని యధర్మకార్యనిరతుఁడని వినియుఁ జూచుచున్నాఁడు. అట్టియెడఁ దద్దర్శనమున నచ్చెరువుకలుగుట కేమి కారణమని మన మూహింపవలసి యుండును. తనగతి యేమగునో యనువిచారము హనుమకు లేదనుకొందము. వరములు భగవదనుగ్రహము కలదనుకొందము. అయిన నచ్చెరువడఁ గారణమేమని యోజింపవలయును గదా. ఆతని ముఖవర్చస్సును జూడఁగనే హనుమ యచ్చెరువందెను. తస్మాద్రాజముఖం భీష్మమ్. అన్నసూక్తి యతనిస్మృతికిఁ గోచరించెను. మునులకుఁ గలతేజస్సునకు బ్రహ్మతేజస్సని పేరు. అది కేవలము శాంతమైనది. రాజతేజస్సు భయంకరము. ఋషులతేజస్సు వ్యాపించినంతదనుకఁ గ్రూరసత్త్వములు శాంతగుణప్రధానములుగ నుండి వైరములేక యెల్లజంతువులను బ్రేమించును. ఏల? ఋషితేజస్సు శాంతస్వరూపము గాన నది వ్యాపించినంతదనుక జంతువులుకూడ శాంతమునే వహించియుండును. రాజతేజస్సట్టిది గాదు.

"యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా. ౫
తపత్యాదిత్యవచ్చైష చక్షూంషి చ మనాంసి చ,
న చైవం భువి శక్నోతి కశ్చిదప్యభివీక్షితుం. ౬
యస్య ప్రసాదే పద్మా శ్రీ ర్విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః. ౧౧
తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజం,
బ్రహ్మతేజోమయం దండ మసృజ త్పూర్వమీశ్వరః." ౧౪

మను. ౭ అ.

అను నీ మనుస్మృతివాక్యములు రాజతేజము భయంకర మనియుఁ గనుకనే దుర్నిరీక్ష్యమనియుఁ దెల్పుచున్నది. ఉద్దేశము ననుసరించి భగవత్తేజము మాఱుచుండునని యోగశాస్త్రము తెలుపుచున్నది. క్రూరకర్మము చేయుచున్నయెడల నాతేజమే రక్తవర్ణముగా మాఱి భయంకరముగా నుండు ననియుఁ గేవల పాపకార్యములు చేయుచున్నయెడల నది మలినముగా మాఱుననియు నాతఁడే సజ్జనసంగతి నొంది సత్కర్మము లాచరించుచు నిష్కాముఁడైయుండిన నదియే శ్వేత వర్ణముగా మాఱి సర్వజనస్తుతిపాత్ర మగుననియు యోగులు పల్కుదురు. ఈయర్థము మదినుంచుకొనియే సంధ్యావందన మున నర్ఘ్యప్రదానానంతరము "అసావాదిత్యో బ్రహ్మ" అని జలముఁ ద్రిప్పుచుండు టాచారమైనదనియుఁ బెద్దలు పల్కుదురు. భగవత్స్వరూపము తేజస్సే యనియు నదియే ధ్యేయ మనియు యోగమతము. "ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరంధ్యాయతామ్" అని భర్తృహరి చెప్పినది యోగ మతమే. "ధ్యాయేత్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః" అనునదియు యోగమతము ననుసరించినధ్యానమే యగు.

"తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసాసర్వమిదం విభాతి."

అనుశ్రుత్యర్థమే యీధ్యానమని తాత్పర్యము.

"క్షితౌషట్పంచాశ ద్ద్వినవధికపంచాశ దుదకే
హుతాశే ద్వాషష్టి శ్చతురధికపంచాశ దనిలే,
దివిద్విష్షట్త్రింశన్మనసిచ చతుష్షష్టి రితియే
మయూఖా స్తేషా మప్యుపరి తవ పాదాంబుజయుగమ్."

అని శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులుగారు వచించిన సాదాఖ్యకళాధ్యానము యోగమతము గాక మఱే మగును? వ్యక్తిత్వారోపణము స్వాభీష్టరూపనిర్మాణ ప్రకటనార్థము కాని వేఱుగాదు. కావున నిరుపమానతేజస్సు రావణునకు నుండుటంబట్టి హనుమంతుఁడు విస్మితుఁడై వినుతింపసాగెను. ఇంద్రాదులకును బాలకుఁడు కాఁదగినవాఁ డనియెను. ఏల? సర్వసులక్షణము లాతనియందుఁ గనఁబడుచుండెను. అట్టి మహాతపస్సంపన్నునిం బండితుని నిరుపమానతేజోవిరాజితు నేల హనుమ నిందించెను? క్రూరములు ఘాతుకములు లోక కుత్సితములు నగుకర్మము లతఁడు చేయుటంజేసి క్రూరుఁడని లోకులు భయంపడుచున్నారనియు నవియే లేక సర్వలోక పూజితుఁడే యగుననియు నతఁడు తలంచెను. అట్టికార్యము లతఁ డేలచేసెనను ప్రశ్న మిట నవసరము దానిని విమర్శింప నిది చోటుగాదు. దీనిసార మేమి?

సత్కర్మానుష్ఠానమునఁ దేజస్సు వృద్ధియగును. త్రికరణ శుద్ధి గలిగియున్నచో నిష్కామకర్మాసక్తి జనించును. ఆవిషయ మాతనితేజస్సే తెలుపుచుండును. జగద్వంచకులు వేషధారులై గడ్డములుపెంచి కాషాయవస్త్రధారులై సత్కార్యనిరతిని నటించినను వారితేజస్సు మలినమై కనఁబడుచుండును దానిం బట్టియే సాధుమతులు వీఁడు దాంబికుఁడని బైడాలవ్రతుఁ డని బకవ్రతుఁడని తలంతురు ముఖవర్చస్సే మనోమాలిన్య మును నైర్మల్యమును దెలుపును. కావున లోకవంచకులవలెఁ బ్రవర్తింపక దురాశ మాని యదృచ్ఛాలాభసంతుష్టులై భగవంతు నన్వహము తేజోరూపునిగా ధ్యానించుచు భూత

దయాపరుండై యుండినయెడల నతఁడు భగవదనుగ్రహ పాత్రుఁడై నిర్మలశాంతతేజోవిరాజితుఁడై నెగడఁగలఁడు. కావున దాంభికులకపటోక్తుల నాలకింపక వారి దంభధర్మమునకు మోసపోక వారికపటవేషములఁ గాంచి లోఁబడి శిష్యులై ధనమును బోఁగొట్టుకొనక వారిప్రవర్తనములఁ బరిశీలించి సాధువులను సేవించి తదుక్తమార్గమున భేదభావమును వదలి కరుణాకరుని భగవంతు నారాధించి శాంతతేజము నొంది కృతార్థులు కావలయు ననువిశేషమునే మన మీభాగమునుండి గ్రహింపవలయును. ఇఁకఁ దరువాతికథాభాగమును బఠింపఁ బ్రయత్నింతము.

## హనుమంతుఁడు రావణునితో సంభాషించుట.

* అంత రావణాసురుఁడు కోపము తన్నావరింపఁగా ముందు మహాతేజోవిరాజమానుఁడై కూరుచున్న వానరుని గని మనమున సుంత జంకుతోఁ బఁగాఁ బూర్వము నేను గైలాసమును గదలించినతఱి శపించిన యానందియే యీతఁడు. ఆతఁడే యీరూపమున నిచ్చటికి వచ్చెనేమో అదిగానిచో మహాసురుఁడు బాణుఁడే యిట్లు వానరాకారమును దాల్చి వచ్చెనో యని విచారించెను. అంతలోఁ గుమారహననాదులు స్మృతిగోచరములు కాఁగా భూరికోపము పైకొని యరుణాక్షములను గల్పింపఁగా మంత్రిసత్తముని బ్రహస్తుని జూచి తత్కాలోచితముగా నర్థవంతమగువాక్యమున నీదురాత్ముని ఎక్కడనుండి వచ్చితివి? నిన్నిచ్చటికిఁ బంపినవాఁ డెవఁడు?

* ఇది యేఁబదియవసర్గమునఁ గల కథాభాగము.

అశోకవనభంగ మేల చేసితివి? ఏల రాక్షసస్త్రీలను బెదరించి తివి? అని యడుగుము. దుష్ప్రవేశ్యమగు నాపురి కితఁ డేల వచ్చెను? యుద్ధము చేయ నేల? అని యీకపి నడుగుము. అని యాజ్ఞాపించెను.

ప్రహస్తుఁడు రాజాజ్ఞను శిరసావహించి వానరుం గని యోకపీ! ఊఱడిల్లుము. నీకు శుభంబగుఁ గాక. భయంపడకుము ఈనగరమునకు నిన్నింద్రుఁడు పంపినాఁడా? ఉన్నదున్నట్లు వచింపుము భయము వదలుము. నిన్ను విడిచిపుచ్చెదను. కుబేర యమవరుణులలో నెవరికైన గూఢచారివై యీరూపమున మానగరమునకు వచ్చియున్న నిజముపల్కుము. విష్ణుమూర్తి యేమైన రావణేశ్వరుని జయింపఁగోరి నిన్నుఁ బంపెనా? ఎవరు పంపినను నిన్నేమియుఁ జేయము. భయపడక యున్నరూపున వచియింపుము. నీరూపమేమో వానరరూపమే కాని నీతేజము వానరులది కాదు సుమీ. ఉన్నదున్నట్లు చెప్పుము. పిదప నిన్ను వదలివేసెదను అసత్యము వచింతువేని నీ వసువులఁ దాల్చియుండు టబ్బురమే. ఎవ్వరునుబంపక నీయంతన నీవే వచ్చితివేని లంక కేలవచ్చితివో ఆకారణమునైనఁ జెప్పుము. అని చక్కఁగా నాగ్రహములేక ప్రశ్నించెను.

ప్రహస్తుఁ డిట్టులడుగఁగా వానరోత్తముఁడౌ హనుమంతుఁడు ప్రహస్తుని బాటింపక రావణుని గాంచి రాక్షసేంద్రా! నేను నింద్ర యమవరుణులలో నెవరికిఁగాని గూఢచారినై రాలేదు. కుబేరునితో నాకేమాత్రము స్నేహము లేదు. విష్ణుమూర్తి నన్నిచ్చటికిఁ బంపలేదు. నేను వానరుఁడ

నగుట జాతిచేత వచ్చినదేగాని వేఱుగాదు. వానరుఁడనై వచ్చితినిగాని వానరవేష మూనినది కాదు. రాక్షసేంద్రుఁడ వగు నీదర్శనము దుర్లభముగా నుంటంజేసి దర్శించుకుతూ హలమున నశోకవనమును ధ్వంసముచేసితిని. బలవంతులగు రాక్షసులు నాతో యుద్ధముగోరి నాపైకి వచ్చిరి. నాదేహ మును రక్షింపఁగోరి వారితోఁ బోరాడితిని. మఱెందులకుఁ గాదు. దేవాసురులకుం గూడ నేయస్త్రముచేతను, ఏపాశము చేతను నన్ను బంధింప నలవిగాదు. నీకెట్లో నాకు నట్లే బ్రహ్మ దేవునివలననే లభించినది. రాక్షసరాజవగు నిన్నుఁ జూడ వలయు ననుకోరికచే నీబ్రహ్మాస్త్రమునకు బద్ధుఁడనైతినని నమ్ము ము. నన్ను వీరు గట్టివేయఁగనే బ్రహ్మాస్త్రము వదలినది. అది మఱొకబంధముతో నిలువదు. నాకొక రాజకార్యము గలదు. అందుకొఱకే నీ యొద్దకు వచ్చినాను. మహాతేజుఁడగు శ్రీరాముని దూతనుగా నన్నెఱుంగుము. అని తెలిపెను.

మహాశయులారా! ఇందలివిశేషములఁ గాంతము.

"శంకాహతాత్మా దధ్యౌ స కపీంద్రం తేజసావృతం,
కి మేషభగవా న్నందీ భవే త్సాక్షా దిహాగతః. 2
యేన శప్తో ఽస్మి కైలాసే మయా సంచాలితే పురా,
సోఽయం వానరమూర్తి స్స్యా త్కింస్వి ద్బాణో ఽపి వా సురః. 3

అని మూలము. రావణుఁడు తేజోరూపమున నలరు హను మంతుని జూడఁగనే అనేకశంకలుపొడమి మనస్సును గలంతఁ బెట్టఁగా నిట్లు లూహించెను ఈతఁడు భగవంతుఁడగు నందీ శ్వరుఁడే ప్రత్యక్షముగా వచ్చెనా యేమి? ఏల యీశంక? నందీశ్వరుఁడు వానరముఖము కలవాఁడు. అతనిఁగాంచియే

రావణుఁడు నవ్వెను అతఁడు కోపించి శపించెను. అదియే యిప్పుడు రావణునకు శంక కలిగించెను. కనుకనే స్మృతిమంతుఁ డయ్యెను. అనఁగా నాఁటివిషయము తలంపునకు వచ్చెను. ఆతఁడే యిపుడువచ్చెనా యేమని తలంచెను. ఆశాపము మనః ఫలకమునఁ బొడకట్టెను వానరముఖము గలవారే నిన్నవ మానింతురని యా శాపసారము. ఆతఁడే కాకయున్న నిట్టి శూరత్వమును జూప నవసరమేమని యాలోచించెను. లోక మున నెవరికైనను దాఁ జేసినయపరాధము పాపము విప త్కాలమున స్మృతికిందగిలి యదియే యీకష్టమునకుఁ గారణ మని తోఁపఁజేయును. కర్మసిద్ధాంతము నాస్తికులకుంగూడ విప త్కాలమున నాచరణార్హ మని తోఁపకమానదు. దాని కిదియే దృష్టాంతము. కిం స్విద్బాణోఽపి వాసురః = బాణాసురుఁడా యేమి ? అనియు శంకించెను. ద్వాపరాంతమున బాణాసురుఁ డున్నవాఁడని పురాణములే తెల్పుచున్నవి. త్రేతాయుగ మున నీ కథసాగినందున నతఁడు కాఁడనుట సిద్ధమే. మహా బలిసుతః అనేన తేనాపి కించిత్ శస్తమితి గమ్యతే=అని గోవింద రాజులు. బాణోబలిసుతః మహాసుర ఇతిదర్థ్యా=అని మహే శ్వరతీర్థులు వ్రాసిరి. రావణుఁడు బలిచక్రవర్తికడకుఁ బోయిన ట్లుత్తరకాండమునఁ గలదు. ఆచోట బాణాసురుఁ డను కుమారుఁ డాతనికిం గలిగినట్లు రావణుని శపించినట్లు కాన రాదు. ఈరావణుని శంకనుబట్టి శాపము శంకింపఁబడవలెను. ఎవరెవరు తనచే నవమానింపఁబడిరో వారే యీరూపమున వచ్చి యపకారముచేసిరని శంకించెను. పూర్వ మితరులకుఁ జేసినయపకారములు పాపములు విపత్తునకు హేతువు లగును.

కనుకనే యవి యాకాలమునఁ దోఁచుచుండును. దాన మఱిం తశంక దృఢపఱచు. మనశ్శాంతి దానిచేఁ గృశించును. పాప ఫలానుభవ మనఁగా నిఁక నెట్టిది? దీనినుండి నేర్చుకొనఁదగిన విషయము లెవ్వి? తనకు వికృతముగాఁ దోఁచినరూపమును బరిహసింపరాదు. అది యొకయాపదను గల్పించును. దీనాంధ బధిరకుబ్జాదులం గాంచినపుడు భగవంతునిస్మరించి యిట్టి యనుభవము రాకయుండ నన్నుఁ గాపాడుమా స్వామీ యని ప్రార్థింపవలయును. తనకుశక్తిగలదని సాధువుల కహి తముచేయరాదు. అది యాపన్మూల మగును. అను నీరెండు విషయము లీభాగమునుండి మనము నేర్చుకొనఁదగినవి.

"సమాశ్వసిహి భద్రం తే న భీః కార్యా త్వయా కపే. ౯
యది తావ త్త్వ మింద్రేణ ప్రేషితో రావణాలయం,
తత్త్వ మాఖ్యాహి మాభూత్తే భయం వానర మోక్ష్యసే. ౧౦
... ... ... ... ...
విష్ణునా ప్రేషితో వాపి దూతో విజయకాంక్షిణా,
న హి తే వానరం తేజో రూపమాత్రం తు వానరమ్. ౧౦
తత్త్వతః కథయ స్వాద్య తతో వానర మోక్ష్యసే,
అనృతం వదత శ్చాపి దుర్లభం తవ జీవితం. ౧౧
అథ వా యన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే,"

అని మూలము. ప్రహస్తుఁడు రావణానుమతి నంది హను మంతుని బ్రశ్నించుచున్నాఁడు ఈప్రశ్నముల ధోరణి చూడఁగా నాతనిరాజ్య మెంతధర్మనిబద్ధముగ నున్నదో తేలె డిని. తొలిమాట యీాఱడిల్లుమని రాక్షసులు బాధించు చుండిరి. మరల బాధింతురేమో యనుశంకవదలి నెమ్మదిగా

నుండుము. భయపడకుము. దొరకితిని నన్నింకఁ జంపక వదలు దురా యని భయంపడకుము.ఆయాలోచనయే వలదు. అనఁగా నిన్నుఁ జంపమని భావము. ఇంద్రునిచేఁ బంపఁబడితివా యేమి? ఇంద్రునినగరము ముట్టడించి పట్టితెచ్చి యతనిఁ గారాగృహ మున నుంచితిమి. ఆవైరమును దీర్చుకొన నెవరిసాయమునో గల్గి నిన్నుఁ బంపెనా యేమని ప్రశ్నతత్త్వము తత్త్వ మాఖ్యాహి. ఉన్నదున్నట్టు పల్కుము. తేభయం మాభూత్ = నీకు భయము కలుగదు. అంతియగాక మోక్ష్యసే=వదలఁబడ దువు. దాఁపక జరగినది జరగినట్లు పల్కుము. ప్రాణభయము కలుగదు. మఱియు వదలిపెట్టుదుము అనఁగా మాద్వేషము నిన్నుఁ బంపినవారిపై దీర్చుకొందుము నిన్నేమియు బాధింప మని యభయదానము. విజయమును గోరి విష్ణుమూర్తి పంపెనా? రాక్షసుల కులవైరియగు విష్ణువు మమ్ము జయింపఁగోరి తొలుత మాబలములఁ గనిపెట్టిరమ్మని పంపెనా యేమి? ఏల యీప్రశ్నమనఁగాఁ దెలుపుచున్నాఁడు. తే తేజః వానరం న హి = నీయీతేజము కపులకుండునది కాదు. ఈతేజస్సు కోఁతులయందుఁ గానరాదు. రూపమాత్రంతు వానరమ్= వానరరూపముమాత్రమే. అనఁగా మహాతేజశ్శాలివగు నీ వెవ్వఁడవో కాని కపివిమాత్రము కాదు. అని యూహ. ఉన్న దాని నున్నట్లే పల్కుము. వదలిపెట్టఁబడుదువు. అనృతం వద తస్తవజీవితం దుర్లభమ్ = అసత్యమాడిన బ్రదుకుట కష్టము. మాప్రశ్నములకు యుక్తిగా సత్యమునువిడిచి యుత్తరమిచ్చిన బ్రదుకుట కష్టమే. అనఁగా నసత్యమాడక నిజము చెప్పితివేని నిర్భయముగా వెడలిపోవ సమ్మతింతుము. అసత్యమాడిన

వధింతుమనికదా ప్రశ్నసారము. ఎవరుపంపక నీవే వచ్చి యున్నచో నందులకుఁ గారణమేమి?

ఈప్రశ్నపరంపరం దిలకించిన నామహాసభ సత్యమునం దాదరము గల్గియున్నదనియే స్పష్టమగుచున్నది కదా రాక్షసులు కేవల క్రూరులన్నమాట దబ్బఱయని యీప్రశ్నముల ధోరణియే తెల్పుచున్నది. వాగ్దానముమాత్రమే కాని క్రియాశుద్ధి యుండదందురేమో యది నిస్సార మనవలయును. ప్రభువులు మంత్రులు వాగ్దానమును దప్పినవారి మాట నాలకించువారెవ్వ రుందురు ప్రహస్తుఁడు ప్రధాన మంత్రి ఆతఁడు దబ్బఱలాడిన నారాజ్య మెంతకాలము నిలువఁ గలదు. అట్టివారేయైన నా ప్రశ్నములధోరణియే వేఱుగనుం డును ప్రశ్నములన్నియు సత్యాన్వేషణతత్పరములై యున్నవి. వాగ్దానము స్మృతిసమ్మతమై యున్నది. ప్రశ్నములధోరణి శాంతమై యున్నది. వీనింజంపక విడువరాదనుభావ మించు కయు నందుఁ గానరాకున్నది. భయమువలదు, ఊఱడిల్లుము= అను హెచ్చరికలు పెక్కుసారులు చేయఁబడియున్నవి. కావున నామహాసభ రాజనీతికి విరుద్ధముగాఁ బ్రవర్తింపఁ దలంచునదికాదని స్పష్టము. ప్రహస్తాదిమంత్రులుకాని యింద్ర జిత్ప్రముఖ రాజపుత్రులుగాని కుంభకర్ణాది రాజసహోదరులు గాని పరదారహరణాదిమహాపాపము లొకప్పుడు చేసిరనియైన వచింప రామాయణమునుబట్టి యవకాశము కానరాకున్నది. మహాతపస్వియగు రావణుఁడు చేసెనన్న నేదో కారణ ముండు నని యూహింపవలయుఁ గాని యూరకే నిందింప నవకాశము చాలకున్నది. కావున సీతాపహరణము తన మేలుకొఱకు

భగవదాగమనమును గోరి చేసెనని దీనింబట్టికూడ నేర్పడు చున్నది గదా.

"ఏవముక్తో హరిశ్రేష్ఠ స్తదా రక్షోగణేశ్వరం. ౧౨
జాతిరేవ మమ త్వేషా వానరోఽహమిహాగతః,
దర్శనే రాక్షసేంద్రస్య దుర్లభే తదిదం మయా. ౧౩
వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితం,
తత స్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాంక్షిణః. ౧౪
రక్షణార్థం తు దేహస్య ప్రతియుద్ధా మయా రణే,
అస్త్రపాశై ర్న శక్యోహం బద్ధుం దేవాసురై రపి. ౧౫
పితామహాదేవ వరో మమా ప్యేషోభ్యుపాగతః,
రాజానం ద్రష్టుకామేన మయాస్త్రమనువ ర్తితం. ౧౬
విముక్తోఽ ప్యహ మస్త్రేణ రాక్షసై స్త్వభిపీడితః,
కేనచిద్రాజకార్యేణ సంప్రాప్తోఽస్మి త వాంతికం. ౧౭
దూతోఽహమితి విజ్ఞేయో రాఘవ స్యామితౌజసః,
శ్రూయతాం చాపి వచనం మమ పథ్య మిదం ప్రభో." ౧౮

అని మూలము. హనుమంతుని సమాధానవాక్యము లివి. ప్రశ్నములకుఁ దగినయుత్తరములనియే తోఁచును. సత్య హితములై యడఁకువను దోఁపఁజేయుచు నిర్భయముగా హృదయపూర్వకములుగాఁ జెప్పఁబడినవే యని తోఁపఁజేయు చున్నవి. కాని యిందుఁ గొన్నిసంశయములు గలవు. కనుక నే మూలము నుదహరించితిని. హనుమ సత్యమునే చెప్పెనా? అసత్యమాడెనా అని కొందఱు శంకించిరి. దేహరక్షణార్థము యుద్ధము చేసితినన్నమాట నిజమా యని శంకించుకొని సమా ధానమెట్టులని విచారింతము. ప్రహస్తుఁడు ప్రశ్నించినది

హనుమ రావణునకు నుత్తరము చెప్పుచున్నాఁడు. అది యపరాధమని మంత్రి యనఁజాలఁడు కదా. రాజు ప్రశ్నింపఁగా నుత్తరము మంత్రికిచ్చిన నది యపరాధ మగును. జాతిచే వానరుఁడనేకాని వేషాంతర మిదిగాదు. దుర్లభమగు రావణునిదర్శనము చేయుకోర్కిని వనభంగ మొనరించితిని. యుద్ధకాంక్షులగు రక్కసులు వచ్చిరి. దేహసంరక్షణము ముఖ్యముగాన వారితో యుద్ధ మొనరించితిని. అనిగదా హనుమయుత్తరము. రావణునిజూడ నుపాయాంతరము లేక వనభంగ మొనరించితినన్నఁ గొంతదనుక నంగీకరింపవచ్చు. యుద్ధమునకు వచ్చినవారిని మార్కొని చంపనేల? ఇపుడు కట్టుపడినట్లే తోలుతనే కింకరులకుఁ జిక్కియున్న రాజదర్శన మగునుగదా. బ్రహ్మాస్త్రబద్ధుఁడై విధిలేక వచ్చినమాట యసత్యము కాదు కదా ఇది యనృతము కాదా యని ప్రశ్నించువారు గలరు. వనభంగము కావించుతఱి నీవిషయమంతయు హనుమ యోజించెను

"కథం ను ఖల్వద్య భవేత్సుఖాగతం
ప్రసహ్య యుద్ధం మమ రాక్షసైః సహ,
తథైవ ఖల్వాత్మబలం చ సారవ
త్సమ్మానయేన్మాం చ రణే దశాననః.
తత స్సమాసాద్య రణే దశాననం
సమంత్రివర్గం స బలప్రయాయినం,
హృది స్థితం తస్య మతం బలం చ వై
సుఖేన మత్వాహ మితః పునర్వ్రజే.

ఇదమస్య నృశంసస్య నందనోపమ ముత్తమం,
వనం నేత్రమనఃకాంతం నానాద్రుమలతాయుతం.
ఇదం విధ్వంసయిష్యామి శుష్కం వన మివానలః,
అస్మిన్ భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః.

సుం. ౪౧ సర్గము.

అని హనుమ వితర్కించినట్లు ముందే వ్రాసితిని గదా. యుద్ధ మొనరించి నాబలమును రావణున కెఱింగించి యతని సేనా బలము మహాయోధులబలము నెఱింగిపోవలయునని కదా యాలోచించెను. యుద్ధరంగమునకు రావణుఁడు వచ్చునని తలంచెను. కాని యతఁడు రాఁడయ్యెను. కాన నతనిఁ జూడఁ బోయెను. ఇందు హనుమంతుని కపటవర్తన మేమున్నది? సుగ్రీవుఁ డడుగఁగా స్వానుభవమును దెల్పవలయునని యాతనియూహ. అది కాదేని బ్రహ్మాస్త్రబంధము వీడఁగనే దేహమును బరమాణుప్రాయముగాఁ జేసి యాబంధములు తమంతన తామే వదలఁగా నింగి కెగసిపోయియుండును. ఇంద్రజిత్తప్పుడు చేయఁబోవుమహాకార్య మేదియు నుండదు. కావున రక్కసులఁజంపుట మొదలగునవి వంచనాసక్తి కుదాహరణములు కావని తేలెడిని. అస్త్రములచే నన్ను బంధించుట నీకు దేవతలకుం గూడ శక్యము కాదనియె. ఇది సత్యమే కదా? మమాపి పితామహా దేవవరః = అనుచో వరశబ్దము వలన నీకెట్లు బ్రహ్మావరముగలదో నాకు నట్లే కలదని యర్థము. ఏలవొరకితి వనుప్రశ్నము వచ్చునని యూహించి రాజదర్శనముకొఱకు బ్రహ్మాస్త్రమునకు లోఁబడితిననియెను. ఇదియు సత్యదూర మించుకంతయుఁ గాదు. రాక్షసులు నన్ను బంధిం

గా నస్త్రపాశములు వదలినవనుట యింద్రజిత్తే యూహించినవిషయము గదా. హనుమ యింతదనుక జరపినకార్యములలో సత్యదూరముగాఁ గాని కప్పిపుచ్చిగాని పల్కిన దిసుమంతయుఁగూడ లేదని తేలుచున్నది. ఒకానొకరాజకార్యార్థము నీకడకు వచ్చితిని. అమితౌజస్సు గలవాఁడనఁగా పరమేశ్వరుఁడని భావము. అట్టి రాఘవునకు దూతను. పథ్యముగా నా వచించుపలుకుల నాలకింపుమనియెను. ఈ సంభాషణమును బట్టి హనుమంతుఁడు సత్యసంధుఁడనియుఁ గావుననే భగవత్కింకరుఁ డయ్యెనని స్పష్టమగుచున్నది. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## హనుమంతుఁడు రావణునకు హితోపదేశము చేయుట.

* అంత హనుమంతుఁడు రావణుం గాంచి సార్థకములగువాక్కుల నిట్లు పలికెను. రాక్షసేంద్రా! సుగ్రీవుఁడు కొన్ని విషయములు చెప్పి నన్నుఁ బంపుటం జేసి నీకడకు వచ్చితిని నీభ్రాత సుగ్రీవుఁడు తనుక్షేమమును నీకుఁ జెప్పుమనియె. ఆమాన్యుఁడు ధర్మార్థసహితము నిహపరశ్రేయస్కరమునుగా నొకవార్త నామూలమున నీకుం బంపెను. దాని నాలకింపుము. దశరథుఁడను మహారాజు గలఁడు ఆతనిపుత్త్రులలో జ్యేష్ఠుఁడు మహాతేజస్వియునగు శ్రీరాముఁడు కలఁడు. ఆమహాత్ముఁడు తండ్రి యాజ్ఞానుసారము పురము వెడలి ధర్మమార్గము నవలంబించి యనుజుఁ డగులక్ష్మణుని భార్యయగు

* ఇది యేఁబదియొకఁడవసర్గమునఁ గల కథ.

సీతనుగూడ దండకారణ్యమును బ్రవేశించెను. జనకమహారాజు మహాజ్ఞాని. ఆతనికొమరితయు మహాసాధ్వియు నగుసీత వనమునఁ గనఁబడకపోయెను. సోదరు లిరువురు నామెను వెదకుచు వచ్చి ఋశ్యమూకమునకు వచ్చి సుగ్రీవునితో మైత్రి యొనరించుకొనెను. సీతను వెదకించెదనని సుగ్రీవుఁడు ప్రతిన చేసెను. శ్రీరాముఁ డందులకు బదులుగా వానరరాజ్యమునకు నతనిఁ బట్టముగట్టెదనని సమయముచేసి సంగరమున వాలి నొక్కకూలం గూలనేసి సుగ్రీవునకుఁ బట్టాభిషేకము చేసెను. వాలి యెట్టి బలశాలియో నీ వెఱుంగుదువు కదా. ఆతని నొక్కబాణమునం జంపెను. అంత సుగ్రీవుఁడు సత్యవాది గావున సీతాన్వేషణార్థము సకలదిక్కులకు వానరులం బంపెను. ఎల్లతావులన సంఖ్యాకులగు వానరభల్లూకపతులు వెదకుచున్నారు. వారిలో ననేకులు గరుడానిలవేగులు.

రాజా! నేను వాయువు నౌరసపుత్త్రుఁడను. హనుమంతుఁడని నన్నుఁ బిలుతురు. నేనా జానకీనిమిత్తమే శతయోజనపరిమితసాగరమును దాఁటి యిచ్చటికి వచ్చితిని. నీ గృహమున వెదకుచుండఁగా దైవవశమున నాకా సీతాదేవి కనఁబడియె. ఇఁక సుగ్రీవునిసందేశ మాలకింపుము. నీవనఁగా శాస్త్రవేత్తవు. ధర్మార్థస్వరూపపరిజ్ఞానము కలవాఁడవు. తపస్వివి. తపస్సే నిన్నుఁ వరించిన దనవచ్చును. మహాప్రాజ్ఞుఁడవు. ఇంతటి వాఁడవై పరస్త్రీల నీరీతి చెఱఁబట్టుట యించుకంతయునుచితము గాదు. పరదారాపహరణాదులు మిగుల ధర్మవిరుద్ధములు. సుఖాస్పదములైనచో ధర్మవిరుద్ధములైన నేమని యందువేమో అవి తొలుదొలుత నిన్నే నశింపఁజేయును. నీవే నశిం

ఁగా నిఁక వానికిఁ బరిహార మెట్లు కల్గును? నీవంటి బుద్ధిసంప న్నులు చేయఁబూనరు సుమీ. నన్నెట్లు రూపుమాపుదురట్లని ప్రశ్నింతువేమో వినుము. శ్రీరామలక్ష్మణులు కోపించి బాణ ప్రయోగము చేయఁబూన నిఁక వానిముందఱ నిలువ దేవ దానవులలో శక్తుఁ డెవ్వఁడుండును? శ్రీరామున కప్రియము గావించి సుఖము నొందఁజాలువాఁడు ముల్లోకములయం దొక్కఁడు నుండఁడు. నీపని యధర్మము గాన సుగ్రీవుఁడు నీకీమాట చెప్పిపుచ్చినాఁడు. ఈపద్ధతిననుసరించి నీవు వర్తింతు వేని సీతాపహరణరూప పూర్వాపరాధముఁ దొలఁగించి యిప్పటిభాగ్యమును రక్షించి రాఁగలశుభముల నొసంగం జాలును. కావున నాహితము త్రికాలహితమును గల్గించునది. ధర్మానుగుణము. పురుషార్థప్రదము నగునని యూహింపుము. శ్రీరామునకు సీత నొసంగుము. సీతను నే నపహరించి తెచ్చితి నని నీ వెట్లు చెప్పఁగలవని యడుగుదువేమో నేనే సీతాదేవిని గన్నులారఁ గాంచితిని. నాభాగ్యమున నా కాపుణ్యము లభించి నది. ఆబిడను దీసికొనిపోరాదా యందువేమో ఇఁక శేష కార్యమునకు శ్రీరాముఁడే కర్త. అది నా కాజ్ఞాపింపఁబడినపని కాదు. నీ వామెను గాంచినను నావశమున నున్న సీత నెట్లు రాముఁడు కొనిపోఁ గలఁడని ప్రశ్నింతువేమో. వినుము. సీతాదుఃఖ మపారము. నేనే పరికించితిని. నీవు జానకిం బట్టి తెచ్చి వశమునం దునుచుకొన్నయట్లు తలంచుకొంటివి. అం తియకాని నీప్రాణవాయువులఁ ద్రాగు పంచశిరస్సర్పమును బట్టి తెచ్చుకొన్నవాఁడనని యెఱుఁగవు. మహాగరళయుక్తాన్న మును జఠరాగ్నిదీపమున నైనఁగాని జీర్ణింపఁ జేసికొన నలవి

గానియట్లు జానకిని దేవాసురులలో నెవ్వారైన నెంతపరా క్రమము గలవారైన దక్కించుకొననేరరు. దనుజేంద్రా! ఎన్నియో శ్రమముల కోర్చి తపము గావించి, చేసినధర్మముల కన్నింటికి ఫలముగా నీరీతి దీర్ఘాయువు నొందితివి. దీనిని నాశనము చేసికొనుట మంచిది గాదుసుమా. నన్నెవ్వరు వధింపఁ జాలరు. నాయాయువెట్లు నశించునని యందువేమో. తపః ప్రభావమున దేవాసురావధ్యుఁడనై యున్నాఁడని తలంచెదవు. నిన్ను వధింప నపరిహార్యమగు కారణము గలిగియే యున్నది. మఱేదియు నదిగాదు. సుగ్రీవుఁడే. అతఁడు దేవత గాఁడు. అసురుఁడు గాఁడు. రాక్షసాదులలోఁ జేరినవాఁడు కాఁడు. వరదానకాలమున నెవరెవరిమూలమునఁ జావు గలుగకయుండ నడిగితివో వారిలో నతఁ డొక్కఁడును గాఁడు. కావున నో ప్రభూ! ఆసుగ్రీవునిచేత మృతినొందక నీవెట్లు ప్రాణములఁ దక్కించుకొనఁగలవు? ఈయుపదేశము లేల? నాచేసినపాపములకు ఫలముగలుగక వదలునా యందువేమో ధర్మఫలమెన్నఁడు నధర్మఫలముతోఁ గలిసియుండదు. అది ధర్మఫలమునే వెంటనంటి యుండును. అయినను జేసినదాని ఫల మనుభవింపక తప్పించుకొనుట యెట్టులందువేమో వినుము. ధర్మము లధర్మములను రూపుమాపఁగలవు. అధర్మము ధర్మమును నాశనము చేయఁజాలదు. కనుక ధర్మమునే చక్కఁగ నాచరింతువేని నీచేసిన పాపకర్మములు నశించును. ఇంతకుఁబూర్వము చేసినధర్మమే యీయధర్మముల రూపుమాపదా యనెదవేమో అట్లనరాదు. నీచేసిన ధర్మఫలమంతయు నిరవశేషమైనది. నిస్సందేహము. సీతాపహరణ

రూపాధర్మమును నశింపఁజేయఁ జాలుధర్మము నీయందు లేదు. కనుక నధర్మఫలమునే వేగముగా ననుభవింపఁ గలవు. పైఁబడ నున్నదానిం గనుము. శ్రీరాముఁడు కేవలమర్త్యుఁడని యూహింపకుము. రామచంద్రుఁ డొక్కఁడే జనస్థానవాసుల రాక్షసులనందఱిం జంపుట. ఒక్కకోల వాలింగూల్చుట రామ సుగ్రీవులసఖ్యము. అనువాని విచారించి నీకు హితమెద్దియో తెలిసికొనుము. నేనొక్కఁడనే చతురంగబలములతో నిండి యుండు నీలంకను నాశముచేయం గల్గుదును ఆకార్యము శ్రీరామునకు సమ్మతము కాదు. సీతాదేవి కపకారముం గూర్చినవారినెల్లఁ దానే వధించునట్లు వానరభల్లూకముల సమక్షమున శ్రీరాముఁడు శపథము చేసియున్నాఁడు సుమా. ఇంద్రునంతవాఁడా శ్రీరామునకుఁ గీడుగావించి సుఖము పొందఁజాలఁడు. ఇఁక నీబోఁటివానిమాట యిటఁ జెప్పనేటికి? ...వేవ్యక్తిని సీతయని చూచుచున్నావో ఏసాధ్వి యిపుడు ...చేతం జిక్కియున్నదో యావ్యక్తి యీ లంకానగరము ...ంతయు నంతమునొందించు కాళరాత్రియని యెఱుంగుము. ...న సీతారూపకాలపాశము నీవే మెడకు వేసికొన్నది ...లును. ఇఁక నీకు హితమేదో యాలోచించుకొమ్ము. ఈ ...గర మిప్పటికే సీతాతేజమున దహింపఁబడి యున్నది. శ్రీరా ...మునికోపముకూడ దానికిం దోడయి యలయింపఁగా సమ ...స్తము దహింపఁబడును. చూడుము. ఈదుష్కార్యమున నీ ...వారినెల్ల నాశము నొందింపకుము. మహారాజా! నేను శ్రీరా ...మునిదూతను గావున శ్రీరాముని ప్రభావమును జక్కఁగా ...ఱుంగుదును. రాయబారిని గాన నీకు హితము చెప్పవలసిన

వాఁడను. నేను రాక్షసుఁడను గాను. మానవుఁడను గాను. వానరుండ నగుటవలన మధ్యస్థుఁడనగుటచేఁ బక్షపాతములేక చెప్పెదను. నామాట నాలకింపుము. నావాక్యము తప్పదు.

రాక్షసేంద్రా! శ్రీరాముఁడు స్థావరజంగమాత్మక ప్రపంచములనన్నింటిని బ్రళయకాలమునందు రుద్రునిమూల మునఁ దానే సంహరించును. మరలఁ గల్పాదియందు వానిని యథాపూర్వముగా బ్రహ్మరూపమున సృజింపఁ గలఁడు విష్ణు దేవునివంటి పరాక్రమశీలుఁడు గావున నతనితో నని చేయఁ గలవాఁడు దేవాసురాదులలో నెందు నేకాలమందును లేఁడు. సమస్తలోకాధిపతియగు శ్రీరామున కింతయప్రియము గావిం చితివే. ఇఁక నీప్రాణములు దక్కుటెట్లు? యుద్ధమున నెవ్వరు గాని శ్రీరామునిమ్రోల నిలువఁజాలరు. సామాన్యదేవతల మాట యేల? త్రిలోకాధిపతియని మహాయశంబు గాంచిన వృత్రారియైనను, రుద్రుఁడను పేరుగాంచి మూఁడవకంటి మంటచే మన్మథునిఁ గాల్చి త్రిపురాసురలనఁబడు మహావీరుల నిర్మూలము గావించియున్న శివుఁడైనను, కర్మవశ్యులవలె జన్మిం పక తనంతన జన్మించి స్వతంత్రుఁడై నాలుగువేదముల నేక కాలమున నాలుగుమోముల నుచ్చరించుచునుండు బ్రహ్మ దేవుఁడు నింకను గలవారలెల్ల నొక్కటిరై శ్రీరామునకు వధ్యుఁడై యుండువానిని యుద్ధమున సంరక్షింప శక్తులు కారు. అనఁగానే రావణుఁ డామాటలు హితములుగా నున్న నప్పటి కప్రియములుగా నున్నందునఁ గోపమున నేత్రగోళము లరుణంబులై తిరుగుచుండ నాకపినిఁ జంప నాజ్ఞాపించెను.

మహనీయులారా! యీభాగమున విమర్శనార్హము లగువిషయము లనేకము లున్నవి. వానిని నెమకుదము.

"వాక్యమర్థవ దవ్యగ్ర స్త ముపాచ దశాననమ్. ౧

అని మూలము. అర్థవద్వాక్యమ్=రావణునకుఁ బ్రయోజనము (అనఁగా నుపకారము) గల్గించువాక్యమునని భావము. హను మంతునకు రావణునాశయము తెలియదు. శాపప్రాప్త దానవ కులజన్ముఁడని తెలియదు. లోకదృష్టిం జేసి యది యధర్మకార్య మగుట నతనిసంపదను దేజమును గన్నులారఁ జూచుచున్న వాఁడు కనుక నతఁడీయొక్కదుర్గుణమును వదలినఁ ద్రిలో కాధిపతి కాఁదగినవాఁ డన్నభావము గలవాఁడై తనశక్తి కొలఁది హిత ముపదేశింపఁ బూనెను. కావునఁ దదుపకారక మగుమాటను జెప్పఁబూనెనని భావము. అవ్యగ్రః = తానీపలు కులు తెలిపిన నేమనునో యను జంకులేనివాఁడై యనఁగా.

"సత్యంబ్రూయా త్ప్రియంబ్రూయా న్నబ్రూయా త్సత్యమప్రియం,
ప్రియంచ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః."

అన్న మనుస్మృతిననుసరించి సత్యము హితమునగునట్లు మాట లాడఁ బూనినవాఁడు కనుకనే మనోవైకల్యము లేనివాఁ డయ్యెనని భావము. ఇతరులను మెప్పింపవలయునన్న యూహ గలవారు సత్యము నతిక్రమించి యితరులకు నిష్టమగురీతి మాటలాడుదురు. సాధువు లట్లుగాక పరులకు న్యాయదృష్టి గలవారలకు హితమగునట్లు సత్యమును మీఱక దాన స్వార్థము నెద్దానిని సాధింపఁగోరక పరహితము గలుగఁ బలుకు దురు. వా రద్దాని గ్రహించివర్తించుచో బాగుపడుదురు.

లేనిచోఁ జెడుదురు. పథ్యమనఁగా నెదుటనుండు శ్రోతలకు హితమని యర్థము కాదు. న్యాయదృష్టికి సజ్జనులకు హితమని భావము. దాని ప్రకారము వర్తించినచో నతఁడు మేలు పొందవలయును. అట్టిమాట యని సారము. అట్టిమాట నా హనుమంతుఁడు చెప్పఁబూనెనని కథామార్గము.

"అహం సుగ్రీవసందేశా దిహ ప్రాప్తస్తవాలయం,
రాక్షసేంద్ర! హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్. ౨

అని మూలము. ఒకానొకప్పుడు రావణుఁడు దిగ్విజయార్థము పయనము సాగించుచుఁ కిష్కింధకుం బోయి వారిని యుద్ధము చేయఁ బిలువఁగా ద్వారముననున్న తారుఁ డనువానరుఁడు నవ్వి రావణా! నీయుద్యమము క్షేమకరము దక్షిణసాగరమునకు సంధ్యోపాసనార్థ మరిగెను. అవసరమని తోఁచినఁ బొమ్మనెను. ఒంటరిగా నిరాయుధుఁడుగా నుండుననియు నట్టియెడ వానిని జయించుట సుకరముగా నుండుననియుఁ దలంచి పోయి యొక్కఁడే వెనుకప్రక్కనుండి పట్టుకొనఁ జేతులఁ జాపఁగా నతఁ డతనిఁ గరముల నడిమి లేచి నాలుగుసంద్రముల మునిఁగి కిష్కింధ ద్వారముకడ పూర్వము త్రోవచెప్పిన తారుఁడు చూచుచుండఁగా నేలఁబడ వదలెను. అత్తఱి నిర్గతాహంకారుఁడై రావణుఁడు వాలిని బొగడి యొకనెల కిష్కింధానగరమున నుండి యొడలిబడలికలు దీఱఁగా నెల వందిపోయెను. అత్తఱి వాలి సుగ్రీవులు తానును సోదరభావముగలిగి వర్తింప నొకసమయము చేసికొనియుండుటం బట్టి హనుమ నీసోదరుఁడు సుగ్రీవుఁడు నీకుశల మడిగెనని తెలిపెనని గ్రహింపందగు. సుగ్రీవసందేశాత్=అనియెఁ గదా.

శ్రీరామసందేశాత్ = అనవలదా యందురేమో. సుగ్రీవుఁడు రాజు గావున నతనియాజ్ఞవలన ననుటయే యుక్తము. సుగ్రీవునిసందేశముం గొని నీయింటికి వచ్చితి ననియెను. రాయబారినని భావము. రాయబారిమాట చక్కఁగా వినఁదగినదని యాశయము.

"భ్రాతుశ్శృణు సమావేశం సుగ్రీవస్య మహాత్మనః,
ధర్మార్థోపహితంవాక్య మిహ చాముత్ర చక్షమం." 3

అని మూలము. మహాత్మనః భ్రాతు స్సుగ్రీవస్య = అనుటంజేసి నిన్నానాఁడాదరించిన,సోదరతుల్యుఁడైన సుగ్రీవుని వాక్యం, మాటను,ఎట్టిదాని? ధర్మార్థోపహితమ్=న్యాయముతో, ప్రయోజనముతోఁ గూడినదానిని, ఇహ అముత్ర చక్షమమ్=ఇహపర సుఖములఁ గల్పించుదానిని వినుము అని భావము. సాధుమతి యగు సోదరవాక్యము విననలయును. ఎట్టిదైన? ధర్మార్థముల కనుకూలమై యిహపరసుఖములను గల్పించునదైన. అట్లు గాక యున్న సోదరవాక్యనైన వదలవలయునని తాత్పర్యము.

"అధార్మికో నరో యో హి యస్య చా ప్యనృతం ధనమ్,
హింస్రారతశ్చ యో నిత్యం నేహాసౌ సుఖమేధతే. ౧౭౦
న సీదన్నపి ధర్మేణ మనోఽధర్మే నివేశయేత్,
అధార్మికాణాం పాపానా మాశు పశ్యన్ విపర్యయమ్. ౧౭౧
నాధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌ రివ,
శనై రావర్తమానస్తు కర్తుర్మూలాని కృంతతి." ౧౭౨

మను. ౪ అ.

అను నీవాక్యము లధర్మము వినాశకరమని బోధించునవి.

"అధర్మేణైధతే తావ త్తతో భద్రాణి పశ్యతి,
తతస్సపత్నాఙ్ జయతి సమూలస్తు వినశ్యతి." ౧౭౪

అను నీమనువాక్యము తత్కాలమున నధర్మమున వృద్ధిగలిగి నట్లు తోఁచిన నది తుదకు సమూలచ్ఛేదము చేయును గాన నిహపరములకు సుఖకరమగుమార్గము ననుసరింపవలయునని తెల్పునది.

"సత్యధర్మార్యవృత్తేషు శౌచే చైవారమే త్సదా,
శిష్యాంశ్చ శిష్యా ద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః. ౧౭౫
పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ,
ధర్మం చా ప్యసుఖోదర్కం లోకవిక్రుష్టమేవ చ." ౧౭౬

అను నీమనువాక్యాలు సత్యధర్మసదాచారశౌచములు సేవింపఁ దగినవి. ధర్మవిరుద్ధములకు నర్థకామములు వదలివేయఁ దగినవి. ఆధర్మముకూడ రాఁబోవు కాలమున దుఃఖకరమగుచో వదలవలసినదే. లోకదూష్యమైనను వదలవలయును. ధర్మముతోఁగూడిన యర్థకామములు గ్రహింపవలయును. ధర్మము నెద్దాని నాచరించిన రాఁగలకాలమున దుఃఖముగలుగునో యద్దాని నాచరింపరాదు. అనఁగా దుఃఖము గల్గించుధర్మము నాచరింపరాదు. అర్థకామములు ధర్మవిరహితములై సుఖమును గల్గించినను గ్రహింపరాదు. ధర్మమున కనుకూలములై సుఖకరములు నగు నర్థకామము లను గ్రహింపవలయునని సారము. ఈయర్థమంతయు రామాయణము తెల్పుచున్నది. కొలఁదిమాటలచేత ఎట్లు? ఇహచాముత్రచతేమం ధర్మార్థోపహితమ్ = అను వాక్యములచేత. స్మృతిసారము రామాయణ

మని తేలెడిని గదా. ఈవాక్యములసార మేది? రావణా! నీ ప్రతమును సుగ్రీవునకు న్యాయసమ్మతము నీకు నిహపరసుఖములను గల్పించునదియును నగు వాక్యజాలమును నామూలమునఁ జెప్పుచున్నాఁడు. దాని నాలకింపుమా యని. దీనింబట్టి హనుమంతునాశయ మెంత యుత్కృష్టమో కనుంగొనఁదగినది.

> “త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుంగవః,
> రాఘవేణ హతః స్సంఖ్యే శరేణైకేన వానరః.” ౧౧

అని మూలము. రావణునకు శ్రీరామునిమహత్త్వము తెలియదని హెచ్చరించుచున్నాఁడు. వాలి నీవెఱింగినవాఁడే కదా. అతఁడు నిన్నుఁ దన వాలమునఁ బట్టుకొని నాలుగుసముద్రముల ముంచినవాఁడని హెచ్చరిక. అట్టివానిని శ్రీరాముఁ డొక్క బాణమున వధించెను. దీనింబట్టి శ్రీరాముని పరాక్రమ మెట్టిదో తెలిసికొమ్ము. అని భయము గలిగించెను. వాలిగతి యట్లైనది గదా. ఇఁక నీగతి యేమగునో చూచుకొమ్మని బుద్ధిని జెప్పెనని సారము.

> “సీతాయాస్తు కృతే తూర్ణం శతయోజనమాయతం. ౧౪
> సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షు రిహాగతః,
> భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా.” ౧౫

అని మూలము. ఇది యాత్మస్తుతి గాదా యని కొందఱందురు. రావణునకు ధర్మము గఱపుటయే హనుమంతునాశయము. శ్రీరామునిబలము. తత్కింకరులశక్తియు నతఁ డెఱింగినఁగాని యించుక జంకఁడు. సముద్రము దాఁటరానిదని దానవులుమాత్రమే దాఁటఁగలరని రావణుఁ డెఱుంగు

ననియు నేను శతయోజనాయతమగు సాగరమును దాఁటి వచ్చితిననియు హనుమంతుఁడు తెలుపుట యాత్మస్తుతి యన రాదు. ఇంద్రాదులు పంపఁగా రాలేదనుదానిని మఱెంత దృఢ పఱచునని యాహనుమ యాశయము. నీగృహమున వెదకుచు సీతం గాంచితిని. అనఁగా నీయింటియందే సీత యున్నదని యర్థము చేయరాదు. నే నెఱుఁగకయుండ సీతఁ డెట్లు వెద కెను. అని విస్మయంపడి రావణుఁడు తనమాటలఁ జక్కఁగా నాలకించుననియే. తే గృహే భ్రమతామయాసా దృష్టా= అని యన్వయక్రమము. లంకయంతయుఁ దిరిగి తుదకు నీ గృహమునంతయు వెదకితిని. తరువాత సీతను జూడఁగల్గితి నని భావము. రావణాంతఃపురము చెంతనే యశోకవన మున్నది. కాని యది గృహారామ మనరాదు. సమీపమున నుండెనది యని యెంచు టుచితము.

తద్భవాన్ దృష్టధర్మార్థ స్తపఃకృతపరిగ్రహః,
పరదారాన్ మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వమర్హసి. ౧౭
న హి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు,
మూలఘాతిషు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః. ౧౮

అని మూలము. రావణా! నీవు పామరుఁడవు కావు. దృష్ట ధర్మార్థః = ధర్మార్థతత్త్వముల నెఱిఁగినవాఁడవని యర్థము. అనఁగా ధర్మము నర్థము నెట్లెట్లు వ్యవహారమున ననుసరింప వలయు ననువిషయమును జక్కఁగా నెఱిఁగినవాఁడవని తాత్పర్యము. తపఃకృతపరిగ్రహః = తపసా కృతశ్చాసౌ పరి గ్రహః అని సమాసము. తపస్సు నిన్నుఁ బరిగ్రహించెనని తాత్పర్యము. అనఁగాఁ దపస్సు చేయువారిలో నీయంత శ్రద్ధా

వంతుఁడు లేఁడని సారము. యోగ్యుఁడగువానిని లక్ష్మి తన యంతన యాశ్రయించుచునన్నట్లు నీకుఁగల శ్రద్ధనుగని తపస్సు నిన్నే వరించెనని భావసారము. మహాతపస్వివని దీనిహృదయము. మహాప్రాజ్ఞ=ప్రజ్ఞా త్రైకాల్యగోచరా=అన్నన్యాయము ననుసరించి త్రికాలజ్ఞానసంపన్నుఁడవని యర్థము. రాఁగల శ్రీరామమూలకశ్రమముల నాలోచింపుమా యని హెచ్చరిక. ఇట్టి నీవు పరదారాన్=పరునిపత్నిని, ఉపరోద్ధుం=అడ్డగించుటకు. అనఁగా చెఱఁ బెట్టుటకని భావము. నార్హసి= తగవు. అనఁగా నీవంటిమహాత్ముఁడు చేయఁదగిన పనికాదని తాత్పర్యము. ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు మూలఘాతిషు కర్మసు=ధర్మహితములు గానివి. అనఁగా ధర్మహితములు గాక యున్న నశింపఁజేయునట్టి వగును.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్." ౧౫

మను. ౮ అ.

అన్న మనుస్మృతివాక్యము ననుసరించి హనుమంతుఁడు పలికెనని తెలియందగును.

"వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదు ర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౬
ఏకఏవ సుహృద్ధర్మో నిధనే ప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." ౧౭

మను. ౮ అ.

అన్న మనువాక్కుల నాశ్రయించి మరణానంతరము వెంట వచ్చునది ధర్మమే కావున దానినివదలి యధర్మము నాచరింప

కుమా యని తెలియఁజేయుచున్నాఁడు. బహ్వపాయేషు=విశే షించి హానికరము లైనవి. మూలఘాతిషు=సమూలముగా ఛేదించునవి. అనఁగాఁ దనకుమాత్రమే గాక వంశమునుగూడ నశింపఁజేయునవి. పరులేమి చేయఁజాలకున్నను దుష్కర్మ ములు తమయంతన నశింపఁజేయుచుఁ దద్వంశమునుగూడ రూపుమాపునని భావము అట్టికార్యములయందు భవద్విధాః బుద్ధిమంతః = మీవంటి బుద్ధిమంతులు. అనఁగా

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః.
మనస్సంకల్పవికల్పాత్మకమ్ బుద్ధి ర్నిశ్చయాత్మికా."

అన్న గీతావాక్యముననుసరించి నిశ్చయాత్మికజ్ఞానముగల మీ వంటివా రిట్టియకార్యమును జేయరాదని భావము. నసజ్జం తే=ఉద్యోగింపరు. ప్రయత్నింపరని భావము. ధర్మహితము కాదు. అంతమాత్రమే గాక హానికరమైనది విశేషించి కుల క్షయకరమైనది. కావున నట్టికార్యము చేయకుమా యని బోధించునెపమున రావణుని హనుమంతుఁడు దండించెనని భావము.

"కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినాం,
శరాణా మగ్రత స్థాతుం శక్తో దేవాసురేష్వపి. ౧౯
న చాపి త్రిషు లోకేషు రాజ! న్విద్యేత కశ్చన,
రాఘవస్య వ్యళీకం యః కృత్వా సుఖమవాప్నుయాత్." ౨౦

అని మూలము. రావణునకు సిగ్గు దోఁపఁజేయఁబూనుచు శ్రీరామునిసర్వేశ్వరత్వమును వెల్లడించుచున్నాఁడు. రాముని కోపము స్వభావసిద్ధము కాదు. ఆతనికే కోపముకలిగి దాని

ననుసరించియే బాణములు వెడలినచో వానిని లక్ష్యముగా నేర్పరచిన బాణములను ముందు నిలువఁబడి యోర్వఁగలవాఁడు దేవాసురులలో నొక్కఁడును లేఁడు. ముందునిలువక పాఱి పోయినచో నందఱు నోర్వఁగలరు. అనఁగాఁ బాఱినవారి నవి యేమియుఁ జేయఁజాలవు. ఎదిరించిన హింసింపక వదలవు. ఇఁక నీశక్తి యెంత? అని లజ్జ కలిగించెను శ్రీరామునకు నప్రియమొనరించి సుఖముగాంచువాఁడు త్రిలోకములయం దొక్కఁడు నుండఁడు. భగవంతునియాగ్రహమునకుఁ బాత్రుఁ డగువానిని రక్షించువాఁ డుండఁడు గదా.

"దైవతా న్యభిగచ్ఛేత్తు ధార్మికాంశ్చ ద్విజోత్తమాన్,
ఈశ్వరం చైవ రక్షార్థం గురూనేవ చ పర్వసు. ౧౫౩
నాస్తిక్యం వేదనిందాం చ దేవతానాం చ కుత్సనం,
ద్వేషం దంభం చ మానం చ క్రోధం తైక్ష్ణ్యం చ వర్జయేత్." ౧౬౩

అను నీ మనువాక్యములననుసరించి భగవద్దూషణమే హాని కరమైనపు డట్టిపరమేశ్వరున కప్రియముచేయుట స్వనాశ హేతు వగుననియు నాభగవంతుని బరిశుద్ధుఁడై యారా ధింపవలయుననియుఁ దెలుపుచున్నాఁడని మన మెంచవల యును. ఈశ్వరసేవ రక్షించుననియుఁ దద్ద్వేషము నశింపఁ జేయుననియు భావము. ఎవరికైన నపకారముచేసిన బ్రదుక నైన వచ్చును. భగవదపకారము స్వనాశనహేతువగుట యీ భాగము మనకది సర్వథా చేయరాదని తెలుపుచున్నది. ఇట్లు స్మృతులు తెలుపుచుండఁగా నిఁక హిరణ్యాదాసులు దేవతల దూషించుచు నందొక్కని భూషించుచు ధనార్జనముచేసి బంధువులఁ బోషించిన నాదేవతాస్వము వారివంశముల నిర్మూ

లింపక వదలునా. ఇంతమాత్రము రామాయణమును బఠించి
యైన నెఱుంగనివారికంటెఁ బాపాత్ములు వేఱుగనుందురా.

"త్త్రికాలహితం వాక్యం ధర్మ్య మర్థానుబంధి చ,
మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్." ౨౧

అని మూలము. నాయీమాట త్రికాలహితము. శాస్త్రసిద్ధ
మని భావము. ధర్మ్యమ్=ధర్మానుకూలము, అర్థానుబంధిచ =
ప్రయోజనము ననుసరించునదియు నగు, అనఁగా నేకాలమున
మార్పునొందక విహితమైనది న్యాయసమ్మతమైనది ప్రయో
జనమును గల్గించునదియు నగుట నరదేవాయ=నరాకారమున
నుండు దైవముకొఱకని యర్థము. రాజుకొఱకని చెప్పిన
చప్పిడిగా నుండును. జానకీ=సీతాదేవి, ప్రతిదీయతామ్=మరల
నీయఁబడుఁ గాక. అనఁగా నీ వపహరించినది మాయాసీత.
యైనను లోకహితముపొంటె నెల్లరెఱుంగ సమర్పింపుమని
భావము. ఇది హనుమంతుఁ డెఱింగి చెప్పినది కాదు. దైవిక
ముగా దొరలినది. రావణునాశయ మెఱిఁగిన వాల్మీకిమహర్షి
సమయానుసారముగా నాతనినోటఁ బలికించెనని మన మూ
హింపవలయును.

"దృష్టా హీయం మయా దేవీ లబ్ధం యదిహ దుర్లభమ్,
ఉత్తరం కర్మ యచ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః." ౨౨

అని మూలము. సుగ్రీవప్రేషితులగు వానరులకెల్ల దుర్లభ
మగు సీతాసందర్శనము నాకు లభించినది. దీనితర్వాతఁ జేయఁ
దగిన కార్యశేష మనఁగా సీతానయనార్థము చేయఁదగిన
దంతయు శ్రీరామునిది. చూడఁదగినపని నాది. అదియైనది.

చేయఁదగినపని శ్రీరామునిది. సీవధాదులన్నియు శ్రీరాముని పనులని సారము. నిమిత్తమనఁగాఁ గారణము. సర్వకారణుఁడు భగవంతుఁడు. కనుక నెవరెవరిమూలమున నేయేపనులు చేయింపవలయునో యది చేయించుననుట సామాన్యము. రావణా! కాఁగల కర్మములన్నింటికిని రాఘవః=రాముఁడు, నిమిత్తమ్=నిమిత్తమాత్రమే. లోకులకు రాముఁడు రావణుం జంపెను. సీతను దెచ్చెనని తెలియుటకేకాని యన్నియు సీత యధీనములని సారము. ఈభావమునే యీక్రిందిశ్లోకములు తెలుపుచున్నవి.

"లక్షితేయం మయా సీతా తథా శోకపరాయణా,
గృహ్య యాం నాభిజానాసి పంచాస్యామివ పన్నగీమ్." ౨౩

అని మూలము. మహాశయులారా! చక్కఁగాఁ బరిశీలింపుఁడు. పరమేశ్వరుఁడు నిర్లిప్తుఁడు. ఆనందరూపుఁడు. తామరపాకు నీటిచందమున నెద్దానికిం దగులక యుండువాఁడు. సర్వకార్యములు చేయించునది మహాప్రకృతి. అనువిషయమును మహర్షిప్రవరుఁడు వాల్మీకి తెలుపుచున్నాఁడు. అశోకపరాయణా శోకపరాయణా=దుఃఖించుచున్నట్లు నటించుచున్న మహానందరూపిణి, సీతామయాలక్షితా=నాచేతఁ జూడఁబడినది. అనఁగా నెఱుంగఁబడినదని భావము. మూర్ఖుఁడా. రావణుఁడా. యాం గృహ్య పంచాస్యాం పన్నగీమివ నాభిజానాసి=ఏజానకిని దెచ్చియింట నుంచుకొంటివో ఆమె శ్రీరామునిపత్నిగా భావించితివి గాని యైదుతలలుగల యాఁడుఁబామని యెఱుంగవైతివే. నీకంటె మూఢుఁడుకలఁడా యని యాశయము ఇది సామాన్యాశయము. విశేష మేదనఁగా పంచాస్యామ్=పెద్దనోరుగల,

పన్నగీమివ=భుజంగనారివలె, అనఁగా ఆధారచక్రమునందున్న భగవతి భుజంగాకార మూని నిద్రించున ట్లుండును. దానిని లేవఁగొట్టుట యనఁగా నెందులకో వేఱుఁగాఁ జెప్ప నక్కఱ లేదు అనుమాట నెఱుంగఁజాలకున్నావే. అని. నిన్నుఁ జంపు దానినిగా నెఱుఁగకయున్నావే అనునది సామాన్యార్థము. నీయింట నిన్నుద్ధరింపవచ్చినదానిని నీ కుపాస్యదేవతాగా భావింపఁజాలకున్నావే యని రహస్యము. ఈ యాకాశ రామన్న పంచాంగమునకుఁ బ్రమాణమేమని యడుగుదు రేమో. ఇదియే పరమార్థమని యెఱుంగందగు. లేకున్న రామాయణకథయం దేమిసార మున్నది. మహాత్ము లిద్దాని సర్వదా పఠింప నేల? ఇట్టియర్థము లుండుటంబట్టియే యని యెఱుంగుఁడు.

"భుజంగాకారరూపేణ మూలాధారసమాశ్రితా,
శక్తిః కుండలినీ నామ బిసతంతునిభాఽశుభా.

(అశుభా క్షణప్రభా విద్యున్నిభేత్యర్థః)

మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్,
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా.
పద్మాసనగత స్స్వస్థో గుద మాకుంచ్య సాధకః,
వాయుమార్ధ్వగతం కుర్వన్ కుంభకావిష్టమానసః.
వాయ్వాఘాతవశా దగ్ని స్స్వాధిష్ఠానగతో జ్వలన్,
జ్వలనాఘాతపవనాఘాతై రున్నిద్రితో ఽహిరాట్.
రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్యథ,
బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్.

సహస్రకమలే శక్తిశ్శివేన సహ మోదతే,
సాదావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతికారణమ్."

అని వామకేశ్వరతంత్రము.

ఇది యోగశాస్త్రముననుసరించిన మానసికార్చనాపద్ధతియని తెలియందగు. నీయిల్లుచేరిన మహాప్రకృతి నాధారచక్రరూపిణిగా నుండు భుజగాకారిణిగా నెఱుంగుమనఁగా నుపాసింపుము ధ్యానింపుమని తాత్పర్యము. ఆమె నుపాసించినఁగాని భగవంతు నెఱుంగ తెఱంగు లభింపదని సారము. బాహ్యపూజ చేయువారల కిది తొలిసోపానమని తెలియవలయు. శ్రీశంకరభగవత్పాదులుగా రీవిషయము నే

"సుధాధారాసారై శ్చరణయుగళాంతర్విగళితైః,
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం,
స్వమాత్మానం కృత్వా స్వపిషి కుళకుండే కుహారిణి."

అను శ్లోకముమూలమునఁ దెలిపిరి. ఈవిషయమునే హనుమదుపదేశమూలమున మహర్షి వాల్మీకి మనకు బోధించెను. అత్యల్పఫలప్రదమగు విగ్రహార్చనను మాని మానసికార్చనాసక్తులము గావలయునని మన మీభాగమునుండి నేర్చుకొనవలయును.

"నేయం జరయితుం శక్యా సాసురై రమరై రపి,
విషసంస్పృష్ట మత్యర్థం భుక్త మన్నమివౌజసా. ౨౮
తపస్సంతాపలబ్ధ స్తే యోఽయం ధర్మపరిగ్రహః,
న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణపరిగ్రహః." ౨౯

అని మూలము. ఈశ్లోకార్థము పైనవ్రాసిన విశేషార్థమునకు విరుద్ధము కాదా యందురేమో కాదని తెలియుఁడు. వినుఁడు. విషాన్నము నెంతయాఁకలియున్నను జీర్ణింపఁజేసికొని ఫలను పడనిచందమున దేవాసురులచేతనుంగూడ నీసీతాదేవి వశము చేసికొన శక్యముకాదని కదా దీని యర్థము. ఇది పైవిశే షార్థమునకే మిక్కిలి యనుకూలము.

"నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప." ౫౪

అన్న గీతావాక్యముల నిట సంస్మరింపుఁడు. విషయ మవగత మగును. దేవతలమని యసురులమని మే మందఱికన్న నధికుల మని గర్వించువారల కాదేవి వశము కాదు. జననీ! నీకన్న నితరము నెఱుఁగము. మమ్ము రక్షించు భగవత్తత్త్వము నెఱిఁ గింపుమా యనువారలకే సాధ్యము. అనఁగా వారిమనఃపంకజ మధ్యవర్తినిగా నుండును. విషామృతముల నొక్కరీతిగా నెఱుంగువారలకు రెండు నమృతములే యగునుగదా. అట్లే

"త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ. ౪

అను శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యోక్తి ననుసరించి యన న్యగతికులై యాశ్రయించువారలకే సీతాదేవిరూపమునఁ

గనఁబడు మహాప్రకృతి భగవదిచ్ఛాశక్తి వశ్యురాలగునని సారము. రావణా! తపస్సు శ్రమంపడి చేసితివి. దానికిఫలముగా ముక్తినొందఁ బ్రయత్నింపక దీర్ఘాయుస్సు మొదలగు నైహికసుఖహేతువు లగుఫలముల నొందితివి. కాని వానిని గూడ వలయునని పాడుచేసికొనుట మంచిపని గాదు. అనఁగా శ్రమంపడి తపస్సుచేసి దానికి నైహికఫలముల నొందుటయే యవివేకమనవచ్చును. వలయునని వానినిగూడఁ బోఁగొట్టుకొనుట యంతకంటె నవివేకమని భావము. దీనిసార మేమి? తపఃఫలము భగవదనుగ్రహము. అదిగలిగినపు డైహికసుఖములఁ గోరరాదు. అవి తమయంతన లభించును. ఇష్టదైవము నడుగవలసినవర మనుగ్రహమే చాలునని. దాన నాదేవత తృప్తినొంది కర్మానుసారముగా నతఁ డనుభవింపఁదగినఫలముల నడుగకున్న నిచ్చును. ఈపాటిపరిజ్ఞానములేక వరములు గాఁ దుచ్ఛఫలములఁ గోరరాదనువిషయ మీభాగమునుండి సారముగా గ్రహింపవలయు.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అను భగవద్వాక్యము సర్వదా స్మరింపఁదగినది. దానఁ గలుగుఫలమేదియో స్పష్టమగును.

"అవధ్యతాం తపోభి ర్యాం భవాన్ సమనుపశ్యతి,
ఆత్మనస్సాసురైర్దేవై ర్హేతు స్తత్రాప్యయం మహాన్. ౨౯
సుగ్రీవో న హి దేవోఽయం నాసురో న చ రాక్షసః,
న దానవో న గంధర్వో న యక్షో న చ పన్నగః. ౨౭
తస్మాత్ప్రాణపరిత్రాణం కథం రాజన్ కరిష్యసి,"

అని మూలము. రావణా! తపఃఫలముగా నవధ్యత్వము లభించెనని గర్వింతువేమో యది పొరపాటు. నీకుఁ దెలిసిన దేవాదులపేరు లుచ్చరించి వీరివలన మృతిలేకుండ వర మడిగితివే. ఎవరిమూలమున మరణము లేకుండ వరమిచ్చెనో బ్రహ్మ యంతటిమాహాత్మ్యము గలవాఁడు క్రొత్తభూతముల సృజింపఁజాలఁడా? అంతటిశ్రమముకూడ నక్కఱలేక యున్నది. నీవే నీచావునకుఁ గారణమును గల్పించుకొంటివి. ఆకారణము సుగ్రీవుఁడే. ఆతఁడు నీవడిగిన దేవాదులజాతికిఁ జేరినవాఁడు కాఁడే. అతనివలనఁ గలుగఁబోవు మృతినెట్లు తప్పించుకొందువు? అని ప్రశ్నించెను మృతిలేనిప్రాణియే యుండ రాదు. అట్టిజ్ఞానములేకయే వర మవధ్యత్వ మడుగుదురు. వర మిచ్చువానికే యొకప్పుడు మృతియుండఁగా నతఁడెట్లు చావు లేకుండ వరమిచ్చును? భగవంతుఁ డట్టివరము నొందినను గ్రొత్తసృష్టి యొనరింపఁ జాలఁడా? ఈవిషయమున మహాకవి కాళిదాసు —

"అథవా మృదువస్తు హింసితుం మృదునైవారభతే ప్రజాంతకః,
హిమసేకవిపత్తి రత్ర మే నళినీపూర్వనిదర్శనం మతా,
కుసుమా న్యపి గాత్రసంగమా త్ప్రభవం త్యాయురపోహితుం యది,
న భవిష్యతి హంత సాధనం కిమి వాన్య త్ప్రహరిష్యతో విధేః.
స్రగియం యది జీవితాపహా హృదయే కిం నిహితా న హంతి మాం,
విష మప్యమృతం క్వచిద్భవేదమృతం వా విష మీశ్వరేచ్ఛయా."

అని తేటపఱచెను. భగవంతుఁడు సంకల్పించిన నేదియైన సాధ్య మగును. కావున భగవంతుని వంచించి వరములఁ గొనఁబూనుటయే యజ్ఞానము. కావున భక్తుఁడు వరమడుగునపుడు పాద

దాస్య మడిగిన నన్నియు నడిగినట్లే. పూర్వకర్మానురూపముగా లభించు సుఖదుఃఖముల లభింపఁజేసి దుఃఖఫలములను దగ్గించును. అట్లు చేయక కొండటిమూలమున మృతిలేకుండ వర మడిగితివి కదా. వారిలో సుగ్రీవుఁడు కలఁడా దీనినెట్లు తప్పించుకొనఁ గలవు ? కాన నాగర్వమువదలి ధర్మమార్గమున వర్తింపుమా యని హనుమంతుఁ డుపదేశించెనని యెఱుంగ వలయును.

"న తు ధర్మోపసంహార మధర్మ ఫలసంహితం. ౨౭
తదేవ ఫల మన్వేతి ధర్మశ్చా ధర్మనాశనః,
ప్రాప్తం ధర్మఫలం తావ ద్భవతా నాత్ర సంశయః. ౨౮
ఫల మస్యా ప్యధర్మస్య క్షిప్ర మేవ ప్రపత్స్యసే."

అని మూలము. రావణా ! చేసినపాపములకు ఫలములు తప్పవు గదా. ఎందుల కీయుపదేశ మందువేమో. వినుము. ధర్మఫల మధర్మఫలములతో సంబంధము కలిగియుండదు. అది ధర్మఫలమునే వెంబడించును. అపక్షమునఁ జేసినదాని ననుభవింపకుండు టెట్లని ప్రశ్నింతువేమో. ధర్మ మన్నింటి కంటె గొప్పది. కాన నధర్మమునుగూడ నశింపఁజేయఁ గలదు. అధర్మముకూడ ధర్మమును నశింపఁజేయఁగలదా యని యడుగుదువేమో అది యబద్ధము. అధర్మము ధర్మము నెప్పుడుగాని నశింపఁజేయఁజాలదు. ఏల? వృషోహి భగవాన్ ధర్మః=అన్న మనుస్మృతివాక్య మనుసరించి ధర్మము భగవత్స్వరూపమే. దాని నశింపఁజేయఁగల దెద్దియులేదు. కనుక ధర్మమునే యనుష్ఠించిన నధర్మము తగ్గును. దాన మేలు చేకూరును. రాజా ! తొలుత నేను ధర్మమును జేసితిని గదా. అది దీనిని బోఁగొ

ట్టును గదా. మరల నేలచేయవలయునని యడుగుదువేమో. వినుము మొదటి నీధర్మ ఫలమంతయు ననుభవమున ముగిసి నది. సంశయమే లేదు. ఇపుడు నీవు చేసిన సీతాపహరణరూప మగు మహాపాపమును బోఁగొట్టఁగలధర్మము నీయం దిపుడు మిగిలియున్నట్లే లేదు. కాన నధర్మ ఫలమును వేగముగా ననుభవింపఁ గలవు. ధర్మము చేయకున్న నటుండుఁగాక. ప్రాప్తించిన యనర్థమునైనఁ బరికింపుము. అని తెలిపెను. ఇచ్చోటఁ గల విషయసార మేది?

"అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. ౩౬
యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. ౩౭
న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి." ౩౮

గీత, ౪ అ.

అను నీగీతావాక్యముల సారము నరసినఁ దేలువిషయ మిదియే. ప్రమాదమున నధర్మ మొనరించి పశ్చాత్తాపముం గాంచి ధర్మాసక్తి మది మెండుకొనఁగా నిఁక నధర్మ మాచరింపనని నిశ్చయించుకొన్నచోఁ బ్రాక్తనాధర్మము స్వల్పదుఃఖముల నొసంగి నశించును. దినదినాభివృద్ధినొందు ధర్మకాంక్ష జ్ఞానసంపద నొదవించును. అది మరల సధర్మాచరణకాంక్షఁ బుట్టకుండఁ జేయును. ఇది యధర్మనాశనమార్గము రావణుఁ డొనరించిన తపః ప్రభృతిధర్మములు సకలశుభఫలముల నొసంగినవి. సీతాపహరణమను నధర్మము భగవదాశ్రయణరూపధర్మము చేత

నశింపవలయును. దాని నొనరింపుమని హనుమ యుపదేశించెను. పాపాపనోదనక్షమము జ్ఞానమున భగవంతు నారాధించుటే యని మన మెఱుంగవలయును.

"యామ్ సీతే త్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే. 34
కాళరాత్రీతి తాం విద్ధి సర్వలంకావినాశినీం,
తదలం కాలపాశేన సీతావిగ్రహరూపిణా. 35
స్వయం స్కంధావసక్తేన క్షమమాత్మని చింత్యతాం,
సీతాయా స్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితాం. 36
దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రతోళికాం,"

అని మూలము. ఏవ్యక్తిని సీతయని తలఁచుచున్నావో యిపుడు నీవశమున నేదియున్నదో ఆవ్యక్తిని సర్వలంకావినాశనార్థము దెంచిన కాళరాత్రినిగా నెఱుంగుము. సీత కాదు. కాళరాత్రి యనఁగా దుర్గాదేవి యవతారవిశేషము.

"సా దుర్గా శక్తిభి స్సార్ధం కాశీం రక్షతి సర్వతః,
తాః ప్రయత్నేన సంపూజ్యాః కాళరాత్రిముఖా నరైః.
కాశీఖండము.

దుర్గావతారము శత్రుసంహారార్థము. నీయింట నీవశమున నున్నవ్యక్తి సమయమును గాంచి నిన్ను రాక్షసులను జంప వేచియుండు సంహారకారిణి యగుశక్తినిగా నెఱుంగుమని భావము. కావున సీతారూపమునసున్న యమపాశమును గోరకుమా యని తాత్పర్యము. కొన్నిగ్రహములు కర్మప్రేరితములై దేవతలుగాఁ గొన్నియిండ్లం జేరియుండును. వానిని దేవతలని ప్రీతితోఁ గొల్చుచుందురు. క్రమముగా వంశనాశ

మొనరించి తమంతన వెడలిపోవును. అనునది లోకానుభవ సిద్ధమే. కావునఁ బాపఫలాగమనము సుఖరూపమునఁ గనఁబడుచుండును. కాన దానిని బ్రమాదముననైనఁ జేయరాదు. రావణా! ఆకాలపాశమును మెడకుఁ దగిలించుకొంటివే. దానిని వదలించుకొనుటెట్లని యాలోచింపుము. సీతా తేజస్సుచే నీ లంకయంతయుఁ గాల్పఁబడినది. శ్రీరామకోపముచేఁ బీడింపఁబడినది. ఇపుడు దహింపఁబడుచున్నది. చూడుము. ఇందలి మహాకవి పద ప్రయోగముల నరయుఁడు.'రామకోప ప్రపీడితాం సీతా తేజసాదగ్ధామ్' అనికదా మహర్షి పదవిన్యాసము కనుపట్టుచున్నది. భగవంతుఁడు సంకల్పించును. భగవతి కార్య మొనరించును. అని కదా వ్రాయుచుండుసిద్ధాంతము. సంకల్ప మాత్రము భగవదధీనము. తక్కిన కార్యమంతయుఁ బ్రకృత్యధీనము. ప్రకృతిబద్ధుఁడు కానిచోఁ బరమేశ్వరుఁడు కార్యక్షముఁడు కాఁజాలఁడనుసిద్ధాంతము వాల్మీకిమహర్షి సమ్మతమనవలయును గదా. లంక కాలుచున్నదా యని యడుగుదురేమో.

"మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అను గీతావాక్యమునుబట్టి భీష్మాదులు నాచేత మున్నే చంపఁబడిరనుచో వారు మరల నెట్లు వచ్చిరని ప్రశ్నముచేయు టెట్టిదో యిదియు నట్టిది. అనఁగా ఇది యిట్లు కావలయునని భగవతి సంకల్పించును. దాన దానిసంపద తూలును. లౌకిక దృష్టాంతమున నొకకారణము నామమాత్ర మేర్పడును. పని యైనట్లు కనఁబడును. అని యెఱుంగవలయును. లోకులకు

విజ్ఞానము కలుగుటకై యొక కార్య మొకనిమ్నాలమున సాగి నట్లు కనఁబడఁ జేయునదియే కర్మమని తెలిసికొనుట క్షేమము.

"బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా
రుద్ర స్త్రిణేత్ర స్త్రిపురాంతకో వా,
ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా
త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్." ౪౫

అని మూలము. ఇందలిసారమే గ్రహింతము. ఇంద్రుఁడుగాని బ్రహ్మగాని శంకరుఁడుగాని రామునిచేఁ జంపఁదగినవానిని గాపాడఁజాలరు. అని నీపక్షమునఁ బ్రహ్మ శంకరుఁడు నింద్రుఁడు కూడ నున్నను రామునియాగ్రహమునకుఁ బాత్రుఁడవే యైన నిన్ను వారును రక్షింపఁజాలరని తాత్పర్యము. ఎవరిచే నెవఁడు చావఁదగియుండునో వాని నెవ్వఁడును గాపాడలేఁడని భావము. భయోత్పాదనార్థము కొన్ని పేరులఁ జేర్కొనెను. దీనిచే విష్ణువుచేతనే నీకు మృతియని హనుమంతుఁడు చెప్పక యున్నను తేలెడిని.

"అతోఽహ మాత్యంతిక మోక్షసాధనం
వక్ష్యే శృణు ష్వావహితో మహామతే
విష్ణోర్హి భక్తి స్సువిశోధనం ధియ
స్తతో భవేత్ జ్ఞాన మతీవ నిర్మలం
విశుద్ధతత్త్వానుభవో భవే త్తత
స్సమ్య గ్విదిత్వా పరమంపదం వ్రజేత్
అతో భజ స్వాద్య హరిం రమాపతిం
రామం పురాణం ప్రకృతేః పరంవిభుం

విసృజ్య మౌర్ఖ్యం హృది శత్రుభావనాం
భజస్వ రామం శరణాగతప్రియం
సీతాం పురస్కృత్య స పుత్త్రబాంధవో
రామం నమస్కృత్య విముచ్యసే భయాత్
రామం పరాత్మాన మభాజయన్ జనో
భక్త్యా హృదిస్థం సుఖరూప మద్వయం
కథం పరం తీర మవాప్నుయా జ్జనో
భవాంబుధే ర్దుఃఖతరంగమాలినః
నో చే త్త్వ మజ్ఞానమయేన వహ్నినా
జ్వలంత మాత్మాన మరక్షితారివత్
నయ స్యధోధ స్స్వకృతైశ్చ పాతకై
ర్విమోక్షశంకా న చ తే భవిష్యతి.''

సుం. ౪ సర్గము.

అని కలదు. హితము జ్ఞానగమ్యముగాని రాజధర్మానుసారిగాఁ గాదు. కావున దీనిని జర్చింప నక్కఱలేదు. తరువాతికథను బఠింతము.

## విభీషణుఁడు రావణునకు దూతవధ్యుఁడు కాఁడని తెల్పుట

* అట్లు లక్ష్మహాత్ముఁడు పావని తెలిపిన పలుకులు విని రావణుఁ డాగ్రహంబున దేహము తెలియక యక్కపివరు వధింప నాజ్ఞాపించెను. అట్లా దురాత్ముఁ డన్యాయ్యంబుగ నాజ్ఞ చేయు టెఱింగి యాదూత తనకుఁ జెప్పినపలుకులే తెలిపి

* ఇది యేఁబదిరెండవసర్గమునఁ గల కథ.

నాఁడు గాని తాఁ గల్పించి చెప్పలేదని యెంచి వధదండనము నకు సమ్మతింపక మంచిచెడుగులు వివేచించి కార్యమునిశ్చయించువాఁడు గాన నారావణుఁడు కోపము నొందియుండుటయు దూత కట్లు వధము ప్రాప్తించుటయుఁ దెలిసి యిఁకఁ జేయఁ దగినదేమని యాలోచించెను. అంత నతఁ డిదికార్యమని నిశ్చయించుకొని సగౌరవముగా శత్రువును జయింపఁదలంచు భ్రాతను జూచి వాగ్విశారదుఁడు గావున నత్యంతహితవచనముల నిట్లనియె.

రాజేంద్రా! మన్నింపుము. క్రోధము వదలి ప్రసన్నుఁడవు కమ్ము. నామాటల నాలింపుము. హితాహితముల నెఱింగిన రాడ్వర్యులు దూతను వధింపరు. ఈకపిం జంప నాజ్ఞ చేయుట రాజధర్మమునకు విరుద్ధము. లోకాచారమునకు విపరీతము. నీబోఁటిమహాత్మున కిది యుకార్యము. ప్రాణికోటియందెల్ల ధర్మజ్ఞుఁడవు నీవే కదా. పరమార్థవేత్తవు. నీబోఁటి విద్వాంసులుకూడఁ గోపవశ్యు లగుదురేని సకలశాస్త్రజ్ఞానమంతయు వ్యర్థము కదా. రాక్షసేంద్రుఁడవు. శత్రుసూదనుఁడవు. అప్రధృష్యుఁడవు. నాచెప్పిన హేతువులంబట్టి కోపము మాని ప్రసన్నుఁడవు గమ్ము. యుక్తాయుక్తముల నరసి దూత కర్హదండము విధింపుము. అనఁగా నమ్మాటలకు మహాగ్రహము వైకొనఁగా నతని కిట్లనియె. అరిసూదనా! పాపమతులవధింపనించుకంతయుఁ బాపము కలుగదు. కానఁ బాపచరుఁడగు నీకపిని వధించెదను. అని బదులిచ్చెను. బుద్ధిమదగ్రగణ్యుఁడగు నావిభీషణుఁడు రావణుఁ డత్యంతకోపంబున నధర్మహేతువు గను, అపూజ్యులకే యర్హమగునట్లును, వచించిన యమ్మాట

లాలకించి పరమార్థయుతముగాఁ గార్యమును విన్నవించు వాఁడై మహారాజా! నిర్మలమనస్కుఁడవు కమ్ము. ధర్మాధర్మముల విమర్శించి పలికెద. ఆలకింపుము. ఏకాలమునందుః నెచ్చోటను దూత లవధ్యులు. అని యార్యులు వచింతురు. వీఁడు దూత కాఁడు. శత్రువే యందువేమో. ఈతఁడ కుమారుఁడు లోనగువారిం బొలియించి కొలఁది యిడరానియప్రియము గావించినవాఁడు గాన దూతమాత్రమే కాక విశేషించి వైరియు నగును. నిస్సంశయమే. ఏది యెట్లున్నను పెద్దలు దూత వధ్యుఁడే కాఁడందురు. క్రూరులగు దూతలకు ననేక రూపము లగుదండములు విధింపఁబడినవి. కశాఘాతము, అంగ వికారము, ముండనము, ముద్ర వేయుట యనునవి దూత దండములని పెద్దలే పలికిరి. కాని వధదండ మెంతమాత్రము తగదు. మన మింతదనుక నెందును విన్నదియు లేదు. ధర్మాధర్మవేత్తయగు నీవంటివాఁ డెట్లు కోపమునకు లోఁబడును? వ్యవసాయపరు లాగ్రహము నడంగఁద్రొక్కుదురు గదా. ధర్మశాస్త్ర, లౌకికాచారము, శాస్త్రచర్చ లనువానిం దెలిసి వానిని మఱువకయుండుట యందు నీకు సాటియెవ్వఁడును లేఁడు. దేవాసురులలో నుత్తముఁడవు నీవే కదా. ఈకపి వధము శాస్త్రవిరహితమనుటయే గాక గుణముకూడ లేదు. వీనినెవ రిచటికిం బంపిరో వారివిషయమున దండప్రయోగము గావింపుము. మంచివాఁడుగాని, కృత్రిముఁడుగాని యెవఁడైన నేమి? పరులుపంపఁగా వచ్చినవాఁడు. పరాధీనుఁడు గాన వారు చెప్పుమన్న దానిం జెప్పినవాఁడు. ఇది యితనితప్పుగాదు. కనుకనే వీఁడు వధార్హుఁడు కాఁడు. మఱొక్కవిన్నపము నాల

కింపుము. వీనిం జంపినతరువాత సాగరము నుత్తరించి మన పట్టణమునకు రాఁదగినవీరుఁడు వేఱొక్కఁడు నాకుఁ గాన రాఁడు. నీవో పరపురంజయుఁడవు. ఇట్లు వేఱొకఁడు కనఁ బడనికతన నీవు వీనిజంపుటకై ప్రయత్నింపరాదు. ఇంద్రుని గూడి దేవతలెత్తివచ్చిరేని వారల నిట్లుచంప యత్నముచేయఁ దగుదువు గాని దూతయగు నొక కపివిషయమున నిట్టిప్రయత్నము తగదు. యుద్ధప్రియుఁడవు కదా. వీనిం జంపుదువేని తరువాత బహుదూరమున గర్వితులై యిచ్చటికి రాలేక యుండు రామలక్ష్మణులఁ దోడ్కొని యిచటికి వచ్చి నీతో యుద్ధమునకుఁ బూన్పఁజాలు దూత మఱియొకఁ డుండునని నాకుఁ దోఁపకున్నయది. రాక్షసానందకరా! పరాక్రమాదుల యం దసమానుఁడ వగునిన్ను జయింపఁ దరంబుగాదు. ఇట్టి నీవు సమాసన్నముగా యుద్ధముండఁగా దానిని బోఁగొట్టు కొనుట మంచిది గాదు. మహావీరులు నీయధీనమునఁ గోటులుగా దానవు లున్నారు. వారు నీయానతిం గొని కొంతసైన్యమును దీసికొనిపోయి మూఢులగు నారాజకుమారులను నిగ్రహించి శత్రువులకు నీప్రభావమును జూపుటకై పోవుదురు గాక! అని విభీషణుఁడు పలికి యూరకుండఁగా నారాక్షసేంద్రుఁడు సోదరుఁడు తనమది కింపుఁ బెంపఁ బలికినపలుకుల నాలకించి యది యుత్తమవచనమని భావించి చక్కఁగా నాలోచించి దాని నంగీకరించెను.

మహామతులారా! యిందుఁ గలవిశేషముల నరయుదము

"ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మ విశారదః,
పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్. 2

అని మూలము. రాజధర్మము లితరులకుఁ బనికిరావు. కనుక నే యితరులధర్మములను రాజధర్మములనుకూడ నెఱింగినవాఁడ వని విభీషణుఁడు పలికెను. ఇది స్తుతియా. సత్యమా యను సందేహము కలుగకపోదు. విభీషణుఁడు మహాప్రాజ్ఞుఁ డందురు. బ్రహ్మాయు వరదానకాలమున ధర్మనిరతి యుండ ననుగ్రహించెను. సకల ధర్మవేత్త. మహాభక్తుఁడు అట్టివాఁడు సగౌరవముగా మాటలాడెనన్న ననవచ్చుం గాని ముఖస్తుతు లొనరించెనన్న నౌనన రాదు. ఇందు రావణునిపాండిత్యము ధర్మశాస్త్రజ్ఞత, కృతజ్ఞత, ధర్మాధర్మనిర్ణయజ్ఞానము కలదని తేలెడిని. ఇట్టివాఁడు భక్తుఁడనియు సీతాపహరణము కామముచేతఁ గాక శరీరత్యాగమునిమిత్తమే యనియు వ్రాసిన నావ్రాఁతలు న్యాయ్యము లనియే తేలునుగదా.

> "గృహ్యతే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః,
> తత శ్శాస్త్రవిపశ్చిత్వం శ్రమఏవ హి కేవలమ్. రా

అని మూలము. విద్వాంసుఁడు కోపమున నొడలెఱుంగక యొకదుష్కార్య మొనరించునేని శాస్త్రవేతృత్వము వ్యర్థమే యగు. అనఁగా శాస్త్రపఠనమున జ్ఞాన ముదయింపఁగా సంశయములఁ ద్రోలఁగించుకొని శాంతము నొందవలసినది విధి. అట్లుగాక పామరులంబోలి క్రోధవశంగతుఁడైన నాశాస్త్రపరిశ్రమము వ్యర్థమే యని తేటపడినది.

> "తస్మాద జ్ఞానసంభూతం హృత్థ్సం జ్ఞానాసి నాత్మనః,
> ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత."

అన్న గీతావాక్యము సంస్మర్తవ్యము.

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధ స్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్.
ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాం గతిం.
యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అను గీతావాక్యములను బరిశీలింపఁగా శాస్త్రమును మీఱ రాదని తేలెడిని. శాస్త్రజ్ఞానఫలము స్వనాశనహేతువులగు కామక్రోధలోభములను వదలుటయే కదా. శాస్త్రములు చదివి పాండిత్యము సంపాదించియు స్వనాశనహేతువులని యెఱింగియు నావానిని వదలఁజాలక వానికిలోఁబడిన నాశాస్త్రపాఠము శ్రమమాత్రఫలము గలదె యగును గదా యని విభీషణోక్తి మనకుఁ దెలుపుచున్నది. కనుక శాస్త్రపాండిత్యము స్వానుభవమునకు రానిచో నతఁడందులకుఁ జేసిన పరిశ్రమము కేవలము వ్యర్థమే యని సారము గ్రహింపందగు.

"న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన,
తస్మాదేనం వధిష్యామి వానరం పాపచారిణం."

అని మూలము.

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి."

అన్న మనువాక్యము ననుసరించి పాపాత్ముల వధించుటం జేసి పాప మొదవదు. రాజద్రోహియగు నీవానరు నాకారణమున

వధింతును అనియెఁ గదా. ఇది రాజధర్మము. ఇతరుల కీధర్మము వర్తింపదు. ప్రజాపరిపాలనపటువు లగురాజులకు ధర్మములు వేఱుగాఁ బ్రతిపాదింపఁబడినవని యెఱుంగవలయును.

"కథం చ ధర్మార్థ వినీతబుద్ధిః
పరావరప్రత్యయనిశ్చితార్థః,
భవద్విధః కోపవశే హి తిష్ఠే
త్కోపం నియచ్ఛంతి హి సత్త్వవంతః." ౧౬

అని మూలము. పరావరప్రత్యయ నిశ్చితార్థః = పరావర = ఉత్కృష్టాపకృష్టవిషయకమగు, ప్రత్యయ=జ్ఞానము చేత, నిశ్చితార్థః=నిశ్చయింపఁబడిన జ్ఞానముకలవాఁడు=ధర్మార్థవినీతబుద్ధిః, భవాదృశః=ధర్మార్థశిక్షితబుద్ధిగల నీవంటివాఁడు కోపవశేకథం తిష్ఠేత్=కోపమున కెట్లు లోఁబడును? ఎవఁడు జ్ఞానవిరోధమగు కోపమునకు లోఁబడునో వాఁడు జ్ఞానశూన్యుఁడని యర్థము. శాస్త్రజన్యజ్ఞానము పొట్టపోసికొనుటకై యుపయోగించును. కాని యది సమగ్రజ్ఞానము కాదు. ఎవఁడు కోపమునకు లోఁబడఁడో యతఁడే జ్ఞాని యని భావము. దుర్వాసమహర్షి కోపి కదా యతఁడు జ్ఞానవంతుఁడు కాఁడా యని ప్రశ్నింతురేని వినుఁడు. అట్టివారికోపము కల్పితము. దాని మూలమున నొకయుపకారము కలుగును కోపికిఁ దపస్సు ఫలింపదు. అది ఫలింపకయున్న శాపానుగ్రహశక్తి కలుగదు. అది కలిగినపుడు కోపవశంవదుఁ డతఁడు కాఁడు. కోపమున్నట్లు వారిచర్యలే తెలుపును గదా యందురేని దాన నొకలాభము లోకమునకుఁ గలుగును. నారదుని కలహప్రియత్వము దుర్వా

సునికోపమునను నీరెండును లోకోపకారమునకై యేర్పడిన వని భావింపవలయును. వారిమనస్సులు నిర్మలములు. వారి తలంపులు లోకోపకారకములు. కావున వారికవి కలవనుట యసంగతమే కాని సుసంగతము కాదు. సత్త్వవంతః కోపం నియచ్ఛంతి హి=సత్త్వమనఁగా యథార్థజ్ఞానము. అనఁగా నేది నిశ్చయమో యద్దాని నెఱుంగుట. బ్రహ్మసత్యము జగన్మిథ్య యనువిధము నెఱింగినవారు. కోపం నియచ్ఛంతి హి=కోపము నిగ్రహింతురు కదా. సత్త్వగుణము గలవాఁడనఁగా కోప మును జయించినవాఁడని యర్థము. కపటనాటకసూత్రధారులు కొందఱు యోగివేషధారులై భగవద్దాసులమని పేరుపెట్టు కొని శిష్యవంచకులై ధనార్జనముచేసి ధర్మదంభమున నాశ లేనట్లు నటించి బంధువులఁ బోషింతురు. అట్టివారు సాత్వికులని పామరులచేఁ బిలువంబడుదురు. కాని వారు తుదకు దుర్గతిపా లగుదురనుట నిస్సంశయసిద్ధాంతము. కోపమును జయించిన వారే జ్ఞానవంతులని విభీషణుని వాక్యసారమని మన మెఱుంగవలయును.

"న ధర్మవాదే నచ లోకవృత్తేః
న శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి,
విద్యేత కశ్చి త్తవ వీర్యతుల్య
స్త్వం హ్యుత్తమ స్సర్వసురాసురాణాం." ౧౭

అని మూలము. విభీషణునినోట మహర్షి వాల్మీకి యీమా టలు చెప్పించెను. ఇంద్రజిత్ప్రముఖులనోటఁ బలికించియున్న నది మిథ్యాస్తుతి యనవచ్చును. విభీషణప్రహ్లాదాదు లుత్తమ భక్తులు. వారిపల్కులయందు మిథ్యాస్తుతి కలదనుటకంటె

మహాపాపకార్యము వేఱొకటి కానరాదు. సురాసురాదుల యందు సకలసద్విషయముల రావణాసురుఁ డుత్తమోత్త ముఁడు. అట్టివాఁడు కాముకుఁడై జానకిని గొనివచ్చెనని నిందించుటకంటెఁ బాపకార్యము వేఱొకటి కానరాదు గదా. కావునఁ బాఠకమహాశయులారా! రావణుఁడు భక్తాగ్ర గణ్యుఁడని శ్రీరామునిచేఁ జావఁగోరి మాతృబుద్ధిచే సీత నపహరించి తెచ్చెనని శాపనివృత్తి వేగమ కావలయునను కోరికయే యతనికిఁ గలదని విశ్వసించి రామాయణము పఠింప వలయుననియు నపుడే సంపూర్ణఫలమది యొసంగుననియు నెఱుంగుదురు గాక! అట్టిసద్భావమునఁ బఠింతురు గాక!

నిశాచరాణా మధిపోనుజస్య
విభీషణ స్యోత్తమవాక్య మిష్టం,
జగ్రాహ బుద్ధ్యా సురలోకశత్రు
ర్మహాబలో రాక్షసరాజముఖ్యః." ౨౬

అని మూలము. ఇష్ట ముత్తమవాక్య మనుజస్య జగ్రాహ=తనకు మేలు గలిగించునది. శాస్త్రయుక్తమైనదియు నగు సోదరుని వాక్యము నంగీకరించెనని తాత్పర్యము. హనుమంతునివధింప నాజ్ఞాపించుట యుత్తమకార్యము కాదనుహితము నంగీకరించె నని భావము. ఏల? తనకు వచ్చిన కోపము కేవలనటనము. వాస్తవము కాదు. కావున నతనిమాటలు రాజనీతికి ధర్మము నకు లోకాచారమునకు ననుకూలములు. కావున సోదరప్రీతిని బ్రకటింప నంగీకరించెను ఈవిషయమున నధ్యాత్మరామాయణ మును బరిశీలింతము.

"నివారయామాస తతో విభీషణో
మహాసురం సాయుధ ముద్యతం వధే,
రాజన్వధార్హో న భవేత్కథంచన
ప్రతాపయుక్తైః పరరాజవానరః. ౩౦

హతేఽస్మిన్ వానరే దూతే వార్తాం కో వా నివేదయేత్,
రామాయ త్వం య ముద్దిశ్య వధాయ సముపస్థితః. ౩౧

అతో వధసమం కించి దన్యచ్చింతయ వానరైః,
సచిహ్నో గచ్ఛతు హరిర్యం దృష్ట్వా యాస్యతి ద్రుతం." ౩౨

అని గలదు. వాల్మీకివాక్యముల వ్యంగ్యముగా నున్నయర్థ మిందు వాచ్యము. పైనివ్రాసినది సమంజసమే యని యిది దృఢపఱచుచున్నది. ఇఁకఁ దరువాతివృత్తాంతమును బఱింతము.

## రాక్షసులు హనుమతోఁకం గాల్చుట.

* రావణుఁ డిట్లు విభీషణుఁడు దేశకాలములకుఁ దగి నట్లు చెప్పఁగా విని సోదరా! నీవాక్యము సమంజసమైనది. దూతనుజంపుట నింద్యమే. ఎట్లైనను వీనికి వధదండము తప్ప నింకొకటి విధింపవలయును. వానరములకు వాలమునం దెంతయుఁ బ్రీతియుండు. అదియకదా వాని కలంకారము. కావున వీనితోఁకఁ గాల్పుఁడు. కాలినతోఁకతోఁ దన ప్రభువు నొద్దకుఁ బోవుఁగాక! వీనిం గాంచి బంధుమిత్రాదులు తోఁక కాలిపోయినట్టు లెఱుంగుదురు గాక! అని యానతిచ్చెను. ఇట్లు తెలిపి రావణుఁడు వీనిని గాలినతోఁకతోడ నగరమం

* ఇది యేఁబదిమూఁడవసర్గమునందుఁ గలదు.

దెల్లయెడలఁ ద్రిప్పుఁడు అని యాజ్ఞచేసెను. రాక్షసు లా ప్రభువునాజ్ఞ నాలకించి కోపంబున నొడలెఱుంగక జీర్ణవస్త్ర శకలముల నాతనివాలమునకుఁ జుట్టిరి. అత్తఱి నాగాలి కొడుకు మహాటవి శుష్కదారువులకుఁ దగిలియుండు వహ్ని వలె వృద్ధినొందెను. అంత రక్కసులు నూనెతో దానిం దడిపి నిప్పంటించిరి. హనుమయు రోసము నీసును మనమున దీపింప మోము రక్తమయంబుగఁ జూపట్టఁగా మండుచున్నవాల మును గిఱగిఱఁ ద్రిప్పి యారక్కసులఁ బొఱఁగొట్టెను. లంకం గల రాక్షసులంద ఱావార్త నాలకించి సంతుష్టులై స్త్రీబాల వృద్ధులం గూడి యాయుత్సవమును జూడఁబోయిరి. క్రూరులు గాన వారంద ఱొక్కటిగాఁ గూడి మరలఁ దన్నుఁ గట్టి వేయఁగా వీరుఁడు గాన నాహనుమంతుఁడు తత్కాలార్హ మగుమాటతో నేను బద్ధుఁడనైనను వీరందఱు నాబలమున కించుకంతయు నిలువఁజాలరు. ఈత్రాళ్లం ద్రెంచుకొని యెగసి వీరినెల్ల వధించెద. వీరు మహాక్రూరులు. నాప్రభువగు శ్రీరామ చంద్రుని హితార్థము లంకం దిరుగుచుండు నన్నుఁ దమప్రభువు నానతిచేఁ గట్టివేయుదురేని దీనిమూలమున నాకెంతమా త్రము బదులుచేయుట గలుగదు. ఇది నాకొక లెక్కగాదు. రణరంగమున వీరికందఱకు నేనొక్కఁడనే చాలుదును. ఐనను శ్రీరాముఁడు తానే రావణుం జంపుదునని శపథము చేసినాఁడు. కాన దానినెఱవేర్చి యాప్రభువు సంతోషించుం గాక! నన్ను వీరు పురమునందంతటఁ ద్రిప్పుదురు గాన మరల లంకయుం తయుఁ గనుఁగొనవచ్చును. ఈ రెండుకారణములనుబట్టి నే

నిట్టియగౌరవము నోర్చుకొనియున్నాను గాని మఱెందులకుఁ గాదు.

ఈనగరమును రాత్రియందుఁ గంటిని. దీనిరక్షణార్థము కావించినదుర్గములు లోనగువానిని జక్కఁగాఁ జూడలేదు. కావునఁ బ్రాతఃకాలమున వానినెల్లం జూతును. ఈస్వల్పము నకే నన్ను వీరింతగా బాధించుచున్నారు కదా. ఇంకను బాధింతురు గాక! దీన నామనస్సున కాయాసము లేదు. అని తలంచెను. ఆరక్షఃపటలము తనశక్తిని దాఁచియున్న వాయుపుత్రుని దెలిసికొనఁజాలక సంతుష్టులై పట్టి తీసికొనిపోయిరి. క్రూరులు గాన వారు శంఖములొత్తుచు భేరులు లోనగు వాని వాయించుచు నగరమంతయుం ద్రిప్పిరి. శత్రుహంతయగు నాహనుమ వారు కూడ వచ్చుచుండఁగా సుఖముగాఁ బోవుచు నానగరమంతయుఁ బరిశీలించెను. అంత నావాఁయు జుఁడు నానావిధవిమానములను, సంవృతభూభాగములను, జక్కని యిండ్లముంగిళ్లను దిలకించెను. మఱియు వీథులను. జదుకములను, రాజమార్గములను, జిన్నగృహములను, బ్రచ్ఛన్నద్వారములను, మేఘమండలముం దాఁకు గేహములను గాంచెను. ఆయాయి ముఖ్యస్థలములయందు హనుమంతుని రాక్షసులందఱు వేఁగులవాఁడు వీఁడని చాటుచుఁ బోవు చుండిరి. స్త్రీలు బాలురు ముదుసలులు మండుచుండు వాలముతోఁగూడిన పావనిం గాంచనుబ్బుచు మహాసంతోషముతో బయలువెడలిరి. వాలాగ్రము మండుచుండఁగా వికారము లగు కన్నులుగల రాక్షసస్త్రీలు కొందఱు ఆ యప్రియ వార్తను దెలుపఁబోయి సీతా! ఇంతకుముందు నీతో మాట

లాడిపోయినవాఁ డెవ్వఁడో ఎఱ్ఱనిమోముగల యాకోఁతిని వాలమునకు నిప్పుపెట్టి యిదిగో నగరమంతయుఁ ద్రిప్పు చున్నారు. వింటివా. అని చెప్పిరి.

సీతాదేవియు నాక్రూరవార్తను విని తనయసువులనే యపహరించినట్లు శోకాతిరేకమునం బొక్కుచు నగ్ని నుపాసించెను. ఆసాధ్వి యాపావనికి శుభము గలిగింపం గోరి శుద్ధమతియై యగ్నినిధ్యానించి మహాత్మా నేను భర్తృశుశ్రూష చేసినదాననేని, తపస్సు చేసినదాననేని, నాకుఁ బాతివ్రత్యము గలదేని హనుమంతునకుఁ జల్లఁదనము నొసంగుము. బుద్ధిమంతుఁడగు నారాామునకు నాయందించుకే దయయుండునేని, ఇంకమీఁద నాకు గొంతభాగ్య మనుభవింప మిగిలియుండునేని హనుమంతునకు నీవు చల్లఁగానుండుము. మహాత్మా! నే సాధ్వీత్వసంపన్న నగుదుననియు శ్రీరామునిం జేరవలయు ననియే త్వరపడుచుందుననియు ధర్మాత్ముఁడగు నాశ్రీరాముఁడు, హనుమంతుఁడు నెఱుంగుదురేని హనుమంతునకు శీతలుం డవు కమ్ము పూజ్యుఁడు సత్యప్రతిజ్ఞుఁడు నగుసుగ్రీవుఁ డిత్తఱిం గలిగియుండు నీదుఃఖసాగరమునుండి నన్నుత్తరింపఁ జేయునేని పావనికి మహాత్మా! హవ్యవాహా! శీతలుండవు కమ్ము. అని ప్రార్థించెను.

అంతట నాయనిలకుమారు వాలాగ్రమందు మండుచుండునగ్ని యాసీతకు పావనికి భయములేక మంగళమే యని తెలుపునట్లు ప్రదక్షిణజ్వాలములతో నేమఱక మండెను. ఆ వాలాగ్నింగూడిన యతనితండ్రి వాయుదేవుఁడు సీతకు మనోధైర్యము కలుగునట్లుగా హితమారుతమును బోలి

చల్లఁగా వీచెను. అట్లు స్వవాలము మండుచుండఁగా హనుమ తనమనంబున నావాలాగ్రమున నగ్ని మండుచునే యున్నది. నన్నిది దహింపకయున్నదే. ఏమిది? అగ్ని మహాజ్వాలావళితోఁ గనఁబడుచున్నది. కాని యించుకంతయు నాకుఁ బీడ కలిగింపదు. నావాలాగ్రమున నీయగ్ని చందనము వట్టివేరు లోనగువానిని గలిపి పూసినట్లు చల్లఁగా నున్నది. దీనికింగల కారణమేమి? దీని కిది కారణమైయుండునని తోఁచెడు. సాగరము దాఁటుతఱిఁ బర్వతరూపము నొకయాశ్చర్యము నా సముద్రమునందే చూచితిని గదా. నీటినడుమఁ గొండపుట్టుట శ్రీరామునిమహత్త్వమువలననే. అట్లే యగ్ని శీతలుం డగుటయునగు. ఇవియే నిశ్చయము. సాగరమైనాకు లిరువురును శ్రీరామునకు సాయముచేయ నంత తొందఱపడఁగా నిఁక నగ్నిమాత్ర మేల యూరకయుండును. సీతాదేవిదయవలనను, శ్రీరాముని ప్రభావమువలనను, నాజనకుఁడగు వాయుదేవుని తోడి మైత్రివలనను, ఈ యగ్నిదేవుఁడు నన్నుఁ గాల్పక యున్నవాఁడు. అని యూహించెను.

అంత నాహనుమ యిఁక నేఁ జేయవలసినకార్య మేమని కొంచె యాలోచించెను. జవమునఁ బైకెగిరెను. సింహనాద మొనరించెను. పర్వతశృంగమువలె నెత్తుగానున్న రాక్షససంచారశూన్యమగు పురద్వారమును జేరెను. పర్వత మట్లున్న యాహనుమ మరలఁ బొట్టివాఁడై బంధముల నూడ్చుకొనెను. మరలఁ బర్వతాకారుఁ డయ్యెను. నలుదెసలఁ బరికించెను. ఆతోరణమునఁగల యినుపగుదియఁ జూచెను. దానిం గైకొని తనకుఁ గాపున్నరక్కసుల నుక్కడంచెను. వారిం

బోలియించి లంకవైపు చూచుచు వాలాగ్ని ప్రజ్వరిల్లఁగా సూర్యబింబమువలెఁ బ్రకాశించెను.

మహాశయులారా!

"సర్వేషా మేవ పర్యాప్తో రాక్షసానా మహం యుధి. ౧౩
కింతు రామస్య ప్రీత్యర్థం విషహిష్యేహ మీదృశం,
లంకా చారయితవ్యా వై పునరేవ భవిష్యతి." ౧౪

అని మూలము. ఈరక్కసుల నుక్కడంప నేనే చాలుదు. కాని శ్రీరాముని ప్రీత్యర్థము వీరు పెట్టుబాధల నోర్చుకొందును. అనఁగా నేను వధింతునన్న ప్రతిజ్ఞకు నామూలమున భంగము రాఁగూడదు గాన నీబాధల నోర్చుకొందు ననుకొనియెను. సాధువులు పరులసంతోషమును గాంచి యానందింతురు. పరులకష్టములకు దుఃఖింతురు. తమకష్టములవలన నొరులకు మేలుగలుగుచో వాని నోర్చుకొందురు. అన్ననీతి యీ భాగము దృఢపఱచును. తనకు దైవమగు శ్రీరామునికొఱకు నెన్నికష్టములనైన భరింతుననుకొనుట పరార్థము శరీరదానము చేయుట యని కథాసారము. భక్తులలో నగ్రగణ్యుఁడు హనుమంతుఁడని తేలుచున్నది. తనప్రాణములనైన దేవత కర్పించుట యనఁగా శరీరము తుచ్ఛమని దీనిచే భగవంతునకు సంతృప్తిగలుగునట్లు చేయఁదలఁచుట యాత్మార్పణమను మహాధర్మమునకుఁ జేరుచున్నది. అట్టివారలకే భగవంతుఁడు ప్రసన్నుఁడగునను విషయము చక్కఁగా నెఱుంగఁదగినది.

"రాత్రౌ న హి సుదృష్టా మే దుర్గకర్మవిధానతః,
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లంకా నిశాక్షయే. ౧౫

> కామం బద్ధస్య మే భూయః పుచ్ఛస్యోద్దీపనే న చ,
> పీడాం కుర్వంతు రక్షాంసి న మేఽస్తి మనసశ్శ్రమః." ౧౬

అని మూలము. రాత్రి చక్కఁగా లంకను జూడలేదు. ఈ ప్రాతఃకాలము చూడఁదగినదే. అనుదానింబట్టి తెల్లవాఱినదని యేర్పడుచున్నది. సీతాసంభాషణాధికము రాత్రి మూఁడవ భాగమున సాగెననియు నాల్గవభాగమున వనభంగయుద్ధాదులు రావణసందర్శనాదులు జరగెననియు మన మెఱుంగవలయును. ఇంత యల్పకాలమున నిన్నిపనులు సాగినవా యని సంశయింపరాదు. శక్తిమంతుల కార్యముల శక్తులకు నట్లే తోఁచును. న మేఽస్తి మనసశ్శ్రమః=అనుటంజేసి హనుమంతునకు రాక్షసకృతపీడ తోఁపలేదని యేర్పడుచున్నది. ఏల యనఁగా మనస్సు శ్రీరాముని పాదాంబుజద్వంద్వమున నిమగ్నమై యున్నది. శరీర మిందున్నది. కనుకనే మహర్షులకు శరీరకష్టములు తోఁపవు. పామరులకు మనస్సు శరీరమందే లగ్నము. కాన నన్నియుఁ గష్టములే. సుఖము తలంపునకే పొడకట్టును గాని మనస్సునకు లేదు. ఇదియే యోగులకు మనకుఁ గల యత్యల్పభేదము.

> "వల్మీకార్ధనిమగ్నమూర్తి రురగత్వక్ప్రస్తూ సూత్రాంతరః
> కంఠే జీర్ణలతాప్రతానవలయే నాత్యర్థ సంపీడితః,
> అంసవ్యాపిశకుంతనీడనిచితం బిభ్రజ్జటా మండలం
> యత్ర స్థాణురివాచలో మునిరసా వభ్యర్కబింబంస్థితః."

అని కాళిదాసు మహర్షిని వర్ణించెను. అదిమనకు నుత్కృష్ట కష్టముగాఁ దోఁచినది కాని యామహర్షికి శ్రమనుని తోఁచి

యుండునా? మనస్సు లక్ష్యాంతరమున నిమగ్నమైనది. కావున శరీరశ్రమములు తోఁపకయుండును.

"స్త్రీబాలవృద్ధా నిర్జగ్ము స్తత్ర తత్ర కుతూహలాత్. ౨౩
తం ప్రదీపిత లాంగూలం హనుమంతం దిదృక్షవః,"

అని మూలము. ఒకరెంత బాధపడుచున్నను జూడఁగోరువారు పెక్కండ్రు కుతూహలపడువా రుందురని తెలియవలయును. పరుల శ్రమములందుఁ బాల్గొననివారల కిట్టివి వింతలుగాఁ దోఁచును. అసజ్జను లన్నను బామరులన్నను గ్రూరులన్నను వీరలేకదా. పరహితకాంక్షులే యైన నిట్టి కుతూహలమును బొందుదురా.

"నమ్రత్వే నోన్నమంతః పరగుణకథనైః స్వాన్ గుణాన్ ఖ్యాపయంత
స్స్వార్థాన్ సంపాదయంతో వితతపృథుతరారంభయత్నాః పరార్థే,
క్షాంత్యై వాఽఽక్షేపరూక్షాక్షరముఖరముఖాన్ దుర్ముఖాన్ దూషయంతః
సంతస్సాశ్చర్యచర్యాజగతి బహుమతాః కస్యనాభ్యర్థనీయాః."

అను భర్తృహరిసూక్తి నెఱింగినవార లిట్టిదుష్కార్యము లందుఁ గుతూహలులు గారు.

"దీప్యమానే తత స్తస్య లాంగూలాగ్రే హనూమతః. ౨౪
రాక్షస్య స్తా విరూపాక్ష్య శ్శంసు ర్దేవ్యా స్తదప్రియం,
య స్త్వయాకృతసంవాద స్సీతే తామ్రముఖః కపిః. ౨౫
లాంగూలేన ప్రదీప్తేన సఏష పరిణీయతే,"

అని మూలము. అప్రియవార్తను హనుమంతుని తోఁకఁగాల్చి త్రిప్పుచున్నారన్నవృత్తాంతమును సీతకు రాక్షసస్త్రీలు తెల్పిరి. ఇచ్చోట మహాకవి వాల్మీకి విరూపాక్ష్యః=అని ప్రయో

గించిరి. ఏస్త్రీలకు నేత్రములు వికృతములుగా నుండునో వారలే క్రూరచిత్తులుగా నుందురని సాముద్రికము తెల్పుచున్నది. స్త్రీలక్షణములలోఁ గూడ సంకరజాతిస్త్రీల కీలక్షణము లున్నయట్లు చెప్పఁబడినది. తఱచుగా నప్రియవార్తల నాసక్తితోఁ దెలుపుట. విని యానందించుట అట్టివారలకే యని స్పష్టమగుచున్నది. అట్టివారిదృష్టికే దృష్టిదోషమని పేరుగలదు. కొందఱు చూచినచో వెంటనే యొకకష్టము కలుగును. అనఁగా వారిచూపులు క్రూరములు. పరహింస వారికి సుఖతుల్యముగా నుండును. స ఏష పరిణీయతే=ఆకోఁతి యిదిగో తేఁబడుచున్నాఁడు. ఏషః=అని హస్తనిర్దేశము చేయుటం జేసి తొలుత సీతాదేవి కీతనియవస్థను జూపఁ దీసికొనివచ్చుచున్నవారని తోఁచుచున్నది. దైవికముగా నతఁడింతలో వారలం జంపి తా లంకనే కాల్చెను. లేకయున్న సీతకుం జూపించియే యుందురు

"శ్రుత్వా తద్వచనం క్రూర మాత్మాపహరణోపమం. ౨౬
వైదేహీ శోకసంతప్తా హుతాశన ముపాగమత్,
మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః. ౨౭
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్,"

అని మూలము. సీతారాములకుఁ గలుగు సంతాపచింతాశోకాదులు మానవాకారనైజములు గాని వాస్తవములు కావు. అవి నటనములు. సీత యావార్త తనప్రాణములు పోవునట్టిదానినిగా భావించెను. సాధ్వీలక్షణ మిది. దాన శోకించెను. అగ్నిదేవు నుపాసించెను. అనఁగా మనస్సున నిలిపి ధ్యానించెను. ఏల యందురు.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,"

అన్నసూక్తి ననుసరించి తా నట్లుచేయఁగా నెల్లరు చేయుదు రని భావించెనని తాత్పర్యము. లేకున్న సీత మహాజ్ఞానంబిన నతఁడు శిరసావహించవలసినవాఁడే ఆపత్కాలమునందు నిశ్చలమనస్సున నిష్టదైవమును ధ్యానింపవలయునను బహాచారము సీత తెలుపుచున్నది. హనుమంతునకు శుభములు గలుగఁ గోరి యారాధించెను. ప్రయతా=నియతమానసనై. అనఁగా నిశ్చలచిత్తయై యని భావము. అది లేకున్న నారాధన ఫలకారిణి కాదని యాశయము. భగవంతుఁడగు శ్రీరాము నారాధింపక యగ్ని నేల యారాధింపవలయునని యడుగుదు రేమో యించుక వినుఁడు. ఒక్కొక్క కార్యమున కొక్కొక్క దేవత యధిదేవతగా నిర్ణయింపఁబడి యున్నారు. లోకపాలకు లెల్ల నిందులకే. తనుగుల్మలతాదులకుం గూడ నధిదేవతలు గలరు. వారి నారాధింపక యది ఫలింపదని విధి కలదు. ఆవిధి భగవదాశయమే. దాని నతిక్రమింపరాదు. మహాత్ములకుఁ బామరులకుం గూడ నొక్కనియమమే కలదా యందు రేమో

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః,"

అను గీతావాక్యము ననుసరించి సమదర్శనులగువారు తప్పఁ దక్కినవారికందఱకు నిదే నియమము. సమదర్శనుల కీకాంక్షలే లేవు. భేదదృష్టిగలవారలకు నొక్కొక్క కార్యమున కొక్కొక్క దేవత నుపాసింపవలయునని విధి. ప్రకృతము సీతాదేవి పామరుల కుపదేశించుటకుఁగా నగ్ని నుపాసించెనని

మన మెఱుంగవలయును. ఉపాసనకు ముఖ్యము నిశ్చలమన స్సని యిందుఁ గలసారము. అదిలేక యుపాసించిన ఫలము యత్కించిత్తుగా లభింపవచ్చును. మఱియు నది లోకవంచనకు మిగుల నుపకరించును. స్వోపకారకము గాదు.

"యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః. ౨౮
యది చాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః,
యది కించిదనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః. ౨౯
యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః,
యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసాం. ౩౦
స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః,"

అని మూలము. ఇవి సీతాదేవివాక్యములు. ఒట్టుపెట్టి చెప్పుచున్నది. ఇతరులసాక్షు లక్కఱలేదు. మనోనిశ్చయమే సాక్షి. ఆమె ప్రమాణము లివి. వీనియర్థ మిట నక్కఱలేదు. సారమే. ఉత్తమస్త్రీల కాపదుద్ధారక మేది? పతిశుశ్రూష. తపశ్చరణము. పాతివ్రత్యము. ఇవి నాకున్నయెడల నీకార్యమును మహాత్మా! ఫలింపఁజేయుమా. అని వేఁడందగు. ఇది వాంఛ యగును గదా. అది మంచిదియా యనవచ్చు. స్వార్థముకానిదంతయు శుభమే. ఫలాభిసంధి స్వవిషయమున నుండరాదు. వసంతవల్లోకహితం చరంతః. అన్న శ్రీశంకరభగవత్పాదోక్తియే యిటఁ బ్రమాణము. భర్త తన్ను వృత్తసంపన్నగా భావించి యున్నయెడల, మఱియు దయయుండినయెడల ననునవియుఁ బ్రమాణములు. ఇవన్నియుఁ బతివ్రతలకు నుండవలసిన యుత్తమగుణములు. ఇవి సత్యములైనయెడల ననఁగా లోకమును నమ్మించుటకుగాఁ జేసిన చర్యలవంటివి గాక సత్యము

లైనయెడల నీహనుమంతునకు నగ్నిదేవా! శీతలుఁడవు కమ్ము. అని ప్రార్థించెను. పాతివ్రత్యము స్త్రీల కలంకారము. అది లేనిచో నితరాలంకారములు వ్యర్థములు. కావునఁ బాతివ్రత్యము ప్రధానముగా నార్జింపవలయునని యిందుఁగల సారము.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకా నాప్నోతి సద్భి స్సాధ్వీతి చోచ్యతే."

మను. ౯ అ.

అన్న మనుస్మృతియు నీయర్థమునే చెప్పుచున్నది. యద్యస్తి చరితం తపః=అని యిందున్నది. స్త్రీలకుఁ దపము కలదా యని ప్రశ్నము.

"నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః,
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితి స్థితిః,"

అన్న మనుస్మృతి పైప్రశ్నమున కాధార మందురు. సత్యమే కాని యొకవిశేషవిధి కలదు. భర్తృక్షేమార్థము తప మాచరింపవచ్చుననియు భర్త్రనుమతిచే వ్రతములఁ నాచరింపవచ్చుననియుఁ దంత్రశాస్త్రము తెల్పుచున్నది. కావున నీప్రశ్నము ప్రధానముగాఁ బాటింప నక్కఱలేదు.

"యది మాం తారయేదార్యస్సుగ్రీవస్సత్యసంగరః. ౩౨
అస్మాద్దుఃఖాంబుసంరోధా చ్ఛీతో భవ హనూమతః,
తత స్తీక్ష్ణార్చిరవ్యగ్రః ప్రదక్షిణశిఖోఽనలః. ౩౨
జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంస న్నివ శివం కపేః,"

అని మూలము. ప్రమాణమున కిది పరీక్ష. సుగ్రీవునిమూల

మున మేలుగలుగునది నిజమైనయెడల హనూమంతున కగ్ని శీతలుం డగుఁగాక యనియె. పతివ్రతలకు శీలమునం దెంత విశ్వాసము కలిగియుండవలయునో యీసీతావాక్యములు తెల్పు చున్నవి. ఋషులకన్నఁ బతివ్రత యెక్కుడు—అనుసూయకిం కింత కంటె నుదాహరణ మేమికావలయును? ఈపలుకులు సీతనోటి నుండి వెడలఁగానే మనస్సు నిర్మలము కాఁగా నుండుచున్న యగ్ని తనజ్వాలముల నడంచుకొని కపివర్యునకు మంగళము కలుగునని తెలిపినటులు నుండెను అనఁగా నతని కించుకంతయు బాధ కలుగకయుండ నితరులకుఁ దోఁచునట్లు నుండెనని భావము. పాతివ్రత్యము శాపానుగ్రహసమర్థ మైనదనుట కిదియే చాలును గదా. మనోనిగ్రహమే యన్నింటికిఁ బ్రధా నము. అది లేకున్ననే సద్గుణము నిలువఁ జోటుండదు. యోగము లోకమున కెంత మహోపకారకమో దాని మాన నెంతయపకారమో మన మెఱుంగవచ్చును. యోగాభ్యాసము లేని జపతపములు లోనగునవి యెట్లు నిరర్థకము లగునో మన మెఱుంగవలయును. యోగాభ్యాసములేని సత్కర్మానుష్ఠా నము శవాలంకారతుల్యమని మన మెఱింగి మనస్సు నియ మించుకొనవలయును. జితేంద్రియత్వమహత్త్వము పొగడఁ దరమగునా ?

“ప్రదీప్తాగ్ని రయం కస్మా న్న మాం దహతి సర్వతః,
దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజం. 3౫

... ... ...

అథవా తదిదం వ్యక్తం యద్దృష్టం ప్లవతా మయా. 3౬
రామప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాంపతౌ,

యది తావత్సముద్రస్య మైనాకస్య చ ధీమతః. ౩౭
రామార్థం సంభ్రమ స్తాదృ క్కిమగ్ని ర్న కరిష్యతి,
సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ. ౩౮
పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః,"

అని మూలము. హనుమంతున కీమహాలాభము కలుగుటకుఁ గలకారణ మిదమిత్థమని తెలియదయ్యెను. కావున ననేక భంగులం దలపోయఁ జొచ్చెను. లోకమున నొకని కొకమేలు కలిగిన నది ప్రాక్కర్మఫలమైన నతనిమనస్సునకుఁ బాఁజేసిన దేవతాసేవవలనఁ గలిగినదియే తొలుతఁదోఁచును. దేవతాసేవ నిష్ఫలమా యన్నఁ గాదనవలయును. ఇది దేవతాసేవాలబ్ధ లాభమనువిశ్వాసమే ముఖ్యము. అద్దానివలన దుష్కర్మానుష్ఠాన విముఖుఁ డగును. ఇంకను విశేషించిసేవించిన మహాలాభములు గలుగునని నిశ్చయించుకొనును. దుష్టకర్మము లాచరించిన దేవతానుగ్రహము గలుగ దని భయంపడును. ఇంతకంటె విశేషించి కోరఁదగిన దేముండును? ప్రస్తుతము హనుమంతునిమనస్సున సీతారాముల కరుణచేతఁ దనతండ్రియనుగ్రహమున నీయగ్ని శీతలుం డయ్యెనని తోఁచెను. తొలుత శ్రీరామునిమహత్త్వమే కారణమని యూహించెను. రామసేవకు ఫలము తొలుత సాగరమునఁ బర్వతసమాగమమే. యని యతఁడు తలంచెను. ఇట్లే యన్నియు. ఆనృశంస్యేన=నృశంసుఁ డనఁగా ఘాతుకుఁడు నృశంస్యము=ఘాతుకత్వము, ఆనృశంస్యము=అది లేకుండుట. అనఁగా దయ. పరద్రోహచింత లేకుండుటకుఁ గారణము దయ ఎవనిమదిని దయాలేశమే నుండునో యతఁడు పరద్రోహమునకుఁ బాలుపడఁడని భావము. సీత

కరుణాస్వరూపురాలు. సకలకార్యకర్త్రి దయాస్వరూపురాలు కాకున్న నెట్లు కార్యములు సాగును? లోకమున దయగల వాఁడే ఉత్తముఁ డనుభావము కలిగియుండుట మనవిధి.

"హ్రస్వతాం పరమాం ప్రాప్తో బంధనా న్యవశాతయత్,
విముక్త శ్చాభవచ్ఛ్రీమాన్ పునః పర్వతసన్నిభః. ౮౨

అని మూలము. హ్రస్వత్వగురుత్వములు యోగుల కత్యల్ప కార్యములు. అది లేని మనకు మహాకార్యములు. ఈసంశయ మేల కలిగినది? యోగశాస్త్రము చదువక. దాని నభ్యసింపక పోవుటంజేసియు నితరశాస్త్రములు కుక్షిపోషణేతర కార్యములకు దానివలె నుపయోగింపకుండుటయు నీ సంశయములకుం గారణములు. అక్కటా! వ్యర్థముగా నెట్లు మన జీవితమును గడపుచున్నారము!

## లంకాదహనము.

* అంత నా పవనాత్మజుఁడు తనవాంఛ నెఱవేఱఁగా నగరమును జూచుచు నుప్పొంగుకాంక్షచే ననంతరకర్తవ్య మెద్దియని యాలోచింపం దొడంగెను క్రొవ్విన యీరక్కసుల బాధించుట తప్ప నింక మిగిలిన దేదియున్నది? అశోకవనభంగ మొనరించితిని. రక్కసుల నుక్కుమిగిలి మార్కొనఁగాఁ బోరి పుచ్చితిని. రావణునిసేనలోఁ గొంతభాగము హతమయ్యెను. ఈపురదుర్గమును బాడుచేయు టొక్కటియే మిగిలియున్నది. దీనింగూడఁ బాడుచేయఁగా నాసముద్ర లంఘనాదికార్య

* ఇది యేఁబదినాల్గవసర్గమునఁ గల కథ.

ములు సఫలము లగును. ఈకార్యమున మహాయత్న మక్కఱ
లేదు. దీనింగూడ నొనరించి ధన్యుఁడ నయ్యెదను. నావాలా
గ్నిహోత్రుఁడు శీతలుఁడై నాకు మహోపకార మొనరించెఁ
గదా? అట్టి యీమహాత్మున కీగృహముల నాహుతియిచ్చుట
ధర్మ్యము. అని చింతించి మండుచుండువాలముతో విద్యు
న్మేఘముభంగి నాగృహరాజములపై సంచరింప నారంభించెను.
భయంబనుదానికి మదిఁ జోటీయక యంతటం దిరిగెను.

తొలుతఁ బ్రహస్తుని యింటిపై కెగిరి యగ్ని రగుల్కొ
లిపి మహాపార్శ్వునిగృహ మగ్నికిఁ జూపించి యంత వజ్ర
దంష్ట్ర శుక సారణులయు, నింద్రజి జ్జంబుమాలి సుమాలుల
గృహములం గాల్చెను. వరుసఁగా ననేకులయిండ్ల కగ్నిని దగి
లించి విభీషణునిగృహమును వదలి రశ్మికేతు సూర్యశత్రు
హ్రస్వకర్ణ దంష్ట్ర రోమశ యుద్ధోన్మత్త మత్త ధ్వజగ్రీవ
విద్యుజ్జిహ్వ హస్తిముఖ కరాళ పిశాచ శోణితాక్ష కుంభకర్ణ
మకరాక్ష యజ్ఞశత్రు బ్రహ్మశత్రు నరాంతక కుంభ నికుంభ
గృహముల నగ్నికి నైవేద్యముగా నొసంగెను. మహార్హవస్తు
వుల నగ్ని దహించెను. అంత రావణునిగృహమున కరిగి
నానారత్నమయంబగు నాగృహరాజమును గాంచి మహానంద
మున నగ్నిని దగులంజేసి గట్టిగా నార్చెను ఆయగ్నియు లయ
కాలమునందుబలె మీఁదమీఁద వృద్ధినొందెను. విశేషించి
వాయువు తోడుసూపెను. దాన నాయగ్ని చెంతనుండుగృహ
ముల వ్యాపించుచుండెను. స్వర్ణమయములగు నాగృహములు
మండి భస్మమయములై నేలఁ గూలెను. ఆప్రాసాదములు

పుణ్యక్షయంబున సిద్ధవిమానములు నేలఁగూలునట్లు పడ సాగెను.

అంత రక్షోవీరులు తమతమగృహములను రక్షింపఁ గోరి పరుగులెత్తుచు నది సాధ్యము కాకపోవఁగా అక్కటా! వీఁడు ప్రత్యక్షాగ్నిహోత్రుఁడే. నిజమిది. అని యాక్రోశించు నాధ్వని గొప్పఁగా వినఁబడినది. శిశువులనెత్తుకొన్న స్త్రీలందఱు అగ్నిజ్వాల లావరింపఁగా సౌధములపయినుండి యాక్రోశించుచుఁ గొప్పలువీడఁ గ్రిందఁబడిరి. హనుమయు మంటలు గరఁగి రత్నములు బంగారు క్రిందఁబడుచుండం గాంచెను. అగ్నియు హనుమయు సంతృప్తి నొందరైరి. రాక్షసశవము లెన్నిపడినను భూమి తృప్తినొందకుండెను. రుద్రుఁడు త్రిపురములం గాల్చినట్లు హనుమ లంకను దహించెను. అగ్నిజ్వాల లంబరమున వ్యాపించుచు భయంకరములుగా నుండెను. పటపటశబ్దములు వినఁబడుచుండెను. గృహములు నుపవనములు నిష్కుటములు భస్మములయ్యెను.కొందఱురాక్షసులు జ్ఞానము గలవారు గుంపులుగాఁ జేరి యా నగరస్థితిం గాంచుచు వృత్రాసురుని బొలియించిన వజ్రియో ప్రత్యక్షయముఁడో వరుణవాయురుద్రాగ్నులలో నొకఁడో సూర్యచంద్రులలో నొక్కండో యీతఁడని తెలియకున్నది. వానరుఁడుమాత్రము కాదు. ప్రత్యక్షకాలుఁడే యీతఁడై యుండనోపును. చతుర్ముఖుఁడు రాక్షసులనందఱను రూపుమాపవలయునని పూనుకొనఁగా నాతనికోపమే యీ కపిరూపమున నిచ్చటికి వచ్చెనో యేమో. నిరుపమానమగు వైష్ణవతేజస్సే రాక్షసనాశనార్థమై యసాధారణశక్తిచే వానరరూపముం దాల్చి

వచ్చెనా యేమి? అని చెప్పుకొనసాగిరి ఎన్నియో మృగములు పక్షులు దగ్ధములైనవి. వానిధ్వనులు మిన్నుముట్టెను. కాలి చచ్చునపుడు తమతమవారిం బేర్కొనుచుండిరి. ఆధ్వని భయంకరముగా నుండెను. ఆదహనము శాపమువలెఁ గనుపట్టి యందఱ నశింపం జేసెను. ఇట్లు నగరముం గాల్చి రక్షోవీరులం జంపి కృతకృత్యుఁడై శ్రీరామునొద్దకుఁ బోవఁగోరెను. దేవత లందఱు హనుమంతుఁ డొనరించిన యాకార్యమునకై ప్రస్తు తించిరి. అంత దేవతలు లోనగువారు లంకాపురమంతయు దగ్ధమగుటం గాంచి పరమాశ్చర్యంబు నొందిరి. భూతము లన్నియు నాహనుమంతునిం గాంచి ప్రళయాగ్ని యని యూహించి భీతిఁగాంచెను. దేవమునిగంధర్వాదులును సకల భూతములును లంకానగరము దగ్ధమగుటం గాంచి పరమప్రీతి నొందెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విషయములు సంశయములం గల్గింపఁజాలి యున్నవి. కావున మూలము నుదహరింపక వానిని వ్రాసి సమాధానము తెల్పెదను. ప్రశ్న ముల నుదహరించి వానికి నుత్తరములువ్రాయుట మంచిది. హనుమ యాగ్రహించి లంకం గాల్పందలంచెను. ఇది శత్రు వులపనికి బదులుచేయుట యని హనుమ తలంచెననుట యంత యపరాధము కాదు. రాజధర్మములలో నిదియు నొకటి యని కథలమూలమునఁ దెలియవచ్చుచున్నది ౧. ఇంద్రజిత్ప్రముఖ రాక్షసవీరులు కోట్లకొలఁదిగఁగలరు. దివ్యాస్త్రవేత్తలు గలరు. రావణుఁ డేమి సామాన్యుఁడా. వీరందఱు హనుమ లంకను గాల్చుచుండఁగా నాపఁబూనక యతనిం బ్రహరింపక యూర

కుండిరనుట సంమజసమా. ౨. ఒక్కొకయింటికి వాలాగ్నిం జూపఁగనే కాలుట కవి పూరియిండ్లుగానుండునా ? మహా సౌధములని,సప్తభౌమాష్టభౌమములని చెప్పఁబడి స్వర్ణనిర్మిత ములని రత్నస్థగితములని చెప్పఁబడియున్న దిగదా. అవి యెట్లు స్పృశించినంతమాత్రముననే కాలును ? ౩. ఇన్ని సౌధములు కాలఁగా విభీషణుని సౌధమెట్లు కాలకుండెను ? అది విభీష ణునిదని హనుమ యెట్లెఱింగెను ? గృహదాహము మహా పాపకార్యమని స్మృతులు ప్రాయశ్చిత్తములు విధించియుండఁగా దేవతలు మహర్షులు గంధర్వాదు లాకార్యము మహాకార్య ముగ భావించి పొగడిరనుట ప్రశంసార్హమా? ౪. ప్రాతః కాలమో యుషఃకాలమో యది కావలయుఁగదా. అట్టి సమయమున నగరము కాలుచుండఁగాఁ జల్లార్ప శక్తిగలవా రొక్కరైన నుండలేదా. అను నీనాలుగు పెద్దప్రశ్నముల వేసికొని సమాధానము సూచింతును. ౧-వ ప్రశ్నము. ఇంద్ర జిత్తు మొదలగు ననేకవీరాతివీరులు గలరు. అవధ్యుఁడని యంతకుముందే హనుమ నెఱింగిరి. బ్రహ్మాస్త్రమున కతఁడెపుడు చావలేదో యపుడే యితరాస్త్రము లతనిపై వైచిన నేమియుఁ జేయఁజాలవని యెఱింగిరి. అక్షకుమారాదుల నతఁ డవలీలఁ జంపుటం జేసి మహాబలశాలి యని తెలిసికొనిరి. ఆతనిం గాంచఁగనే యీతఁడేమి నందీశ్వరుఁడా యని సంశయించెఁ గదా. నందీశ్వరునిశక్తి యీశ్వరశక్తి తుల్యమని యతఁ డెఱుంగును. ఈశ్వరశక్తి యెట్టిదో పాదాంగుష్ఠమునఁ బర్వ తము నొక్కినపుడే తెలిసికొనియుండెను. దివ్యాస్త్రములు బాహుబలము నతనియెడఁ బనిచేయఁజాలవని రావణాదు

లెటెంగియే యుందురనుకొనవలయును. ఆకస్మిక కార్యముల నాపఁజాలినవా రుండరు. అగ్ని వాయువు సహాయమున విచ్చ లవిడి పెచ్చుపెరిగి కాల్చుచుండఁగా వితాకు చెందవలసినదే కాని ప్రతీకారమునకు నవకాశమే యుండదు. హనుమ నిమిత్తమాత్రమని దేవతలందఱు తత్కార్యమునఁ దోడుపడి రని రావణునిభయము వదలెనని తత్సంకల్పమే యొక ముహూర్తమాత్రమున నగరమును దహించెనని యేర్ప డును. అగ్నియే ప్రత్యక్షముగా రూపధారియై గృహ దాహము చేయునపుడు దేవత లాకార్యము సాగ సంకల్పించి నపుడు, లంకాసంపద తొలంగుకాల మాసన్నమైనపుడు దాని నాపువా రెవ్వరు ? ఒక్కసర్వేశ్వరుఁడే సమర్థుఁడు కాని యిత రులు లేరనుట రూఢము. (౨) పూర్వకాల నగరనిర్మాణము వేఱు. ఇప్పటిది వేఱు. అసంబాధగృహము లుండవలయునని వాస్తురత్నాకరము చెప్పుచున్నది. అనఁగా నొక్కొక్కయిం టికిఁ బరగృహపీడ గలుగకుండవలయునని యర్థము.గృహము చుట్టు నిష్కుటము అనఁగా గృహోద్యానము. దానిం జుట్టి ప్రాకారము నుండవలయును. కనుకనే ముందు నగరమును నిర్మించి పిదపఁ బ్రజల కొసంగుచుండిరి. రత్నస్థాపితగృహము లనుట యతిశయోక్తి కాదు. ఆగ్రాలోని తాజిమహాలు పూర్వ మెట్లుండెనో యని తలంచుకొనువార లే యున్న నీప్రశ్నము నకు సదుత్తర మక్కఱలేదు. ఇప్పు డది తద్వర్ణదర్పణములచే నలరారుచున్నది. ఒక్కగృహముకదా యన్నియు నట్లుండఁ గట్టుట సాధ్యమో యని యందురేమో. షాజిహానాచక్రవర్తి పన్నిటితోఁ బెద్దకాలువను నింపి దారాన్వితుఁడై నౌకా

విహారము సల్పెనన్న నాక్షేపించువారు గలరా యని ప్రతి ప్రశ్నము వైచెదను. ఆకాలసౌభాగ్యము నీకాలదౌర్భాగ్యముచేఁ బరిగణింపఁబూనుట యసంగతము. నగరములు కోఁటదిగా నుండుట యరణ్యములఁ బల్లియలుండుట యాకాలపు టలవాటులు. నగరము సర్వసంపదలఁ దులదూఁగుచుండును. సకలలోకములఁ గొల్లఁగొట్టిన రావణునగరము భాగ్యమయముగా నున్నదన్న నచ్చెరువుపడుట పరిహాసాస్పదము. సుమారు నూటయేఁబదియేండ్లక్రిందట మన భరతఖండమున సముద్రప్రాంతముల నుండు రెండునగరముల నోడలమీఁద సేనలతో వచ్చి యొకమహమ్మదీయప్రభువు కొల్లఁగొట్టిపోయి తనరాజ్యమున రెండుసంవత్సరములు పన్ను లిసికొనమానెనని చరిత్రకారులు పలుకుదురు. అది దబ్బరయా. ఆపురము లెంతటి భాగ్యసంపన్నములుగా నుండెనని యూహింపవచ్చును? ఇప్పటిభాగ్యము చూచుచునే యున్నారము కదా. ఇట్టిమనకు లంకానగరభాగ్య మిట్లుండునా యని యూహింపఁదరమగు ననుట కేవల పరిహాసాస్పదము. ఆకాలమున భవనములు దారునిర్మితములు. ఉత్తమదారువులు స్నేహపూర్ణములుగ నుండు. కర్ణాటకరాజసౌధము శ్రీచందనదారునిర్మితము కావలెనని విందుము. ఆర్పువారు లేకకాదు. దాని చెంతకుఁబోవ వలనుపడదు. స్నేహపూర్ణదారువులు. అగ్నిసంస్పర్శమాత్రమున మండును. అయోమయము లాకాలమున లేవు. అవి శాస్త్రసిద్ధములు. ఇవి తద్విరుద్ధమార్గసిద్ధములు. కావున హనుమద్వాలాగ్నిసంస్పర్శమాత్రమున మండసాగెననుట యవిశ్వాసపాత్రము కాదు (3) గృహములకుఁ గొన్ని

పేరు లుండును. ధ్వజము లెత్తఁబడుచుండును. అశ్వముపైఁ గూరుచున్నపుడుకూడ నాధ్వజ ముండును. ధ్వజచిహ్నములం బట్టి యాగృహము విభీషణునిదని యెఱుంగ వలనుపడును. సిద్ధచారణు లాకాశమున నుండిరని ముందే యెఱింగితిమి. వారలయుపదేశము లున్నయ ట్లిందుఁ జెప్పఁబడకున్నను మన మూహింపవచ్చును.

"వర్జయిత్వా మహాతేజా విభీషణగృహం ప్రతి."

అని మూలమున నున్నది. మహామతిం వాయుసుతం వరిష్ఠం ప్రతుష్టువు ర్దేవగణాశ్చ సర్వే. ౪౭. అని యున్నది. స్తుతించిరని యున్నది గదా. మహాతేజుఁడగు నాహనుమంతుఁ డాధ్వజాదిచిహ్నములంబట్టియు, విభీషణునికడనుండు చిహ్నములం బట్టియు నట్టి ధ్వజచిహ్నములే యతనియింటియం దుండుటం బట్టియుఁ గనుఁగొనియుండును. అదొక్క మహాకార్యము కాదు. ప్రక్కయిల్లు కాలుచుండఁగా నావిభీషణుని యిల్లెట్లు సురక్షితమయ్యె ననరాదు. గృహారామము లుండుటంబట్టియది సులభసాధ్యము కాదు. కనుకనే యాకాలపు గృహనిర్మాణ మత్యుత్తమమని తెలిసికొనవచ్చును. ప్రక్కనుండు నిండ్లయుద్యానములు కాలిగదా యగ్ని రావలయును. కావున నది యంత సులభకార్యము కాదనవలయును. గృహదాహము పాపకార్యమే. దానికిఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది. కాని రాజధర్మములలోఁ జేరినది. పరపురదహనము నింద్రుఁడు ఈశ్వరుఁడును జేసిరి. అదియుఁ బాపకార్యమే యనవచ్చునా? జగద్ద్రోహులపురము దహించుట రాజధర్మములలోనిదని గ్రహించిన నది యొకదోషము కాదనవలయును. కనుకనే

మహర్షులు దేవతలు లోనగువారీమహాకార్యమొనరించి లోకములకుపకారము చేసితివని హనుమంతుం బొగడిరి. అధర్మనిందయు మహాధర్మముగనే పరిగణింపఁబడును. సకలలోకాపకారులగు రాక్షసులుండు పురదాహము లోకక్షేమకర మగుటనది ప్రశంసార్హమే యయ్యెను. (ర) అది సంధికాల మనవలయును. అప్పుడు కాదెప్పుడైన నామహాగ్నిని జల్లార్పఁజాలరు. సమీపమునకుం గూడఁ బోవ వలనుపడదు. అగ్ని తానై వాయుదేవుఁడు తోడుపడఁగాఁ బ్రజ్వలించునపుడు తారసిల్లు వారెవ రుందురు. ఎల్లరకు సంఘాతమరణము సమీపించెను. కాన నందుఁబడి చావఁదగువారెల్ల మరణించిరి. బ్రతుకఁదగిన వారు జీవించిరి. ఆమరణమునుండి తప్పింపఁగలవాఁ డొక్క సర్వేశ్వరుఁడే సీతాసంకల్పము దుర్నివారకము. దాని కడ్డములు లేవు. కావున లంకాదాహము సర్వలోకస్తుత్య మయ్యెను. అని యిట్టు లీభాగమున విషయము గ్రహింపవలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## హనుమ సీత సెలవొంది పయనము చేయనెంచుట.

* ఆవానరపతి లంకయంతయు దహించి యవ్వాల వాలమును సాగరజలములఁ జల్లార్చెను. కాలిన లంకాపురమును బరితపించు రక్కసులను గాంచి యిట్లు చింతించెను. అత్తఱి నతనికి మనమున మిగుల భయముతోఁ బఁగా నిట్లు తలంచెను. ఎన్నియోభంగులఁ దన్ను నిందించుకొనియెను నేను లంకఁ గాల్చితిని. ఇదేమి కార్యము చేసితిని ? కోపము వృద్ధియగుతఱి

---

* ఇది యేఁబదియైదవసర్గమునఁ గల కథ యని తెలియవలయును.

మందునగ్ని నుదకముల నార్పుచందమున నాకోపమును బుద్ధి బలమున నడంచుకొనఁ గల్గుదురో మహాత్ములగు నట్టివారే పుణ్యవంతులు. కోపమునొందినవాఁ డెవ్వఁడైనఁ బాపము చేయక యుండఁగలఁడా? కోపి గురువధమునుగూడ నొన రించును. పరుషవాక్కుల సజ్జనుల దూషించును. యుక్తా యుక్తములు తెలియక క్రోధి యేమాటలైనఁ జెప్పును. ఎం దైనను జేయఁగూడనిపని, చెప్పఁదగనిమాటయుఁ గోపాత్మునకు నుండదు. పాము జీర్ణించిన కుబుసమును వదలునట్లు ఎవ్వఁడు తనకోపము నోర్పుననే నశింపఁజేయునో వాఁడే పురుషుఁ డనఁ బడును. నేనాసీతాదేవియున్న దని తలంపక లంకను గాల్చితిని గదా. కాన స్వామి ఘాతుకుఁడను. మిక్కిలి దుష్టబుద్ధికలవాఁ డను. లజ్జాహీనుఁడను. పరమపాపాత్మకుఁడను. అక్కటా! నా బ్రదుకు నశించుఁ గాక. లంకయేమో కాలిపోయినది. పూజ్యు రాలగు సీతయు నుండుటం జేసి కాలిపోయియుండును నేని తెలివి మాలి ప్రభుకార్యము హతముచేసినవాఁడ నగుదు ఎందుల కింతయత్నము చేయఁబడినదో యదియంతయుఁ జెడిపోయినది. నేను లంక దహించునపుడు సీతను గాపాడనైతిని. మహా కార్యమునకుఁ బూని యందుఁ జాలభాగమును సాధించితిని. రామచంద్రుని కడ కరిగి తెలుపవలసినది యొకఁడే మిగిలి యున్నది. సీత కాలిపోవుటం జేసి శేషకార్యము ఫలింపనికత మున నిదియంతయుఁ జేయనట్లే యైనది. ఐన నేమి? నేఁ గోపము నకు వశ్యుఁడనై మఱచి యిప్పునినంతయుఁ బాడుచేసితిని. నిశ్చ యముగ సీత నశించియే యుండును. లంకయందుఁ గాలనిభాగ మొకఁడును గనుపట్టలేదు. పురమెల్ల భస్మమైనది. సీత నశించి

యేయున్న నేనిందే మృతినొందుట యుక్తముగ నుండును. అగ్నిం బడుదునా? పాతాళమున దుముకుదునా? సముద్రమునఁబడి యాదోబృందమునకు నాహార మగుదునా? కార్యమును రూపుమాపి బ్రదికి సుగ్రీవు నెట్లు చూడఁగలను? ఆ శ్రీరామసౌమిత్రుల నేమని దర్శింతును? నేను గోపమునొందిన దోషమువలన లంకను దహించి యూరకుండక యవివేకమునఁ దుంటరిపనులు చేయునదిగాఁ ద్రిలోకములఁ బ్రఖ్యాతిగాంచిన యీ వానరస్వభావము నే యందఱకుఁ దెలియఁజేసితిని. రక్షింపఁదగియుండియు నాతల్లిని గావనైతిని. నాయీ రాజస స్వభావము నశించుఁ గాక! సీత నశింపఁగా నది యెఱింగి యా రాజకుమారు లిరువురు నశింతురు. వారట్లు కాఁగా సకల బంధుయుతి సుగ్రీవుఁడు రూపఱు. భరతుఁడో సోదరప్రీతిగల వాఁడు. ఈవార్త వినఁగా నతఁడు శత్రుఘ్నునితో నీల్గును. ఇట్లు లాయిక్ష్వాకువంశము నశింపఁగనే ప్రజలు దుఃఖమునఁ బీడితులగుదురు. కావున నేను సకలవిధముల నవివేకుఁడ ననుచు విచారించెను.

ఇట్లు లాహనుమ చింతించుచుండఁగా ము న్నతనికిం దోఁచిన శుభనిమిత్తములే చక్కఁగాఁ దెలియునట్లు చూపట్టెను. అతఁ డంతట మనసులో నామంగళస్వరూపిణి సీత తన తేజమే తన్ను రక్షించుటం జేసి నశించియుండదు. అగ్ని యగ్నిని దహించునా? ఆమెయో శ్రీరాముని సాధ్వీమణి. పాతివ్రత్యసంరక్షిత. అట్టి జగన్మాత నగ్ని సమీపింపఁజాలఁడు. అగ్ని దాహశక్తి గలవాఁడు. అట్టియగ్ని నన్ను దహింపక యున్నదే. అది సీతారాములశక్తిచేఁ గలిగినదే కాని వేఱు

కారణమునఁ గాదు. భరతసౌమిత్రులకు దేవతయు శ్రీరాముని మనస్సంతోషకారిణియు నగు సీతాదేవి యెట్లు నశించును? దహించుటయే పనిగాఁ గలయగ్ని నాతోఁకనే కాల్పలేదే. సీత నెఁక నెట్లు దహించును? అని చింతించెను. అంత నతఁడు మైనాకపర్వతదర్శనమును స్మరించెను. సీత తన పాతివ్రత్యమున నగ్నినే దహింపఁగలుగును. అట్టిసాధ్వి నగ్ని యెట్లు స్పృశింపఁ గలఁడు? అని యూహించెను. ఇట్లతఁడు తలంచు చుండఁగా నంబరమునఁ జారణు లాడుకొనుమాటల నాలకించెను. ఔరా! హనుమంతుఁడు రక్షస్సౌధములను గాల్చి మహాకార్య మొనరించెను. స్త్రీబాలవృద్ధులు లోనుగా నెందఱో మడిసిరి. సీతమాత్రము కాలలేదు. ఇదియే యాశ్చర్యము. అను చారణులపలుకులు వినఁబడఁగా శుభనిమిత్తములచేతను, సీతాపాతివ్రత్యము రామప్రభావము లోనగు కారణములచేతను, చారణవాక్యములచేతను సీత నిరపాయస్థితిక్ సంతుష్టినొందెను. అంత నాదేవిం జూచి శ్రీరామునికడ కరుగఁదలంచెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గలవిశేషములఁ గనుంగొనఁ బ్రయత్నింతము. "నైజం గుణాం ముంచతి కిం పలాండుః" అన్నసూక్తి యందఱెఱుంగుదురు. ఎంతవారికిని నైజము వదలదు సకలశాస్త్రవేత్తయయ్యు నా హనుమంతుఁడు కపిస్వభావమును వదలక పరితపించెను. సీత నశించెననియు దాన శ్రీరామాదులు నశింతురనియు సుగ్రీవాదులు మరణింతురనియు నిశ్చయించెను. తన ప్రయత్నమంతయు

వ్యర్థ మైనదనియే భావించెను. తాను గిష్కింధ కరుగుటకంటె నిందే మృతినొందు టుత్తమమని నిశ్చయించుకొనియెను.

"ప్రాయస్సమాపన్న విపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అన్నసూక్తి యేనాఁటికిఁ దప్పదు గదా. ఈవిషయమునఁ బండితపామరులకు సమానపదవియే యొప్పినది. మఱి భేద మేమనఁగాఁ బండితులు తొలుతఁ గలంగినను మరలఁ దెలివిని దెచ్చుకొందురు. పామరు లదిలేక కూలుదురు. అనున్యాయమే యీభాగము మనకుఁ దెలుపుచున్నది. సత్కార్యమునకు,

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్."

అన్ననీతి ననుసరించి హనుమత్కార్యమును సంచరించు చారణులు పొగడిరి. సీత కుశలముగా నున్నట్లు తెలిపిరి. దాన నామతిమంతుఁడు ధైర్యముకలవాఁ డయ్యెను.

"ఇతి చింతయత స్తస్య నిమిత్తా న్యుపపేదిరే,
పూర్వ మప్యుపలబ్ధాని సాక్షా త్పునరచింతయత్." ౨౨

అని మూలము హనుమ యిట్లు పలువిధముల నగచుచుండఁగా శుభశకునములు అనఁగా దక్షిణాక్షి పరిస్పందనాదులు ఇంతకుముందు తా ననుభవమున నెఱింగినవి కనఁబడినవి. అదియే దైవబలమని యెఱుంగవలయును. మంచికార్యము నొనరించువారలకు మనశ్చింతలు పొడమును. కాని దైవ మేదోవిధమున వానిం దొలఁగించునని ప్రాజ్ఞు లందురు. అందుల కిదియే దృష్టాంతమని మనము గ్రహింపవలయును. శకునములు నిరర్థకములనియే యందురు. కాని యొకానొకప్పుడవియు ఫలించును. కావున వానిని దూలనాడరాదని మన

కీభాగము తెల్పుచున్నది. అవి కనఁబడఁగా నాచింతను మాని తత్త్వము నరయఁగల్గెను? సీతాపాతివ్రత్య రామప్రభావాదులు స్మృతిగోచరము లయ్యెను. ఇదియొకపా యుత్తమ ఫలము. దాని నవి యొసంగిన వని తేలినది. వేఁని మనము నమ్మమో యవియే యొకప్పుడు మనల నమ్మించును.

"శుశ్రావ హనుమాన్ వాక్యం చారణానాం మహాత్మనాం. 30
అహో ఖలు కృతం కర్మ దుష్కరం హి హనూమతా,
అగ్నిం విస్సృజ తాభీక్ష్ణం భీమం రాక్షసి వేశ్మని. 31
ప్రపలాయిత రక్షస్త్రీన బాలవృద్ధ సమాకులా,
జనకోలాహలాధ్మాతా క్రందతీ వాద్రికందరే. 32
దగ్ధే యంనగరీసర్వా సాట్ట ప్రాకారతోరణా,
జానకీ న చ దగ్ధేతి విస్మయో ఒద్భుత ఏవనః. 33
సనిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః,
ఋషివాక్యైశ్చ హనుమా నభవ త్ప్రీతమానసః. 34

అని మూలము ఋషివాక్యైః = అనఁగా చారణవాక్యముల చేతనని వ్యాఖ్య చేసిరి. ఆకాశసంచరణశీలు రగుమహర్షులని వారి భావము. చారణులను నొకతెగవారు దేవతలలోఁ గలరు. వారు వీరుగాదని యిరువురువ్యాఖ్యాతలు తెలిపిరి. న్యాయ్యమే యని యంగీకరింతము. దానిచే బాధయు లేదు. హనుమత్సంశయము నెఱింగి యద్దానిం దీర్చిన ట్లుండవలయు నని వారు మాటలాడుకొనిరని మన మెఱుంగవలయు. మహాత్ములపద్ధతియు నట్టిదే యగును "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అను సామెత కలదు కదా. తామాకార్యమునకు నానందించినట్లు,

హనుమకు సందియము గ్రుందినట్లు దాన నగునని వారి తలంపు లుండును. వారి సంభాషణములంబట్టియే హనుమకు మదిఁగలసందియము పాసెను. నిర్మలాంతఃకరణుఁ డయ్యెను. మనముకూడ సత్ప్రియత్నము లొనరింతుమే నపుడు కొన్ని పరితాపములు గలిగిన నవి భగవదనుగ్రహమున నేమూల ముననైన నశించును. కాని నిలువ వనువిశ్వాసము కలవార లము కావలయును. ఈవిషయమున నధ్యాత్మరామాయణ మున గ్రహింపఁదగినవిషయ మొక్కశ్లోకమునఁ గలదు.

"యన్నామసంస్మరణధూతసమస్తపాపా
స్తాపత్రయానల మపీహ తరంతి సద్యః,
తస్యైవ కిం రఘువరస్య విశిష్టదూత
స్సంతప్యతే కథ మసౌ ప్రకృతానలేన." ౪౦ సర్గము ౪.

తాపత్రయానలము శ్రీరామనామస్మరణమునఁ దొలంగినపు డామహాత్ముని ముఖ్యసేవకున కీసామాన్యాగ్ని యేమియపకా రము చేయఁగలఁడని భావసారము. తాపత్త్రయముల బాధ నడంచునది భగవదుపాసన. అది యనేకరూపముల నుండును. నిరతిశయభక్తిచే నిర్మలమనస్సుచే నామమును స్మరించినను జాలును. అవి రెండును లేక నామపారాయణముచేసిన నవి తొలంగవు. సార మెందున్నది నియతమానసమున నున్నది. తపోవ్రతములన్నియుఁ దదాధారమున నున్నవి. కొందఱకు ఫలమునిచ్చుట కొందఱ కీయకుండుటకుం గలకారణ మేమి. నియతమానసము కల్గుట లేకుండుట యనునవియే కారణ ములు. వేఱుకారణములు గానరావు అది కుదురుటకుఁ బ్రాక్సుకర్మమే కారణము. సర్వము కర్మాధారము. కర్మము

భగవత్స్వరూపము. దాని కదియే యాధారమని యెఱింగి మనముచేయు సత్కార్యములు మంచిమనస్సుతోఁ జేసినఁగాని ఫలింప వనునమ్మకము కలిగియుండవలెను. మనోబలమే బలముగాని దేహబలముకాదని మన మెఱుంగవలయును. ఆనిశ్చయము గలిగినచో మనప్రయత్నములు సంపూర్ణఫలదాయకము లగును. ఇదియే యిటఁ గలసారము.

## హనుమంతుఁడు సీత సెలవుగైకొని పయనముచేయుట.

* అంత నా వాయుకుమారుఁడు సీతాదేవిసన్నిధి కేఁగి యాదేవికిం బ్రణమిల్లి తల్లీ! నాయదృష్టవశమున నేమియు బాధకలుగకుండఁగా నుండు నిన్నుఁ జూడనోచితినని విన్నవించెను. ప్రయాణము సేయఁబూనియున్న యాభక్తాగ్రేసరుని గనుఁగొని యాదేవి యిట్లనియె. శత్రుసూదనా! ఈలంకయందుఁ గలమేటిరక్కసులం బొలియించి నన్ను రామునికడఁ జేర్చుటకు నీవొక్కఁడవే చాలుదువు. నీవు చూపినపౌరుషము నీకు శ్రేయస్సు నిచ్చునదియే. కాని శ్రీరామునకుఁ గాదు. పరవీరహంతయగు నారామభద్రుఁడే వచ్చి బాణాగ్నులఁ నీలంకయంతయు ధ్వంస మొనరించి నన్నుం గొనిపోవునే నదియే యామహాత్మునకుఁ దగియుండు. కావున నట్టులొనఁగూర్చుటకుఁ గారణము నీవే. మంచియత్న మొనరిం

* ఇత్యాది యేఁబదియాఱవసర్గమునఁ గల కథ యని యెఱుంగవలయు.

పుము. అని యాసీతాదేవి యర్థవంతములు సవినయములు నగు. సకారణములు నగుపలుకులు చెప్పఁగా విని హనుమం తుఁడు వానికి నుత్తరము చెప్పఁబూనెను.

తల్లీ ! యుద్ధమున శత్రువులం దునుము నా రాముఁడు వానరభల్లూకాపారసేనలం గూడి శీఘ్రము రాఁగలండు. అని పలికి పయనము సాగించువాఁడై నమస్కారము గావించి సెలవుగైకొని శ్రీరామునిం గాంచు కుతూహలమున నుప్పొం గుచు నరిష్టమనుకొండ నెక్కెను. అది చాల వర్ణనార్హమగు పర్వతము. దాని నెత్తములపైఁ గలపాషాణములపైఁ బాదము లుంచి త్రొక్కఁగా నవి భారమును భరియింపఁజాలక కొన్ని చూర్ణములై కొన్ని వ్రొర్లినవి. అట్లెక్కి సాగరము దక్షిణ భాగమునుండి యుత్తరభాగమునకుఁ బోవ నుద్యోగించి మేను పెంచెను. అట్లు పెంచి జలజంతుసంతానభయంకరం బగుసాగ రముం గాంచెను. ఉత్తరపుగట్టును జేరఁదలఁచి వాయువుం బోలె నాకాశమున కెగిరెను. పర్వతమును ద్రొక్కి యొక్కజవ మున నతఁడు లేవఁగాఁ బీడితమై యాకొండ మహాధ్వనితోఁ గ్రుంకినట్లైనది. ఆసందడిలో మహావృక్షములు విఱిగిపడినవి. గుహాలలోనుండు సింగములు హనుమపాదములం ద్రొక్కి కొండనుండి లేవఁగా నాపీడవలన భయంకరధ్వనులు చేయఁగా నాధ్వని యాకసమును బ్రద్దలుచేయుచందమున వినఁబడినది. అందుఁ గాపురముండు విద్యాధరసుందరులు కల వెలపాటొంది యందుండరాదని యాకాశమునకు నిర్గమించిరి. మహాసర్పములు గండోపలములు మీఁదఁ బడఁగాఁ జక్కల ములవలె ముడుచుకొని పొరలాడినవి. అత్తఱిఁ గిన్నరప్రభృ

తులు హనుమత్పీడితమగు నాకొండను విడిచి వియన్మార్గమున నుద్గమించిరి. హనుమంతుఁ డెగురుఁగాఁ గూడ నాకొండను మీఁదికెగసి మరలఁ గ్రిందఁబడి భూమికి సమమయ్యెను. పది యోజనముల వెడల్పును ముప్పదియోజనముల పొడవును గల యాయరిష్టపర్వతము దుర్దశలపా లయ్యెను. హనుమంతుఁ డత్తఱి నాకసమున నరుగఁబూనెను.

మహానీయులారా! యీభాగమున వివరింపవలసినది లేదు. ఒక్క విషయ మిందుఁగలదని తోఁచి వ్రాయఁదలంచితిని.

"సింహానాం నినదో భీమో నభో భిందన్ స శుశ్రువే,
స్రస్తవ్యావిద్ధవసనా వ్యాకులీకృత భూషణాః. ౨౯
విద్యాధర్య స్సముత్పేతు స్సహసా ధరణీధరాత్.
... ... ... ...
కిన్నరోరగ గంధర్వ యక్ష విద్యాధరా స్తథా. ౩౧
పీడితం తం నగవరం త్యక్త్వా గగనమాస్థితాః,"

అని మూలము. పాఠకమహాశయులు చక్కఁగాఁ బరిశీలింతురు గాక! రావణుఁ డత్యంతకాముకుఁడు. పరదారాసక్తుఁ డనికదా ప్రతీతి. అరిష్టపర్వతము లంకచెంత నుండు ననక తప్పదుగదా. దక్షిణపుటొడ్డున నున్నది. దానినెక్కి హనుమంతుఁడు సముద్రపుటుత్తరపుగట్టును జేరఁబోవఁ దలంచి యెగిరెను. ఆ పర్వతగుహాలలోనుండు విద్యాధరకాంతామణులు. కిన్నరాదులు ఆకొండను హనుమంతుఁడు త్రొక్కఁగా భయపడి దానినివదలి యాకసమున కెగసి రనికదా వాల్మీకిమహర్షి చెప్పెను. ఏలోకమునం దున్నను స్త్రీలను జెఱఁబట్టుచుండు

రావణాసురుఁడు లంకకడనుండు నరిష్టపర్వతగుహాలలోనుండు విద్యాధర సుందరీమణులను బలవంతముగా నెత్తుకొనిపోవ కుండఁ గారణ మేమని మీ రడుగుదు రేని రావణుఁడు కేవల కాముకుఁడు. మహాదురాత్ముఁడన్న పెద్ద లేమిసమాధానము చెప్పఁగలరో వినఁ గుతూహాలపడుచున్నాఁడను. ఆతఁడు భక్తుఁడు కాకయున్న, నందలిరాక్షసులు న్యాయైకవర్తనులు కాక కనఁబడినవారినెల్లఁ బట్టుకొనువారైన నాకొండగుహా లలో నిర్భయముగా నుండఁగల్గుదురా. యోజింపుఁడు. మహా క్రూరులగు నారాక్షసులు తమకు విరోధు లగుదేవతలం గాంచి నవ్వుచు నూరకయుందురా? ఆరాజ్యము న్యాయైకనిబ ద్ధమే. విరోధులం గెల్చుట రాజధర్మము. స్త్రీలను జెఱఁ బెట్టుట సనత్కుమారుని హితోపదేశానంతరము శ్రీరామావ తారము కొఱకనియు, సీతాదేవిం గొనిపోవుట మాతృ బుద్ధిచే ననియు శ్రీరామునిమూలముగ మరణ మెప్పుడు లభిం చునా యని వేచియుండువాఁడనియు మన మెఱుంగుటయే న్యాయ్యము. మఱియు దేవతాస్త్రీలను జెఱఁబెట్టెనని యున్నది కదా యందు రేమో ?

"అంగనాశత మాత్రం తు తం వ్రజంత మనువ్రజత్,
మహేంద్ర మివ పౌలస్త్యం దేవగంధర్వయోషితః. ౧౦
... ... ... ...
బహుమానాచ్చకామాచ్చ ప్రియాభార్యా స్త మన్వయుః." ౧౫

అని యీకాండమునందే కలదు. దీనిని బొమ్మిదవప్రకరణమునఁ జదివియే యుందురు. ఆతని గామించియే యున్నవారని యందుఁ గలదు. వీనిం బట్టిచూడఁగా నతఁడు స్వామ్యతిం గోరి

రామునిచే మృతినొందఁగోరి సీత నపహరించి తెచ్చెనని తోఁపకమానదని మన కీభాగము తెల్పుచున్నది. ఒకవేళ స్త్రీల నెందఱనో తెచ్చి తృప్తినొందినందున నీయరిష్టపర్వతముగ నున్నవారిని జూడకయుండె ననుదురేమో యీయుక్తి యెంతయుక్తముగ నున్నదో యని నిర్ణయించుభారమును బాఠకమహాశయులపై వదలెదను. ఈయుక్తి కాళయుక్తిలోఁ గలిసిన మేలని నే ననుచున్నాను. ఇఁక దయకాతి కెక్కడు బఠించి విషయసారముం గాంతము.

## హనుమ సంద్రమును దాఁటి తమవారిని గలిసికొనుట.

* హనుమంతుఁ డాకాశమునఁ బోవుచుఁ బెనువాక సంద్రమునుబోలెఁ దాను దాఁటెను. ఆగమనకాలమున నతఁ డాకసమును మ్రింగుచున్నట్లు, చంద్రమండలమును నఖంబుల స్పృశించువానిభంగి, నక్షత్రమండల సూర్యమండలాన్వితమగు నంబరమును హరించువానివిధమునను, మేఘమండలమును దనతోడఁదమ్మని యాకర్షించువానితీరునఁ దిసగుంటం బోయెను. హనుమ దేహకాంతి వ్యాపించుచుట్టుల మేఘములాయాఁరంగులుగలవిగా నుండెను. మేఘములఁ జొరఁబడుచు మరల వానినుండి వెడలుచునుండు చంద్రునివలె నాహనుమ గనంబడియెను. శ్వేతవస్త్రమును ధరించియున్న యావీరహనుమంతుఁడు మేఘములనుండి మార్గము చేసికొనిపోవు చుండఁగాఁ గొంతకాలము కనంబడుచుఁ గొంతసేపు కనంబడక

* ఇది యేఁబదియేడవసర్గమునఁ గల కథ.

చంద్రునివలె నుండెను. సింహనాదముచేయుచుఁ బోవుచుండ గరుత్మంతునివలె నుండెను. ఆహనుమ మైనాకమును మెల్లన స్పృశించి వీడుకొని జ్యాముక్తనారాచముభంగి నతిజవమునఁ బరుగిడెను. మైనాకు నతిక్రమించి కొంతదూర మరిగి మహేంద్రాచలమును గని సింహనాద మొనరించెను. ఆనాదము నానా దిక్కులఁ బ్రతిధ్వనింపఁ జేసెను. ఆవానరవీరుఁ డంగదాదు లుండుతావునకుఁ జెంతనుండుభాగమును జేరి సుహృద్దర్శన లాలసుఁడై పెనునాదముచేయుచు వాల మల్లార్చెను.

ఉత్తరపుగట్టున హనుమ దాగమనమును గోరుచున్న యంగదాదు లావాయుకుమారు సింహనాదమును నూరువేగ మును జక్కఁగా నాలకించిరి. ఏమివార్త వినఁబడెనో యని మనంబుల విన్ననై యుండు నాయంగదాదులందఱు మేఘ ధ్వనిం బురుడించు నాతనిసింహనాదము నాలకించిరి. ఆతని గురుతరకంఠనాదమును విని చెలికానిం గాంచఁగోరి త్వరపడు చుండిరి. వానరశ్రేష్ఠుండగు నాజాంబవంతుఁడు తత్కాలమున మనస్సునందుఁ బరమానంద ముప్పొంగ నందఱం బిలిచి యీ హనుమ సర్వప్రకారములఁ గార్యము పండించుకొనియే వచ్చుచున్నాఁడు. నిస్సంశయము. కృతార్థుఁడే కాక వచ్చునేని యీకంఠధ్వని యీరీతిగా నుండదు అని తెలిపెను. వానరు లందఱు త్తఱి నాహనుమంతుని బాహూరువులజవంబును బరి కించియు సింహనాదము నాలకించియు సంతసించి యందందు గం తులు వేయసాగిరి. పరమసంతుష్టులై వృక్షములనుండి వృక్షము లకు, శిఖరములనుండి శిఖరములకు నెగురుచునొకటిగాఁ జేరిరి. సంతోషమునఁ గొందఱు చెట్లపైనఁ గూరుచుండిరి. దూర

ముగా నుండువారిని వేగముగా రండని వస్త్రముల నాడించు
చందమున హనుమంతుని సత్వరమ రమ్మని చిఱుఁగొమ్మల నాడిం
చిరి. ఆతఁడు సింహనాదము గావించుచు రాఁగా వారెల్ల గజ
లులంబట్టి నిలిచియుండిరి. ఆహనుమయు వృక్షషండమండితంబగు
నామహేంద్రాద్రిపయి వ్రాలెను. సుహృద్దర్శనకుతూహలము మన
మున నుప్పొంగుచుండఁగా నొకరమణీయభాగమున వ్రాలెను.
వానరులందఱు నాతనిచుట్టు నిలిచి కొలిచియుండిరి. మహానంద
మున నోలలాడుచుండిరి. సాగరమును దాఁటి క్షేమముగ
వచ్చిన యాపవనతనయునకు ఫలములఁ దెచ్చి కానుక లొసం
గిరి. నగుమోములతనిం బూజించిరి. ఆతఁడు జాంబవదాదికపుం
వులకు వృద్ధులకు యువరాజనుభావమున నంగదునకు నమస్క
రించెను. ఎల్లరుఁ దన్ను బహూకరింపఁగాఁ గంటిని సీత నని
నిస్సంశయముగాఁ దెలిపి సంక్షేపముగా నావార్త చెప్పెను.
అంగదుని చేయిపట్టుకొని రమణీయమగు నొకచోట నా
మహేంద్రాద్రిఁ గూరుచుండెను. మహానందమున నంగదాదులం
గాంచి యశోకవనమున భయంకరరాక్షసాంగనలు కావలి
యుండఁగా నున్న యాయనిందితను జానకిని జూచితిని. ఆ
జనని కురులన్నియు నొకజడగాఁ గట్టఁగా శ్రీరామదర్శనో
త్సాహాతిరేకమున నుపవాసములఁ గృశించి జడలుదాల్చి శరీర
మును ధూళి మునుంగనున్నదని యర్థవంతము నష్టలోక
మానము నగునట్లు తెలుపఁగా దానిని విన్నయంతనే వానరు
లందఱు పట్టరానిసంతోషమున నొడలుమఱచిరి. కొందఱు
సింహనాదములఁ జేసిరి. మఱికొందఱు కలనాదములఁ గావిం
చిరి. కొందఱు వృషభేంద్రములం బోలి నిస్వనము గావించిరి.

జాతిస్వభావముగాఁ గిలకిలధ్వను లొనరించిరి. కొందఱు గర్జింపఁగా మఱికొందఱు వారికిబదులు గర్జించిరి. కొందఱు వాలములఁ బైకెత్తి నేలఁగొట్టిరి. కొందఱు మోదమునాపుకొనలేక కొండశిఖరములనుండి దుమికి యేనుంగువలెనున్న హనుమంతుని డాఁకిరి. సీతను జూచితినని హనుమంతుఁడు తెలుపఁగా నంగదుఁ డందఱిం జూచి మంచిమాటలతో హనుమంతా! విశాలసాగరమును దాఁటిపోయి మరల వచ్చితివి. కావున బల పరాక్రమములయందు నీకు సాటిచేయదగినవాఁడు లోకంబున నొక్కఁడును లేఁడు. నీస్వామిభక్తి ప్రశంసార్హము. ఔరా! నీవీర్యము! ధైర్యము! మాయదృష్టమున నీవు యశస్విని యగుశ్రీరామపత్నిని సీతాదేవిని జూచితివి. మాభాగ్యమున నింక శ్రీరాముఁడు దుఃఖమును బాసి సుఖముగా నుండఁగలఁడు. అనియెను.

అంత నాకోఁతులందఱు సమ్మదమున నంగద హనుమజ్జాంబవంతులఁ బరివేష్టించి గండోపలములపయిం గూరుచుండిరి. వారెల్ల హనుమ సాగరమును దాఁటుటయు లంకం జూచ్చుటయు సీతాదేవిని సందర్శించుటయు నను నీవృత్తాంతములం జక్కఁగా వినఁగోరి చేతులుజోడించి పావని మోము చూచుచుండిరి. అంగదుఁడు వానరోత్తము లెందఱో తన చుట్టు నుండఁగా దేవపరివేష్టితుండగు దేవేంద్రునిం బోలి ప్రకాశించుచుండెను. హనుమంతుఁడును వానరోత్తములం గూడి ప్రమోదమునఁ గూరుచుండి యామహేంద్రాద్రిని ప్రకాశింపఁజేయుచుండెను.

## హనుమంతుఁ డంగదాదులకుఁ దన ప్రయాణ వృత్తాంతము సర్వముఁ దెలుపుట.

* మహేంద్రాద్రియందుఁ బరమానందమున నంగదాదులుండఁగా జాంబవంతుఁ డావాయుసుతునిం గాంచి సీతావృత్తాంతమును బ్రశ్నింపఁ బూని వాయుకుమారా! సీత నెట్లు చూచితివి? ఆమె యం దెట్లున్నది? క్రూరరాక్షసుఁ డామె విషయమున నెట్లు వర్తించుచున్నాఁడు? ఈవృత్తాంతము జరిగినది జరిగినట్లు తెలుపుము. దీని నాలకించి మీఁదఁ జేయఁదగిన దెద్దియో నిశ్చయించుకొందము. మనము శ్రీరామునికడ కరిగినపుడు చెప్పఁదగినదేదియో దేనిని దాఁచి పెట్టవలయునో దాని నెల్ల సవిస్తరముగా మాకుం దెల్పుము. అని ప్రశ్నించెను. జాంబవంతుఁ డిట్లు ప్రశ్నింపఁగా హనుమ పులకితగాత్రుఁడై సీతాదేవికి వందనమాచరించి యిట్లు చెప్పందొడంగెను.

నేను బ్రమాదపడక సముద్రపు దక్షిణతటమును జేరి యాకసమున కెగిరితిని. ఇది మీరు చూచినదే కదా. నేఁ బోవుచుండఁగా మనోహరమగు బంగరుశిఖరము భయంకర విఘ్నముం బోలియుండెను గాని తుదకది యట్టిది గాదయ్యె. దానిం గంటిని. ఆపర్వతము త్రోవనడ్డగించి యుండినది గావున నాపయనమునకు విఘ్నము చేయవచ్చినట్లు తలంచితిని. నేనా పర్వతరాజమును జేరి దీనిం బగులఁగొట్టవలయునని యూహించితిని. సూర్యసంకాశమగు నాభూధరశిఖరమును వెసు వాలమునఁ గొట్టఁగా నది వేయిపఱియలుగాఁ బగిలినది. అది నా

* ఇది యేఁబదియెనిమిదవసర్గమునఁ గల కథ.

యుద్యమము నెఱింగి నన్నుఁ గుమారా! యని పిలిచి నాకు సంతసమును గల్గించుచు నేను నీతండ్రియగు వాయుదేవుని సఖుఁడను. నీకుఁ బిన్నతండ్రిని. మైనాకుఁడని నన్నుం బిలుతురు. సముద్రమున వసించుచుందునని యెఱుంగుము. కుమారా! పెనుఁగొండలకు మున్ను పక్షము లుండెను కాన నవి యిష్టానుసారము తిరుగుచు భూతములఁ బీడించుచు వచ్చినవి. అంత నింద్రుఁడు పర్వతంబుల దుశ్చరిత్రము విని వజ్రాయుధమున వానిపక్షముల ఖండించెను. వత్సా! నీతండ్రి వాయు వత్తఱి న న్నీసాగరమునఁ బడవైచి యాయాపదను దప్పించెను. కనుక నే నాతనివలన మహోపకారము నొందితిని. దానికిబదులుగా నతనిపుత్త్రుఁడ వగునీకు సాయముచేయవలయును గదా? నీకుమాత్రమే కాదు. ధార్మికవర్యుఁడు సత్యపరాక్రముఁడు నగు శ్రీరామునకు సాయము చేయవలసినవాఁడనే. నీవాతనిదూతవు గావున రెండుసంబంధములఁ బూజార్హుఁడవే యైతివి. అనఁగా విని నాకార్యముం దెలిపి పోవ నుద్యమించితిని. నాకనుమతి నొసంగెను. అది మానుష రూపమును విడిచి పర్వతాకారమున సాగరమున నుండెను.

నేను నంతవేగముగాఁ బయనము సాగించితిని. సర్పమాతయగు సురసాదేవిం గంటిని. ఆమె సాగరాంతరమున నన్నుం గని వానరా! దేవతలు నిన్ను నాకాహారముగా నేర్పఱచిరి. కావున భక్షింతును నాకు బహుకాలమునకు నీవు దొరకితి వనెను. ఆమాటలు విని దోసిలొగ్గి మ్రొక్కి దైన్యము కనఁబఱచుచు శ్రీరామవృత్తాంతమును దెలిపి నేను బోవుచున్నపని యిది యని తేటఁబఱచి తద్రాజ్యంబున నున్న

దానవు గాన శ్రీరామునకుఁ దోడుఁ డవలయును. దాని కొడంబడవేని సీతను గాంచి యామె కుశలవార్త నాతో మునకుం దెలిపి మరల వచ్చి నీకు భక్ష్యమయ్యెదను. ప్రమాణము చేసెదను. అని పలుక నాకామరూపిణి సమ్మతింపక నాకు దొరకినవాఁడు నన్నుఁగడచి యెక్కడైనఁ బోవఁజాలఁడు. ఇది నాకువరము. అని పదియోజనములపొడవుగల యామెనన చెప్పఁగనే నామేను పెంచితిని. ఆమె నాదేహప్రమాణమునకుఁ దగినట్లు నోరు తెఱచినది. అప్పుడే నామేను స్వల్పముగ నొనరించి నోటిలోఁజొచ్చి వెంటనే వెడలవచ్చితిని ఆమె తన రూపమును దాల్చి నన్నుంగని సౌమ్యా! సుఖముగాఁబోయి కార్యసిద్ధిఁబడసి రామునకు శుభవార్తం దెలుపుము. అని పొగడెను. భూతములన్నియు బాగుబాగని నన్నుఁ గొనియాడెను నేనంత మరలఁ బోవుచుండఁగా నాఛాయను జేతితోఁబట్టుకొన్నట్లు తెలిసినది. ఎది పట్టుకొనినదో నాకుఁ గనఁబడదయ్యెను. నావేగము తగ్గినది దెసలు కలయఁగాంచితిని. శోకించుచు జలములం గాంచితిని. అందొక రాక్షసాంగ భయంకరరూపిణి నాకుఁ గనఁబడియెను ఆమె వెడనవ్వు నవ్వి నాకాఁకలి యగుచున్నది. నీమహాకాయము నాకు మంచి యాహారమయ్యెను చాలకాలముగా నాహారము లేకయుండు నాకుఁ గావింపుము. అనియెను.

నేనందుల కంగీకరించి తద్వదనమునకన్నఁ బెద్దదిగా మేను పెంచితిని. అదియు నోరు పెంచెను. కాని నాశక్తి నెఱుఁగదయ్యె నేనపుడే యత్యంతసూక్ష్మశరీరుఁడనై దాని కడుపుఁ జొచ్చి గుండెకాయ భేదించి వెడలి యాకసమున

కెగసితిని. అది మృతినొందెను సిద్ధులు లోనగువారు సింహి
కను హనుమ చంపెనని చెప్పుకొనఁగా నాలకించితిని. ఆకార్య
ము నే తలంచుకొనుచుఁ జాలదూరముపోయి లంకకు సమీప
మున నున్న సాగరతీరమును గనినాఁడను. ప్రొద్దుక్రుంకఁగా
నేను రాక్షసులకుఁ దెలియకయుండ లంకం బ్రవేశించి
లోనికిం బోవుతఱి నొకస్త్రీ భయంకరాకారమున నట్టహాసము
చేయుచు ముందు నిలిచెను. ఎఱ్ఱనికేశములుగలిగిన యారక్క
సిని నే నెడమచేతిపిడికిటం బొడిచి గెలిచి లంకం జొచ్చితిని.
ఆరక్కసి భీతిల్లి వీరా! నేను లంకాపురిని. నన్ను గెలిచితివి
కావున నీఁక లంకలోనిరక్కసుల నశ్రమంబున గెలువఁగలవని
యెను. ఆరాత్రియంతయు సీతను వెదకితి? రావణాంతఃపుర
మంతయుం దిరిగి చూచితిని గాని యామె కనఁబడక
పోయెను. విచారించితిని. అంత నొకగృహారామము కనఁ
బడినది. దానిం జొచ్చి చూచితిని. అందుఁ బెద్ద శింశుపా
వృక్షము గలదు. దానిచెంత నే కాంతారత్నముం దిలకించితిని
రావణుఁ డెత్తుకొనిపోయిన నాఁటిపుట్టమునే కట్టుకొని విన్న
నై కుందుచుండెను. క్రూరరాక్షసాంగనలు చుట్టుకొని కావలి
యుండిరి. ఆమె దుఃఖించుచు భూశయ్యగా నుండుటఁ జూచి
తిని. ఆమె రావణునందుఁ జిత్తము పరమాణువంతయు లేనిదై
వానినిర్బంధమువలన మరణింపఁ దలంచియుండెను. ఆసాధ్వీ
మణిని జూచుచు నాచెట్టుమీఁదనే యుంటిని. అంత రావ
ణాంతరమునుండి స్త్రీలు వచ్చుచున్న జాడ వారి యాభరణ
నిస్వనములమూలమునఁ దెలియవచ్చెను. భయంపడి నారూప

మును మఱింత కొద్దిగాఁజేసికొని కొమ్మలసందున నణఁగి యుంటిని.

అంత రావణుఁడు తత్కాంతలు సీతకడకు వచ్చిరి. సీతాదేవి భయమున నవయవములు ముడుచుకొని యొదిగి కూరుచుండి యుండెను. అట్లు వడఁకుచున్న యాసీతను గాంచి రావణాసురుఁడు తలవాంచి నమస్కరించి నన్ను నన్నుఁగ తోఁ జూడుమని ప్రార్థించుచు నేవేవో యసంగతములుగా మాట లాడి భయపెట్టి రెండునెలలు గడువిచ్చితిని. ఆమీఁద నీవిట్లే యున్న నీరక్తమును ద్రాగెద ననెను. దురాత్మునిమాటలకుఁ గోపమునొంది యాసాధ్వి యుత్తమవాక్యముల రాక్షసాధమా! యని సంబోధించి యిట్లు బోధించెను. సాధ్విని, శ్రీరామపత్నిని, దశరథమహారాజుకోడలను. ఇట్టి నన్నుఁ బలుకరానిమాటలఁ బలికెదవే. న్యాయ్యమా. నీనాలుక తెగి పడకున్న దేల? పాపాత్మా! నాపతిలేనపుడు నన్నపహరించుకొని వచ్చితివి. దొంగవు గదా. నీవు రామునకు సాటిగావు. నీప్రతాపాదు లత్యల్పములు. అని పరుషములు నీతిదాయకములు నగువాక్కులఁ బలుకఁగా విని యారావణుఁడు కోపమున మండిపడి సీతను జంప నుద్యుక్తుఁ డయ్యెను. ఆతనిభార్య యడ్డము వచ్చి చంపవలదని యతని నిలిపెను. నాథా! నీవు పరాక్రమశాలివి. సీతతో నేమి? దేవకన్యకలతో విహరింపుము. అని యింపుగాఁ బలికెను. మరలి యతనిం దోడుకొనిపోయెను. ఆతఁడు పోయినపిమ్మట వికృతాకారలగు స్త్రీలందఱు సీతను బెదరించిరి. సీత పలుకకుండెను. కొంతసేపటి కందఱు నిద్రపోయిరి. సీత శోకించుచుండెను. త్రిజట యనునది లేచి సీతను భయ

పెట్టకుఁడు. ఆమె పతివ్రత. ఆమెకు హానిగలుగదు. రాక్షసులకు నాశముకలుగును.అట్టిదుస్స్వప్నము నాకుఁ దోఁచినది సీత నుండిమనకే భయముకలుగును. కావున మన మీామెను వేఁడుకొందమనియెను. సీత భర్తృవిజయమున కానందించి త్రిజట చెప్పినది సత్యమగు నేని నేను మిమ్ము రక్షించెద ననెను. నేనామె దురవస్థకు మిగులఁ జింతిల్లితిని. ఆమెతో మాటలాడంగోరి యిక్ష్వాకువంశమును వర్ణించితిని. అది విని యాసాధ్వి! నీవెవ్వఁడవని నన్నడిగెను. నావార్తనంతయుం దెలిపితిని. ఆమె విశ్వసించునట్టు లంగుళీయక మిచ్చితిని. దేవీ! నిన్ను నిపుడే శ్రీరాముని చెంతకుం గొనిపోయెదను. ఏమందువని యడిగితిని ఆమె యాలోచించి శ్రీరాముఁడే రావణుం జంపి నన్నుఁ గొనిపోయె నేని బాగుండును. అనఁగానే నమస్కరించి శ్రీరామున కానవాలేదే నిమ్మని యడిగితిని. ఆమెదుఃఖించుచు మణినొసంగి కొన్నివృత్తాంతములు తెలిపి త్వరితముగా రావలయునని చెప్పెను. నేను నమస్కరించి సెలవడుగ నామె తన దుస్థితిని దెలిపి రెండు నెలలలోపల రావలయునని శ్రీరామునకుఁ జెప్పుమా యనియె. ఆమె తనదురవస్థను దెలుపుచుండ నాకుఁ గోపమురాఁగా నాలోచించి వచ్చి మేను పెంచి యశోక వనమును బాడుచేసితిని. అచ్చటిస్త్రీలు రావణున కావార్తం దెలిపిరి. కింకరుల నాతఁడు పంప వారిం జంపితిని. చైత్యప్రాసాదమును జేరి యొక స్తంభమును బెకలించి యందుఁ గలరక్షకులం బొలియించితి. అంతలో మహారాక్షసులు వచ్చి నాచే మృతినొందిరి. మరల మంత్రిపుత్త్రులు వచ్చి హతులైరి. నేనా పతిపంచకము రాఁగా వారల రూపుమాపితిని. అక్షకుమారుని

బంపఁగా నాతని ద్రుంచితిని. అంత దుర్జయుఁడగు నింద్రజిత్తు మందోదరీపుత్త్రుఁడు వచ్చి యుద్ధముచేసి జయింపఁజాలక బ్రహ్మాస్త్రమున నన్ను బంధించెను. రక్కసులు నన్నుఁ గట్టివేసి రావణునికడకుఁ దీసికొనిపోయిరి. నాతో నతఁడు సంభాషించెను. నే నున్నదంతయుఁ జెప్పితిని. శ్రీరామసందేశమును గూడ నిర్భయముగాఁ దెల్పితిని సీతాపహరణము మొదలగు విషయములన్నియుం దెల్పి శ్రీరామాదులపరాక్రమము లుగ్గడించితిని. నామాటల కాగ్రహించి వధింప నాజ్ఞాపించెను. ఆతనితమ్ముఁడు బుద్ధిమంతుఁడు విభీషణుఁడు నాకొఱకు రావణుని వేఁడుకొని దూతవధ్యుఁడు కాఁడని శాస్త్రహితముగా బోధించెను. ఆమాటకు రావణుఁడు సమ్మతింజూపి యీదూత వాలమును గాల్చివేయుఁడని యానతిచ్చెను. రక్కసులు నా వాలమునకు గుడ్డలుచుట్టి నూనెలో ముంచి నిప్పంటించిరి. నన్నుఁ గొట్టుచుఁ బడికిళ్లఁ బొడుచుచుఁ బట్టణద్వారముకడకుఁ దీసికొనివచ్చిరి. అంత నారూప మల్పముగానొనరించి బంధముల వదలించుకొని మరలఁ బర్వతాకారమును ధరించి యందున్న యినుపగుదియం గొని వారలఁ బొలియించి వాలాగ్నిచే నగరమునంతయుఁ గాల్చి సీతను దలంచుకొని యామె కపాయము కలిగెనేమో యని సంశయించి నాకార్యమంతయు భంగమైనట్లు శోకించి యాకాశమునుండి చారణులు సీత కుశలముగా నున్నదని చెప్పుకొనఁగా నాలకించి శుభనిమిత్తములు నాకే తోఁపఁగా నామెకుశలమును నిశ్చయించితిని. నాతోఁక మండుచున్నను నాకేమియు బాధ కలుగలేదు మరల నేను సీతాదేవికడ కరిగి జరగినవార్తలం దెల్పి సెలవంది మిమ్ముం

పెట్టకుఁడు. ఆమె పతివ్రత. ఆమెకు హానిగలుగదు. రాక్షసులకు నాశముకలుగును.అట్టిదుస్స్వప్నము నాకుఁ దోఁచినది సీతనుండిమనకే భయముకలుగును. కావున మన మీామెను వేఁడుకొండమనియెను. సీత భర్తృవిజయమున కానందించి త్రిజట చెప్పినది సత్యమగునేని నేను మిమ్ము రక్షించెద ననెను. నేనామె దురవస్థకు మిగులఁ జింతిల్లితిని. ఆమెతో మాటలాడఁగోరి యిక్ష్వాకువంశమును వర్ణించితిని. అది విని యాసాధ్వి! నీవెవ్వఁడవని నన్నడిగెను. నావార్తనంతయుం దెలిపితిని. ఆమె విశ్వసించునట్టు లంగుళీయక మిచ్చితిని. దేవీ! నిన్ను నిపుడే శ్రీరాముని చెంతకుం గొనిపోయెదను. ఏమందువని యడిగితిని ఆమె యాలోచించి శ్రీరాముఁడే రావణుం జంపి నన్నుఁ గొనిపోయెనేని బాగుండును. అనఁగానే నమస్కరించి శ్రీరామున కానవాలేదే నిమ్మని యడిగితిని. ఆమెదుఃఖించుచు మణినొసంగి కొన్నివృత్తాంతములు తెలిపి త్వరితముగా రావలయునని చెప్పెను. నేను నమస్కరించి సెలవడుగ నామె తన దుస్థితిని దెలిపి రెండునెలలలోపల రావలయునని శ్రీరామునకుఁ జెప్పుమా యనియె. ఆమె తనదురవస్థను దెలుపుచుండ నాకుఁ గోపమురాఁగా నాలోచించి వచ్చి మేసుపెంచి యశోకవనమును బాడుచేసితిని. అచ్చటిస్త్రీలు రావణున కావార్తం దెలిపిరి. కింకరుల నాతఁడు పంప వారిం జంపితిని. చైత్యప్రాసాదమును జేరి యొకస్తంభమును బెకలించి యందుఁ గలరక్షకులం బొలియించితి. అంతలో మహారాక్షసులు వచ్చి నాచే మృతినొందిరి. మరల మంత్రిపుత్త్రులు వచ్చి హతులైరి. సేనాపతిపంచకము రాఁగా వారల రూపుమాపితిని. అక్షకుమారుని

బంపఁగా నాతని మ్రుందించితి. అంత దుర్జయుఁడగు నింద్రజిత్తు మందోదరీపుత్త్రుఁడు వచ్చి యుద్ధముచేసి జయింపఁజాలక బ్రహ్మాస్త్రమున నన్ను బంధించెను. రక్కసులు నన్నుఁ గట్టివేసి రావణునికడకుఁ దీసికొనిపోయిరి. నాతో నతఁడు సంభాషించెను. నే నున్నదంతయుఁ జెప్పితిని. శ్రీరామసందేశమును గూడ నిర్భయముగాఁ దెల్పితిని సీతాపహరణము మొదలగు విషయములన్నియుం దెల్పి శ్రీరామాదులపరాక్రమము లుగ్గడించితిని. నామాటల కాగ్రహించి వధింప నాజ్ఞాపించెను. ఆతనితమ్ముఁడు బుద్ధిమంతుఁడు విభీషణుఁడు నాకొఱకు రావణుని వేఁడుకొని దూతవధ్యుఁడు కాఁడని శాస్త్రహితముగా బోధించెను. ఆమాటకు రావణుఁడు సమ్మతింజూపి యీదూత వాలమును గాల్చివేయుఁడని యానతిచ్చెను. రక్కసులు నా వాలమునకు గుడ్డలుచుట్టి నూనెలో ముంచి నిప్పంటించిరి. నన్నుఁ గొట్టుచుఁ బడికిళ్లఁ బొడుచుచుఁ బట్టణద్వారముకడకుఁ దీసికొనివచ్చిరి. అంత నారూప మల్పముగానొనరించి బంధముల వదలించుకొని మరలఁ బర్వతాకారమును ధరించి యందున్న యినుపగుదియం గొని వారలఁ బొలియించి వాలాగ్నిచే నగరమునంతయుఁ గాల్చి సీతను దలంచుకొని యామె కపాయము కలిగనేమో యని సంశయించి నా కార్యమంతయు భంగమైనట్లు శోకించి యాకాశమునుండి చారణులు సీత కుశలముగా నున్నదని చెప్పుకొనఁగా నాలకించి శుభనిమిత్తములు నాకే తోఁపఁగా నామెకుశలమును నిశ్చయించితిని. నాతోఁక మండుచున్నను నాకేమియు బాధ కలుగలేదు మరల నేను సీతాదేవికడ కరిగి జరగినవార్తలం దెల్పి సెలవంది మిమ్ముం

జూడఁగోరి సాగరమును దాఁటివచ్చి యిందున్న మిమ్ముం గంటిని సుగ్రీవునికార్యమంతయు నొనరించితిని. ఇఁకఁ జేయఁ దగినదేదియో చేయవలయునని కోరెదనని యూరకుండెను.

మహాత్ములారా! ఇందలి విశేషాంశములం గనుఁగొందము.

"కృతా మే మనసా బుద్ధి ర్భేత్తవ్యోఽయం మయేతి చ,
ప్రహతం చ మయా తస్య లాంగూలేన మహాగిరేః. ౧౦
శిఖరం సూర్యసంకాశం వ్యశీర్యత సహస్రధా,
వ్యవసాయం చ తం బుద్ధ్వా సహోవాచ మహాగిరిః." ౧౧

అని మూలము. దీనియర్థము సంగ్రహముగ వ్రాసితిని గదా. ఈవిషయమే యింతకుంబూర్వము

"తమ ముత్థిత మసంగేన హనూమా నగ్రతస్థ్సితం. ౧౦౭
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః,
స త ముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః. ౧౦౮
ఉరసా పాతయామాస జీమూత మివ మారుతః,
స తదా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః. ౧౦౯
బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్ష చ ననంద చ,
తమాకాశగతం వీర మాకాశే సముపస్థితః. ౧౧౦
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిం,"

అని యీకాండమున మొదటిసర్గమునఁ గలదు. మైనాకుని ఱొమ్మునఁ దగిలెనని యిందుఁ గలయర్థము. హనుమ తాఁ దెల్పునపుడు వాలమున దానిం గొట్టితిని. దానిశిఖరము బ్రద్ద లయ్యెననియు మూలమునఁ గనఁబడును. తనపనిని దానే హను

మంతుఁడు చెప్పెను ఇంత భేదము కలదుగదా? ఏది నిజము? అను ప్రశ్నము గలదు. సమాధాన మెట్లు? వినుఁడు. ప్రాయికముగా నొక్కపనినే కాలభేదమునఁ దెలుపునపుడు మార్పుగనఁబడుట యరుదు గాదు. శ్రోతలను బట్టియు నవ్విషయ మించుక మార్పునొందింపఁ బడును. వాలముగల జంతువులకన్నింటికి నేకార్యము చేయఁబూనినను అది ప్రోత్సాహము గలిగించును. కావున వాల మెగురుచున్నఁగాని కార్యము చేయఁజాలవు. వానరులకు వాలమే ముఖ్యము. హనుమంతునకు మఱింత ముఖ్యము. వక్షస్స్థలమునఁ దగిలినపుడు తోఁకయు నెగురుచుఁ దగిలియుండును. కొన్ని పాషాణములు క్రిందఁబడి యుండవచ్చును. మహర్షి యపుడా విషయమును సంగ్రహముగాఁ జెప్పి హనుమంతునోట దాని నించుక విస్తరించి చెప్పించియుండవచ్చును. ఈ భేదము లోకజ్ఞానము గలవారల కంత తప్పుగాఁ దోఁపదు. ఆమహోత్సాహసమయమున హనుమంతుఁ డద్దానిని విస్తరించి చెప్పెనని మనము గ్రహింపవలయును. ఇట్లే సురసతో సంభాషించుట యిరువురు దేహమును బెంచుట యనువిషయమునందును గలభేదమునకును సమాధానమని యెఱుంగవలయును.

"కాంచనేన వికృష్టేన గృహోపవన ముత్తమమ్." ౫౩

అని మూలము. అశోకవనము రావణు నంతఃపురముచెంతఁ గలదు. గనుకనే గృహోపవనమని చెప్పఁబడినది. సీత యగ్నికాహుతియయ్యెనేమో యని చింతించుట సహేతుకమే అంతఃపురము దగ్ధమైనది. చెంతనున్న యుద్యానముకూడఁ గాలియుండును. అందున్న సీతకుంగూడ నపాయము కలిగి

యుండునని కదా సంశయించెను. అది యసంగతము కాక సుసంగతమే. లంకానగరనిర్మాణమును గుఱించి వ్రాయునపుడు గృహములంజుట్టి నిష్కుటము లుండునని వ్రాసితిని.

"స ప్రాణి సంఘాం స గృహాం స వృక్షాం
దగ్ధాం పురీం తాం సహసా సమీక్ష్య." 3౯ సర్గము. ౫౪

అనియు మూలమునఁ గలదు. సవృక్షాం లంకాంపురీమ్= అనఁగా నర్థమేమి ? గృహోద్యానవృక్షములనియే కదా. కను కనే ప్రతియింటికి నగ్నిని దరికొలుపవలసివచ్చెను. విభీషణుని గృహముకూడఁ గాలకుండుటకు నలుదెసల నిష్కుటము లుండుటయే గారణము.

"స్త్రీణాం మధ్యా త్సముత్పత్య తస్య భార్యా దురాత్మనః. ౭౫
వరా మందోదరీనామ తయా స ప్రతిషేధితః,"

అని మూలము.

"ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ. 3౯
పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్.
మయా క్రీడ మహారాజ! సీతయా కిం తవానయా." ౪౦
సర్గము ౨౨.

అని యున్నది. ఇది యెట్లు సరిపడునని ప్రశ్నము వేసికొని యిరువురిచేతను నిషేధింపఁబడియె ననుకొన్న బాధలేదని వ్యాఖ్యాతలు వ్రాసిరి. హనుమకు వారిపేరులు తెలియక యట్లు తెల్పియుండుననుకొన్నను బ్రమాదమేదియుఁ గానరాదు.

"తై ర్నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః,
ఋషివాక్యైశ్చ సిద్ధార్థై రభవం హృష్టమానసః." ౧౬౨

అని మూలము. ఋషివాక్యములు సిద్ధార్థములు. అనఁగా సిద్ధ ఫలములు గలవి.

"ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి."

అన్న వాక్యమున ననుసరించి వారివాక్కును దానియర్థము ననుస రించును. అనఁగా వారివాక్యము ఫలించును. వ్యర్థ మేనాఁటి కిని గాదు.

"ఋషిత్వమ్=అతీంద్రియార్థదర్శిత్వమ్,
మంత్రద్రష్టృత్వమ్, జ్ఞానసంసారపారగామిత్వమ్."

అని సర్వలక్షణసంగ్రహము.

ఋషతిప్రాప్నోతి సర్వాన్ మంత్రాన్ జ్ఞానేన పశ్యతి సంసార పారంవా ఇతి. జ్ఞానసంసారయోః పారగంతా, శాస్త్రకృదా చార్యః, సత్యవచాః, శాపాస్త్రః అని శబ్దకల్పద్రుమము. ఎవని మాట శాపానుగ్రహరూపముల ఫలించునో యతఁడు ఋషి. శపించిన నాశీర్వదించిన నిష్ఫలంబగు నేని యతఁడు ఋషి యెట్ల గును? శాస్త్రి, సోమయాజి, దీక్షితుఁడు అను మొదలగు నవి నామములుగా మాఱినట్టు లీకాలమున ఋషిశబ్దము కూడ నామవాచకముగా మార్పఁదగియున్నది. బిరుదముగా వాడుకఁ గాంచనున్నది. హనుమ ఋషివాక్యముల నమ్మెను. అవి సఫలములని యాతఁ డెఱుంగును నాటకమున నెల్లరకును బిరుదము లున్నయట్లు ఋషి మునిశబ్దములు బిరుదవాచక ములే యగును. ఎపుడు? వాక్కు ఫలింపనిచో. ఎవరిమాట ఫలింపక వ్యర్థము కాదో వారు ఋషులుగాని యందఱు ఋషులు కారని యీభాగము తెలుపుచున్నది.

## హనుమంతుఁడు ప్రయాణవార్తల నింకను దెల్పుట.

ఇట్లు హనుమ సీతాదర్శనవార్తను దెలిపి మరల దాని తరువాతిమాటను జెప్పువాఁడై యి ట్లనియె. సీతాదేవి మహాశీలవతి. సాధ్వీమణి. కావున శ్రీరామసుగ్రీవులయత్నములు సఫలము లగును. నామన స్సామెయందు భక్తిభరితమై యున్నది. రావణాసురుఁడు తపస్సంపద నన్నిలోకముల వహింపఁగలఁడు. కోపియైన నెల్లజగంబులఁ గాల్పఁగలఁడు. ఏప్రకారమునఁ దలంచినను రావణుఁడు మహాతపస్వి. సాధ్వీమణియగు సీతను స్పృశించినను దపోబలమున నశింపక యున్నాఁడు. సీతను జేత స్పృశించినయెడల నామెకోపాగ్నిం గాల్చున ట్లగ్నియుఁ గాల్పఁజాలఁడు. ఆమె భర్తచేత రావణునిఁ జంపింపవలయునని వీరపత్నీధర్మము నవలంబించి రావణుని పయి నాగ్రహింపకున్నది. కనుక నే జీవించి యతఁడుండఁ గల్గెను. మీకుఁ దెలిపిన కార్య మిట్లున్నది. కావున జాంబవదాదులను మిమ్ము నంగీకరింపఁ జేసి భృత్యజయము స్వామిజయమే కావున మీయనుజ్ఞ నొంది శ్రీసీతారాముల పదపద్మము లూని నేనే మరల లంకకుం బోయి సీతాదేవిని దీసికొని యామెతోఁగూడ శ్రీరామలక్ష్మణులం జూచుట యర్హమని నాభావము. నే నొక్కఁడనే. ఐనను లంకయందలి రాక్షసులను రావణుని వేగమున వధింపఁజాలుదును. ఇంక మీవంటిమహాశూరులతోఁ గూడియుండఁగా వారిం జంపుదునని చెప్పవలయునే? నే నొక్కఁడనే వారలం జంపఁజాలుదు. ఇంద్రజిత్తు

---

* ఇది యేఁబదితొమ్మిదవసర్గమునఁ గల కథ.

వైచు సకలాస్త్రములు నన్నేమియుఁ జేయఁజాలవు. మీరాజ్ఞ నొసంగుదురేని పౌరుషమున రావణుని వధించెదను. రణమున నేఁ గురియించు పాషాణవర్ష మమృతపానము చేసిన దేవతల నైనఁ జంపును. ఇఁక రాక్షసులమాట యేటికి? చెలియలికట్టను సాగరముదాఁటినను దాఁటును. మందరము చలించినను జలించును. ఎవ్వఁడుగాని జాంబవంతుని గంపింపఁ జేయఁజాలఁడు. సకలరాక్షసవీరులం జంప వాలిపుత్త్రుఁ డీయంగదుఁడే చాలును. పనస నీలుర యూరుజవమున మందర మూఁగులాడును ఇఁక రణమున రక్కసులు వీరిముందు నిలువఁగలరా? మైందద్వివిదులతో మార్కొనఁజాలువారు దేవతాదులలో లేరు. ఉన్నఁ జూపుఁడు. వీ రమృతము ద్రావిన మహాత్ములు. నేనే లంకను గాల్చి నీఱుచేసితిని నా పే రెల్లరకుం దెలియులాగునఁ జాటితిని. మహాసాధ్వి సీత యశోకమున రాక్షసాంగనలనడుమ దుఃఖించుచుండుటం దలంచుకొనిన నాకెంతో శోక ముదయించుచున్నది. శ్రీరామునియందే మది నిల్పియున్నది గదా? నహుషుఁడు బాధించినను శచీదేవిమనస్సు ఇంద్రుని వదలనట్లు రావణుఁ డెంత బాధించినను సీతచిత్తము శ్రీరాము నెడఁ బాయకున్నది. రావణుఁడెంత లాలించిన నిరర్థక మయ్యెనుఁ అట్టి మహాపతివ్రతను దీసికొనిపోక శ్రీరామునికడ కెట్లు పోనగును? నేను రామునిదూతనని నమ్మించి శ్రీరామోద్యోగము నంతయు నామెకుఁ దెలియఁజేసితిని. ఆమె రావణు నేల చంపరాదందురా? మహాపరాధియైన నాతని నామె చంపకుండుట కుంగారణ మాతఁడు మహానుభావుఁడు. ఆతనికి శాపమువలన దుర్మరణము కలుగదు. కాన వానిం జంపుటకు శ్రీరాముఁడే

నిమిత్తమాత్ర మగును. నిమిత్తకారణ మేమో సీతయే. ప్రతిపత్తునందుఁ జదువువానివిద్య కృశించునట్లు సీత కృశించి యున్నది. ఆమె దుఃఖమున మునిఁగి యున్నది. బరు లేమిచేయవలయునో దానినివదలక చేయుదురు గాక యని పలికెను.

మహాశయులారా! ఇం దనేకవిషయము లున్నవి. విమర్శింతము.

"తపసా ధారయే ల్లోకాన్ క్రుద్ధో వా నిర్దహే దపి,
సర్వ థాతిప్రవృద్ధోఽసౌ రావణో రాక్షసాధిపః. 3
తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితం,"

అని మూలము. ఇచ్చో నసంబద్ధముగా నీస్తుతి యేల? అని మనము ప్రశ్నించుకొనక తప్పదు. భక్తునకు భక్తునిశక్తియుఁ దపస్వికి ఋషిశక్తియుఁ దెలియునుగాని యితరుల కెట్లు తెలియును? భగవత్సహాయార్థమవతరించి మహాత్ములవలన దేవతలవలన వరములఁబడసి తపస్సంపన్నుఁడైన మహాత్ముఁడు. పరమశివభక్తుఁడు. శ్రీరామభక్తుఁడు పరమశివభక్తుఁ డెట్లయ్యెనని యెగిరిపడువారు గలరు.

"నానృగ్వేద వినీతస్య నాయజుర్వేదధారిణః,
నాసామవేదవిదుష శ్శక్య యేవం ప్రభాషితుం. ౨౮
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతం,
బహువ్యాహరతానేన న కించి దపశబ్దితం. ౨౯
న ముఖే నేత్రయో ర్వాపి లలాటే చ భ్రువో స్తదా,
అన్యే ష్వపిచ గాత్రేషు దోష స్సంవిదితః క్వచిత్. 30
అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతం,

ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే. 31

సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం,

ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీం. 32

అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా,

యస్య నారాధ్యతే చిత్త ముద్యతాసేరరేరపి." 33

కిష్కింధాకాం. 3 సర్గము.

అని శ్రీరాముఁడే హనుమంతుని జూడఁగనే లక్ష్మణునకుం దెల్పెను. శ్రీరాము నంతకుమున్న హనుమంతుఁ డెఱుంగఁడు కదా. వేదత్రయము వ్యాకరణము నెఱిఁగినప్రోఢ యని రామమూర్తియే పలికెను. అంతదనుక భక్తుఁడు గాకయుండి శ్రీరామదర్శనసంజనితజ్ఞానియని పలుక వలనుపడదు. జ్ఞానముచే శ్రీరాము నెఱింగెనందురేని సుగ్రీవునితో నావిధముపలుకక సన్న్యాసిరూపమున రానేల ? శ్రీరామునివాక్యములే స్తుతిపరము లందురేని "అనృతం నోక్తపూర్వం మే" యను శ్రీరామవాక్య మెగిరిపోవును. ఇంత జ్ఞానముకలవాఁడు భక్తుఁడుగాకయుండునా యని యోజింపవలసియే యుండును. శ్రీస్కాందపురాణమున హనుమంతుఁడు పరమ శివభక్తుఁడనియు కార్యార్థ మవతరించెననియు రుద్రాంశసంభూతుఁడనియు నున్నది. శివసహాయము విష్ణువునకు విష్ణుసహాయము శివునకుఁ గారణమునుబట్టి కలుగుచుండును. త్రిపురాసురసంహారమున విష్ణువు శివునకుఁ దోడుపడెను. ఈయవతారమున శివుఁడు విష్ణువునకుఁ దోడుపడెను. శివాంశసంజనితునివలనఁ జావఁదగినవారలను విష్ణువెట్లు చంపఁగలఁడు. తారకాసురు నేల చంపఁజాలక విష్ణుమూర్తి చక్రము వ్యర్థము కాఁగా కుమారస్వామి

నేల యాశ్రయించెను ? అంతమాత్రమున నొకరికంటె నొక రుత్కృష్టులనరాదు. కర్మసిద్ధాంతము వీరందఱకు శరణము ఎవరి వలన నెవరు చావవలయునో వారు వారిని జంపుదురు. ఆసన్ని వేశమే పరస్పరయోగమునకుఁ గారణమగుననుకొనిన నే శ్రమ ములు కలుగవు. అనవసరముగా దుర్మతాభిమానమూని దేవతాద్వేషము గలిగించుకొని యాముష్మికమును బాడుచేసి కొనఁగూడదనియే యట్టి యవివేకులకు హిత ముపదేశింప వలయును. ప్రకృత మనుసరింతము. హనుమంతుఁడు రావణుని మహాతపస్సంపన్నుఁడనియుఁ దపశ్శక్తిచే లోకత్రయమును ధరింపఁగలఁడని, ఆగ్రహించిన లోకములఁ గాల్పఁగలఁడని పొగడెను. ఏల ? రావణునిఁ గొలువునఁ జూచినపుడే మహా తేజశ్శాలి యని తలంచెను. మహాతపస్వి యని యూహించెను. అసత్యవాది కాఁడు. కావుననే తపస్వి యయ్యెను. తపస్సంప దయే లేకున్న సీతాసంస్పర్శమాత్రమున మండిపోకయుండునా? ఆమహాసంపద కలిగియుండినందున సీతాసంస్పర్శమునఁ జావక యున్నవాఁడని తేటపఱచెను. వీనిసార మేమి ? తపశ్శక్తి కలమికలవాఁడు జ్ఞానహీనుఁడు కాఁజాలఁడు. జ్ఞాని దురాచార రతుఁడు కాఁడు. రావణుఁడు వేదవేదాంగవేత్త. కారణాంత రమున విష్ణుద్వేషముగలవాఁ డయ్యెను అతఁ డదియెఱుంగు నని సనత్కుమారసంవాదమునఁ దేలెను. కనుక నీద్వేషము కల్పితము. రామునిచే మృతి యెపుడుకలుగునా యని యువ్వి ళ్లూరుచుండువాఁడు. కావుననే సీతాపహరణము గావించెను. మాతృబుద్ధిచే స్పృశించెను. దాన నామెయు నాగ్రహము

పామరులకుం గనఁబఱచెను. ఇది మన మెఱుంగఁదగినసారము. ఇపుడే రామాయణము పారాయణార్హ మగును లేకున్న గాయత్ర్యక్షరోపబృంహితము కావలసినకారణ మేమి? కావున మనము సాధుబుద్ధిచే నీయర్థమును గ్రహించి పఠించిన యెడల సమగ్రగ్రంథ ముత్తమోత్తమమని యేర్పడును. అందును సుందరకాండమునఁ గలకథయం దేమిమహత్త్వ మున్నదని యెన్నవచ్చును? తక్కినకాండములకంటె నదియే యుత్తమమని యేల పండితులుకూడఁ బఠించుచున్నారు? సీతాశోకము రావణదుర్భాషణాదులు కలదని యుత్తమమైనదియా? కాదు కాదు. ఇందే రావణుని హృదయధర్మము సీతాసేవాపరతంత్రత శ్రీరామాగమనవిషయకసంభ్రమము గలదు. హనుమ నగరమును గాల్చుచుండ నూరకయుండఁ గారణమేమి? యుద్ధకాండమున నొకగ్రుద్ధుచేత హనుమంతుని మూర్ఛ పుచ్చలేదా. అట్టివాఁడు కైలాస మూఁచినమేటి యేల యూరకుండెను. అట్లుండుట యెవరికేని నైజమగునా? మహాభక్తుఁడు గావున శ్రీరామసమాగమముకొఱకు కాచి యూరకుండెను. ఇట్టిభావములను మన కీఘట్టము బోధించుచున్నది.

"మయా తులా విసృష్టా హి శైలవృష్టి ర్నిరంతరా,
దేవా నపి రణే హన్యా త్కిం పున స్తా న్నిశాచరాన్." ౧౨

అని మూలము. అమర్త్యులు కదా దేవతలు. వారినే నా పాషాణవర్షము వధింపఁగలదని హనుమంతుఁ డనియె? ఇది యనృతము కాదా యందురేమో కాదు. మరణాభావత్వము శాశ్వతము కాదు. వారికి నాయుర్నిర్ణయము కలదు. మానవులకంటె నెక్కువకాలము జీవించుటయే వారియమరత్వ మను

నర్థ మెఱింగించుటకై యీవాక్యము మహాకవి యుపదేశించె నని మన మెఱుంగందగు

"అచింతయంతీ వైదేహీ రావణం బలదర్పితం,
పతివ్రతా చ సుశ్రోణీ అవష్టబ్ధా చ జానకీ. ౨౭
అనురక్తా హి వైదేహీ రామం సర్వాత్మనా శుభా,
అనన్యచిత్తా రామేణ పౌలోమీవ పురందరే." ౨౮

అని మూలము. జాంబవదాదులకు సీతాకష్టవార్తం దెలిపి ప్రోత్సహించుచున్నాఁడు. పరస్థలవాసము స్త్రీలకు మంచిది కాదనుభావము గలినదేమో యని సంశయించి ధర్మము నకుఁ బ్రాణము లర్పింపవలయునన్న సూక్తిని బ్రమాణముగఁ జేసికొని మన మిపుడే యుద్ధమున కరుగవలయునని వారలఁ బురికొలుపుచున్నవాఁడు. పూర్వము ధర్మపక్షమునకుఁ బ్రాణము లర్పింప మానవులే కాక వానరులు తక్కుంగల తిర్యగ్జంతువులు సిద్ధపడుచుండెడి వని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. ఈకాలము ధనపక్షమున సాయముచేయఁ బురికొలుపుచున్నది.

"నియత స్సముదాచారో భక్తి ర్భర్తరి చోత్తమా,
య న్న హంతి దశగ్రీవం స మహాత్మా కృతాగసం. 3౪
నిమిత్తమాత్రం రామస్తు వధే తస్య భవిష్యతి,
సా ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగాచ్చ కర్శితా. 3౫
ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా,"

అని మూలము. సీతయే రావణునిఁ జంపఁగూడదా యన్న ప్రశ్నము నుత్తరము చెప్పుచున్నాఁడు. అపరాధియైనను

శ్రీరామునిమూలమునఁ జంపింపఁదలఁచి యూరకున్నది. రామస్తు నిమిత్తమాత్రమ్. అని గోవిందరాజులు. నిమిత్తమాత్రం సీతా. తస్య వధేతు రామో భవిష్యతి యని మహేశ్వరతీర్థులు నన్వయించిరి. మన మిట్లు గ్రహింపవలయు. సీత తన్మృతికిఁ గారణమే. తద్వధమునందు శ్రీరాముఁడు కాఁగలఁడు. సీత తాను గారణభూతురాలయికర్మసిద్ధాంతము ననుసరించి రామునిమూలమున నతనికి మరణమును గల్పించుననియే యిందుఁ గలసారము. ఇచ్చోట మహర్షి మనకొకధర్మము నుపదేశించుచున్నాఁడు. ప్రతిపత్తునందుఁ బఠించిన వానివిద్య క్షీణించునట్లు సీత చిక్కియున్నదని. అనధ్యాయములలోఁ బ్రతిపత్తుకూడ నొకటి. పున్నమ యమవస. అష్టమీ చతుర్దశీతిథులు ప్రతిపత్తు. ఇది సామాన్యానధ్యాయములు. తఱచుగా వీనియందు వేదశాస్త్రపాఠములు చెప్పరు. ఇన్నింటికంటెఁ బ్రతిపత్తును బేర్కొనుటేల? మనస్తత్త్వాధిపతి చంద్రుఁడు. పున్నమనాఁడు సంపూర్ణకళాశోభితాంగుఁడగును. అమవసయందు స్వరూపమాత్రమున నుండు. "సలిలమయే శశిని" అన్న ప్రమాణమునుబట్టి చంద్రశరీరము జలమయము. అమవసయందు రవికిరణము లాగోళమున వ్యాపింపవు గాన నీలశరీరుఁడగుట దృగ్గోచరుఁడు కాఁడు. పున్నమనాఁడు సంపూర్ణకళాశోభితాంగుఁడగును. ప్రతిపత్తునందు శుక్లపక్షమున రవికిరణస్పర్శము చాల కొంచెము. స్వరూపస్థితియు లేదు. ప్రకాశస్థితియు లేదు కృష్ణప్రతిపత్తునందు కళామాత్రహీనుఁడగును. అనఁగా క్షీణ మారంభమగును. క్షీణత్వారంభము దుఃఖహేతువు కావునఁ బ్రతిపత్తు

విద్యాపారమునకు నిషేధింపఁబడినదని కొంద అందురు. కొంత దనుక నది యుక్తముగనే కనఁబడుచున్నది.

## జాంబవంతుఁడు రామునొద్దకుఁ బోవఁ బురికొలుపుట.

* ఇవ్విధమున నాంజనేయుఁడు తెలిపినహితము నాలకించి వాలికుమారుఁ డందుల కంగీకరించి వానరులం గాంచి మనము సీతాకుశలవార్త నెఱింగియు నామెను దీసికొనక శ్రీరామునికడ కరుగుట యుక్తము కాదు. మీరలు పరాక్రమశాలురని విఖ్యాతి గాంచినవారు. ఇత్తఱి సీతాదేవిని గంటిమి. కాని యిచ్చటికిఁ బిలుచుకొనిరాలేదని శ్రీరాముని దగ్గఱ వచించు టంతయుక్తముకాదని నాకుఁ దోఁచెడు. దేవతలందుఁగాని దైత్యులయందుఁగాని సమస్తలోకములందు నిట్లు వియద్వీధి కెగిరిపోవుటయందు మనకు సమానులెవ్వరును లేరు. పరాక్రమమునందుమాత్రము సమానుఁడు గలఁడా? మన వాయునందనుఁడు రాక్షసవీరుల వధించినవెనుక మనకింకఁ గర్తవ్య మేమున్నది? జానకిం బిలుచుకొనిపోవుదమని స్వాభిప్రాయము నెల్లరమనంబులకు నుల్లాసముం బుట్టింపఁ దెలిపెను.

జాంబవంతుఁడు కార్యముల తీ రెఱింగినవాఁడు. కాఁబట్టి యంగదునితలం పట్టులుండు టెఱింగి సంతుష్టుఁడయి యర్థవిశేషభూషిత మగువాక్యమున నతనితో ని ట్లనియె. రాజకుమారా! తమ రూహించినదంతయు యుక్తమనియే మాకెల్లరకుఁ దోఁచుచున్నది. కాని మన మెట్టికార్యముల

* ఇది యఱువదియవసర్గమునఁ గల కథ.

నొనరింప సమర్థులమైనను శ్రీరామునాజ్ఞ ననుసరించియే కదా మెలంగవలయును. కావున నామహాత్ము నాశయమెట్టిదో తెలిసికొని యట్లే యీకార్యమును జక్కఁగా ఫలింపఁజేయుటకుఁ దలంపుము. ఇది నాకుఁ దోఁచినతలం పని తన యాశయము నెల్లరు విన నంగదునిసన్నిధి విన్నవించి యూరకుండెను.

మహాత్ములారా! యిందు విశేషము లెవ్వియు లేవుగాని యొక్కవిషయము చర్చింపందగియున్నది. వానరబుద్ధి చపల మని విందుము కదా. సీతాదేవి హనుమంతునితో శ్రీరాముఁడు రావణునివధించి నన్నుఁ దోడ్కొనిపోవుట యశస్కర మని రెండుమూఁడువిధములం దెలిపెను. అందులకు వాయుకుమారుఁడు మెచ్చుకొని శ్రీరామునిపత్నివగు నీకిది తగినదే యని పొగడెను. ఆహనుమయే యంగదాదులం గాంచినపుడా మెం దీసికొనిపోవుదమని తెలిపెను. వయసునఁ జిన్నవాఁడు గావున నెంతవీరుఁడైన నెంతబుద్ధివిభవము గలవాఁడైన నది యుక్తమే యని యంగీకరించి తమవారలకుం దెలిపెను. దీనిం బట్టిచూడఁగా స్వభావము మార్పునొందుట కష్టమని తోఁచెడు. వానరములలో నెంత కెక్కపెట్టినను జాంబవంతుఁడు భల్లూకజాతికిం జేరినవాఁడు. మఱియు లోకానుభవముకలవాఁడు. వయస్సు చెల్లినవాఁడు. కష్టసుఖముల నాఱితేఱినవాఁడు. కావున హనుమదంగదుల యాశయము నెఱింగి రాఁగలకీడు నెఱింగి శ్రీరాము నానతినెఱింగి మనము మెలంగుట తెలుంగని యెఱింగించెను. బుద్ధిబల మెంతయున్నను విద్యాబల మెంతయున్నను లోకానుభవము లేనిచో నవి యొక్కతఱిఁ గొన్నియిక్కట్టులఁ దెచ్చిపెట్టునని తేలెడిని.

కావున మతి విద్యాబలములకుఁ దోడు లోకానుభవము కూడిన మిక్కిలి ప్రకాశించునని మనకీభాగము బోధించెడిని.

## మధువనమున వానరులు ప్రవేశించుట.

* అంత నాజాంబవంతుఁడు చెప్పినహితము నంగదాదు లేకగ్రీవముగా నంగీకరించిరి వానరు లాయాంజనేయుని ముందిడుకొని మహేంద్రాద్రిని వదలి మేరుమందరాద్రులా యనునట్లు రూపము లొప్పార మదగజములరీతిని బైకెగురు చుం బోవసాగిరి. మహాత్ముఁడగు నాయంజనాత్మజుని తెప్పలిడక చూచుచుఁ బోయిరి సఫలమనోరథులగుట నాసీతాకుశల వార్తం దెలుపఁ గుతూహలము నొందుచు యుద్ధకాంక్షులు మనంబులఁ బెనంగొనఁ దమయౌన్నత్యమును బ్రకటించు కొనుచుఁ బోయిరి. శ్రీరామునకుఁ బ్రత్యుపకృతి చేయుతలం పుల నామహేంద్రాచలమును వదలిరి వానరుల ట్లాకాశ మార్గమునఁ బోవుచుఁ ద్రోవనడుమ నొకవనంబు గన్పట్టి నందు దిగిరి. ఆవనము నానావిధలతాభూరుహానిబిడంబై నందన వనమును బురుడించుచుండెను. దానికి మధువనమని పేరు గలదు. సుగ్రీవపరిపాలితమై యది యేభూతమునకేని దేరి చూడ శక్యముగాక యుండెను. మనోహరమగు నావనమును సుగ్రీవుని మేనమామ దధిముఖుఁడు సర్వకాలము కాపాడు చుండును. అట్టి మహావనమును హనుమదాదులు చేరి యందలి మధువును ద్రావ నుత్సాహముగలవార లైరి. తేనెరంగుగల వానరులు మధువనమును బరికించి సంతుష్టులై యువరాజుకడ

* ఇది యఱువదొకఁడవసర్గమునఁ గల కథ.

కరిగి మాకుఁ దేనియఁద్రావఁ గుతూహలము కలదు. అనుజ్ఞ యీవలయునని ప్రార్థించిరి. అంగదుఁడు జాంబవత్ప్రముఖ వృద్ధులయనుమతిం గొని వానరుల మధువుం ద్రావుండని పల్కెను.

వారు సీతాదర్శనవార్త విన్నప్పటినుండి యుబ్బుచుండువారు గాన నంగదునాజ్ఞ రాఁగానే మఱింతయుబ్బుచు నర్తనము చేయసాగిరి కొంద ఱాయుత్సాహమునఁ బాడిరి. కొందఱు తలక్రిందుగాఁ బడిరి. కొందఱు స్వేచ్ఛగా నాడిరి. కొందఱు నవ్విరి. కాళ్లు పైకెత్తి వెల్లకిలం బడిరి పరుగెత్తిరి. వానరస్వభావముల ననేకచర్యలఁ జేయఁజాలిరి. ఒక చెట్టునుండి యొక చెట్టునకుఁ బరుగెత్తిరి వృక్షాగ్రమునుండి క్రిందికిఁ గొందఱు దుమికిరి. క్రిందినుండి యొక్కగంతునఁ జెట్లకొనల కెగఁబ్రాఁకిరి. ఒకఁడు పాడఁగా నొకఁడు వానిమీఁదఁ బడెను. ఒకఁ డేడ్వఁగా నొకఁడు వానిని ద్రోయుచు మీఁదఁ బడెను. ఇరువురు త్రోసికొనుచుండఁగా వేఱొకఁడు వారిపైఁ బడియెను విస్తారముగాఁ దేనియలు త్రాగి మత్తిల్లి వారు వికారపుఁజేష్టలు చేయుచుండిరి. మత్తుగొననివాఁ డందు లేఁడన వచ్చును.

ఆవనపాలకుఁ డగుదధిముఖుఁ డట్లు తేనెలు త్రాపుట లతాదులను బాడొనరించుట చూచి యాగ్రహము నొంది వారిని నివారించెను. ఆతఁడు వృద్ధుఁడు. వారు మత్తుగొని తనమాటలఁ బాటింపక తిరస్కరించుచుండుటం గాంచి వారిని దఱుమఁగొట్ట నుద్యుక్తుఁ డయ్యెను పరుషవాక్కులఁ గొంద ఱిని, మంచిమాటలఁ గొందఱిని నివారించెను. వారందఱు

గుంపుగాఁగూడి యతనిం జుట్టుకొని జంకుమాని తిరస్కరించు టయే గాక తమపని మంచిదిగాదనియైనఁ దలంపక పట్టుకొని యీడ్చిరి. ఆతని గోళ్లంగీలుచుఁ బండ్లఁ జేఁ గొలుకుచుఁ గర పాదతలములఁ గొట్టుచు నిష్టముకొలఁదిఁ దేనెలుత్రావి ఫలము లం దిని యవి లేకుండఁ జేసిరి.

మతిమంతులారా! ఇందొక్కవిషయము గలదు. దానిం దెలిపెదను. పూర్వకాలమున రాజు లుపవనముల నిర్మించుట వానింగాపాడుట యాచారముగాఁ గలవారు. ఆవనములు సర్వర్తు పల్లవముకుళపుష్పఫల సమృద్ధములుగా నుండును. లతావిశేషము లందుండును. దేశసంరక్షణ మెట్లో యారామ సంరక్షణ మట్టిదిగా వారు భావించువారు. తరులతాదుల మహత్త్వము వారెఱుంగుదురు. అట్టియుపవనములు కేవల విహారార్థములు కాక యాయుర్వృద్ధ్యర్థమై సేవింపఁబడుచుం డెను. ఆ యుపవనవాయువులు రోగనివృత్తిక్షమములని యెల్ల రెఱుఁగఁదగినవిషయము. దేశాంతరములనుండియుఁ బర్వ తాంతరములనుండియు నోషధులం దెప్పించి తరువిశేషముల రప్పించియు నందు స్థాపించిపోషించుట రాజకార్యములలో నొకటి. అం దనేకపక్షులు జంతువు లుండును. వానినుండి ప్రసరించువాయువు ఆరోగ్యప్రదమని యోషధిప్రభావజ్ఞులు తెలుపుచుందురు. ఒకతీవపైనుండి గాలివచ్చిన సర్పము ప్రాణ ములం బాయును ఆసమీపమున సర్పము లుండవు ఇట్లే యొక్కొక్కయోషధి కొక్కొక్కగుణము గలదు. తుంగ ముస్తలు గలతావులం జేరి వానినడుమఁ గూరుచున్నచో శోకరోగము నివర్తించునని శాస్త్రము గాక యనుభవమునం

జెప్పవచ్చును. కావుననే భూపతి యుపవననిర్మాణనిరతుఁడు కావలయుననెడి యాచారము పూర్వకాలమున నుండెడిది. అందలి తేనె లోనగువస్తువులు తెచ్చి విక్రయించి ధనమార్జించుట యాకాలమున నాచారము కాదు. లోకోపకారమునకే కాని ధనార్జనముకొఱకుగా నవి స్థాపింపఁబడకుండెను. ప్రతి రాజ్యమునకు నలంకారముగా నుపవనపంక్తి రక్షింపఁబడుచుండెడిది. ఆయాచారము ననుసరించియే సుగ్రీవుఁడా ధ్యానమును రక్షించుచుండెను. దానియం దెవరును బ్రవేశింప భయపడుచుండుటం జేసియే సుగ్రీవాజ్ఞ యనుమాట ప్రసిద్ధమయ్యెను. తరులతామహత్త్వ మిటీవల నశించిన ట్లుండెను. కాని యీశ్వరానుగ్రహమున నవనాగరికశిఖామణులలోఁ గొందఱు నాస్తికాభాసులకు బుద్ధిగఱప నెంచి కాఁబోలు మహాత్ములు లతావిశేషములమూలమున వృద్ధులను వయఃస్ఫురితులఁగాఁ జేయుచున్నారు. ఇఁకనైన మనము బుద్ధిగలిగి లతాతరుమహత్త్వముల నెఱింగి యాయురారోగ్యములఁ గాపాడుకొనఁ బ్రయత్నింపవలయును.

## దధిముఖుఁడు వానరుల దుర్వర్తనమును దెల్ప సుగ్రీవునికడ కరుగుట.

* హనుమంతుఁ డంత దధిముఖునిమాటలచేఁ గలంగిన వానరులం గని వనచరులారా! మనంబులఁ గలంకమాని తేనెలంద్రావుఁడు. మీ కడ్డుపడువారిని నే నాపెద నదఁగా విని యంగదుఁడు నిర్మలాంతఃకరణుఁడై వానరు లిష్టమువచ్చినరీతిని

* ఇది యఱువదిరెండవసర్గమునఁ గల కథ.

మధువును ద్రాగుదురు గాక! మన పూనినకార్యమును వాయు తనయుఁడు సాధించెను ఇపుడాతఁడు కార్యమును జేయవల సినదన్నను దప్పక నే నాచరింపవలసినదే. ఇఁక మంచి చేయు మన్నపుడు చెప్పవలయునా. యని యానతిచ్చెను. వానరు లామాట యంగదునినోటినుండి రాఁగానే మిక్కిలి సంతుష్టులై మేలు మేలని యానతిం గొండాడిరి. ప్రవాహము వేగముగా వృక్షమును బడఁగొట్టునట్లు గుంపులుగాఁ గూడి యా మధు వనముపయిం బడిరి. నైజవీర్యము నంగదు నుత్తరువు నను వానివలన నందుండురక్షకుల నవతలఁ బడఁద్రోచి మధువును ద్రావి రసవంతము లగుఫలముల భక్షించిరి. తమ్ము నివారింప నరుదెంచి వనచరులం జావఁగొట్టిరి. తేనెపట్టులం జేతులంబట్టు కొని తూములకొలంది త్రాగుచుండిరి. మఱికొందఱు త్రాగి మిగిలిన తెట్టెలఁ ద్రెంపి పాఱవైచిరి. తెట్టెలతోఁ గొందఱు కొట్టుకొనసాగిరి. కొట్టుకొనుచు లేచుచుం గొందఱు పోవు చుండిరి. పోవఁజాలని కొంద అందే శయనించియుండి మత్తు వృద్ధికాఁగా వెఱ్ఱియెత్తినట్లు సంతోషము మితిమీఱఁగా నొకరినొకరు పడఁద్రోసిరి. నడువఁజాలక తొట్రుపడుచుండిరి. సింహానాదములు గావించువారును, బక్షులవలెఁ గూయువా రునుగాఁ గొంద అుండిరి. కొందఱు నేలంబడి నిదురించిరి. గ్రామ్యకార్యములఁ గొంద ఱొనరించిరి. కొంద ఱట్టికార్య ములఁజేసి యితరులకుం జెప్పిరి.

ఆ వనపాలకులందఱు వానరులు మోఁదఁగాఁ బాఱి పోయిరి. పాఱిపోవువారిని నిలిపి వనచరులు మోకాళ్లుపట్టు కొని పైకెత్తి యపానద్వారమును జూపఁగా వారు దధి

ముఖునికడకుఁ బోయి తమకుఁ బాటిల్లినయవస్థను దెలుపు కొనిరి. ఆతఁ డావనమంతయుఁ బాడగుట కాగ్రహించి వారిం బిలుచుకొని వారింతము రండని పురికొలుపుచు నాశ్వాసించెను. ఎల్లరు వనమున కరిగిరి. దధిముఖుఁ డొకవృక్షమును బెకలించి పట్టుకొని వారిపైకేఁ బోయెను. పరిజనులు వెంబడించిరి. పాషాణాదులంబట్టుకొని కొంద అంగదాదు లున్నయెడ కరిగిరి. వృక్షాగ్రముల నున్నవారిని గ్రిందనున్నవారిని దల పడిరి. హనుమదాదు లట్లు దధిముఖాదులు కోపమున రాఁగాఁ జూచి వారిని దలపడిరి. దధిముఖుని వృక్షహస్తుని గని యంగదుఁడు రెండుచేతులం బ్రహరించెను. అతఁడు మదాంధుఁడై యుండుటంజేసి మామ యని తాత యని యెఱుంగఁడయ్యె. మఱియు నాదధిముఖుని బడఁద్రోసి నలిపి విడిచెను. వాఁడు రక్తసిక్తాంగుఁడై మూర్ఛ మునిఁగెను. మూర్ఛనుండి తెలిసి మహాగ్రహమున వానరుల దండముగొని వారించెను. అంత నెట్లో తప్పించుకొని యాదధిముఖుఁ డొకయేకాంతస్థలమును జేరి యచ్చటికివచ్చిన భృత్యులం గని వీరిట్లే పడియుందురుగాక! మనము సుగ్రీవునికడకుం బోయి యంగదునిదే యీదోషమంతయు నని తెలుపుచెను. ప్రియమగు నీయుద్యానమును బాడు చేసినందులకు మరణదండనము విధించును. వీరినెల్ల వధించును. మనకోరిక ఫలించును. అని తెలిపి వారలం గూడి సుగ్రీవుని కడకుం బోయెను. ఆతఁ డట్లరిగి శ్రీరామలక్ష్మణులను సుగ్రీవుని జూచి యాకసమునుండి సమభూమిపయి వ్రాలెను. దీనవదనుఁడై శిరమునఁ జేదోయి బంధించి సుగ్రీవుని చరణములు సోఁక నమస్కరించెను.

## వానరులను దోడితెమ్మని దధిముఖునకు సుగ్రీవుఁ డానతిచ్చుట.

* ఇట్లు మ్రొక్కి లేవకున్న దధిముఖునిఁ గాంచి యతఁ డిట్లేల చేసెనో యని భయముగొని యతనితో లెమ్ము లెమ్ము. ఏల యడుగులపయిం బడితివి? అభయ మిచ్చితిని. జరగిన వార్తలం దెల్పుము. అని యడిగెను. సుగ్రీవుఁ డభయం బొసంగుటవలన విశ్వాసమునొంది దధిముఖుఁడు లేచి రాజా! నీతండ్రి ఋక్షరజుఁడుగాని నీయన్న వాలిగాని నీవుగాని యింతదనుక నెప్పుడే మధువనమును యథేష్టముగా ననుభవింప నెవరిని విడిచినదియే లేదు. అట్టివనమును నేఁటికి వానరులు వచ్చి ధ్వంసము గావించిరి. వనపాలకులు పోయి యెంత బెదరించినను లెక్కసేయక ఫలములను దేనియలను గొల్లఁగొట్టుచున్నారు. తేనియలఁ గొందఱు పాడుచేయుచున్నారు. వారు వీరికిఁ గల్గించినబాధలు అవమానకరకార్యములు చెప్ప వలను పడదు. వనము పాడయ్యెను. అని విన్నవించెను. ఇట్లతఁడు సుగ్రీవునితో మనవిచేయుచుండఁగా మహాప్రాజ్ఞుఁ డగు సౌమిత్రి దధిముఖుం గూర్చి సుగ్రీవునితో వానరేంద్రా! యీతఁ డేలవచ్చినాఁడు? దుఃఖితుఁడై యేమి విన్నవించుచున్నాఁడు? అని యడిగెను

ఆమాటల నాలకించి సుగ్రీవుఁడు ఆర్యా! వీరుఁడగు నీదధిముఖుఁడు దక్షిణమునుండి వచ్చిన యంగదాదివానర వీరులు మధువనమునఁ గలమధువును ద్రావిరని చెప్పుచున్నాఁ

* ఇది యఱువదిమూఁడవసర్గమునఁ గల కథ.

డు. వారువచ్చి మధువును ద్రావి వనమును బాడుచేసిరి గదా. కార్యసఫలత్వము నొందకుండిన నిట్టిపని చేయుదురా? మధు వనము చొచ్చినపుడే కార్యమును సాధించియే యుందురు. సీతాదేవిం గాంచిరి. నిస్సందేహము. చూచినది హనుమం తుఁడే. వేఱొకరీకార్యమును సాధింపఁజాలరు. కార్యనిర్వ హణశక్తియు బుద్ధియు లోనగుసద్గుణము లా హనుమంతుని యందు నెలకొనియున్నవి. ఏకార్యమందు జాంబవదంగదులు నాయకు లై యుందురో హనుమ పాలకుఁడై యుండునో ఆకార్యము తప్పక సిద్ధించును. అంగదాదులు మధువనమును జీఁకాకుపఱచి రఁట వీరందఱు పోయి వారింపఁగాఁ జావదన్నిరఁట ఈవాన రుఁడు ఈవార్తఁ దెల్పుటకే వచ్చినాఁడు. మహాబాహూ! సీతాదేవిని జూచియుందురు. నీవు నీవిషయమును జక్కఁగా నాలోచింపుము. కార్యము ఫలించియుండుటంబట్టియే నిర్భ యముగా వనముం జొచ్చి మధువులాని చీఁకాకుపఱచిరి. సీతా సందర్శనము కానిచో బ్రహ్మదేవునిచే వరముగా నొసంగఁ బడిన యామధువనమును జొరఁబడరు. అనఁగా శ్రీరామ లక్ష్మణులు మిక్కిలి హర్షించిరి. సుగ్రీవుఁ డావధిముఖుం గాంచి సంతుష్టుఁడై మరల నావనపాలకులం గాంచి వానరులు కృతా ర్థులై వచ్చిరి గాన మధుపానమునకు సంతసిల్లితిని. కృత కృత్యులు గాన వారికార్యమును క్షమింపవలసినదే. కాన క్షమించితిని. వారినందఱను జూచుటకు,సీతాకుశలవార్త నా కించుటకు నేనును శ్రీరామలక్ష్మణులును గుతూహల పడు చున్నారము. అని పలికెను. కృతకృత్యుల మైతిమని యా

రామలక్ష్మణులం గాంచి సుగ్రీవుండు మితిమీఱిన యానందమును గాంచెను

మహాత్ములారా! ఇందలివిశేషముల నరయుదము. ఉపవనములగుఱించియించుక పూర్వసర్గమున వ్రాసియుంటిని. ఆవిషయమే యిందు దృఢపఱుపఁబడినది. కానఁ దద్విషయమైన వార్తనే చూపఁ గడంగెదను.

"ఉత్తిష్ఠోత్తిష్ఠ కస్మాత్త్వం పాదయోః పతితో మమ,
అభయం తే భవే ద్వీర! సర్వమేవాభిధీయతామ్." ౨

అని మూలము సుగ్రీవునకు దధిముఖుఁడు మేనమామ. వనపాలన కార్యనియుక్తుఁడు. పాదములపైఁ బడియెను గదా. "మాతులస్యాపి పాదపతనం స్వామిత్వానుసారేణ" యని గోవిందరాజులు వ్రాసిరి. కాని యది సుసంగతముగా లేదు. ఆమధువనము సుగ్రీవునకుఁ బ్రాణతుల్యము. దానిం బ్రవేశించినచో నసఁగా సెలవునొందక యిష్టమురీతిగాఁ జొచ్చిన మరణదండనమే. దానికే సుగ్రీవాజ్ఞయని పేరు. అట్టివనమును దనయాజ్ఞ నుల్లంఘించి వానరులు ప్రవేశించి చీఁకాకుపఱచి పైఁగాఁ దాను నివారింపఁబోవఁగాఁ జావఁ దన్నిపంపిరే యన్న దుఃఖముచేతను ఏల వారి నాపఁజాలక పోయితివను సుగ్రీవుఁడు దండించునో యన్నభయముచేతను గాళ్లపైఁబడి యంగలార్చెను. స్వామిత్వ మిటఁ గారణము కాదు. కనుకనే "మమ పాదయోః కస్మాత్పతిత స్త్వమ్"అని ప్రశ్నించెను ఏల నాకాళ్లపైఁ బడితివని కదా యడిగెను. అది యాచారమే యైనచో నీప్రశ్నమున కవకాశ మెక్కడిది? దీనుఁడని యెఱింగి యభయ మిచ్చితి ననియె. పూర్వకాలమునఁ దన... రి

జనులపైఁ ప్రభువుల కెంతవిశ్వాసమో ప్రభువులయెడ సేవకుల కెంత ప్రీతియో కనుఁగొనుఁడు. అది యిక్కాలమున నెంత తాఱుమాఱయ్యెనో యోజింపుఁడు. ఇట్టులుండ శాంతికి చోటు నిఘంటువే గాక వేఱొకతావు కనఁబడదు.

"నైషా మకృత కృత్యానా మీదృశ స్స్యాదుపక్రమః. ౧౫
ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః,"

అని మూలము. మధువనప్రవేశముననే కార్యసాఫల్యము నిశ్చయింపఁబడుచున్నది. లేకున్న నీప్రయత్నము సాగదని సుగ్రీవుఁ డనియె. మహాకార్యము సాధించినపుడు సేవకులొనరించునవి యపరాధములుగా నెన్నఁబడవు. అవి రాజు మన్ననకుఁ బాత్రములే యగునను టకిది యుదాహరణము. ఈయాచార మిప్పుడుకూడ యుద్ధయాత్రానంతరము సాగుచున్నది.

"వనం దత్తవరందివ్యం ధర్షయేయు ర్వనౌకసః." ౨౩

అని మూలము. సుగ్రీవునితండ్రియగు ఋక్షరజసుఁడు తపం బొనరించి వరముగా నీవనమును బడసెను. అట్టిదాని నీవానరులు పాడుచేయఁగలరా యనియె. పూర్వకాలములో శోపకారార్థము తపముచేసి భగవదనుగ్రహమున వనమును వరముగాఁ బడయువారు. వనమును నిర్మించి నా కిమ్మనియా కాదు. నాయీవనము లోకోపకార క్షమమగుఁగాక యని. ఏలయనఁగా వృక్షాధిదేవతలు సాన్నిధ్య మొసంగియుందురు. వారెల్లరు తదాశ్రయులకు బాధాపరిహారకులు గావలయునని,

"యేవృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః,"

అని శ్రుతి. రుద్రగణములలోఁ గొందఱు వృక్షములయం

దుందురు. వారి నారాధింపక యనఁగాఁ బూజింపక యా వృక్ష పదార్థములను గ్రహింపరాదని విధులు గలవు ఓషధులవిషయ మున నిట్లే యని యూహింపవలయు. ఈవిషయములు తంత్ర ములయందుఁ గనఁబడును. కావున వృక్షలతలమహాత్త్వము తదధిదేవతారాధనసిద్ధము. లేనిచో దానిఫలము విపరీత ముగా నుండుననువిషయము మన మెఱుంగందగినది.

## హనుమంతుఁడు వనచరులంగూడి వచ్చి కుశలము సీత కని తెల్పుట.

* సుగ్రీవుఁ డిట్లుపలుకఁగా దధిముఖుఁడు సంతుష్టుఁడై వారలకు నమస్కరించి వానరులం గూడి యాకాశమునకు నుద్గమించెను. త్వరితముగఁ జని నేలపై వ్రాలి వానరులం జూచి యంజలిబంధించి యంగదునితో సౌమ్యా! వీరు వారించిరని కోపగింపకుఁడు. మాయపరాధమును క్షమింపుఁడు. మీ రాక నామూలమున నాలకించి హర్షించి వనభంగమున కాగ్రహింపక వారినందఱిని జూడఁగోరుచున్నాను. వేగమ రమ్మని చెప్పుమని యాజ్ఞాపించెను. అని యాదధిముఖుఁడు చెప్పఁగానే యంగదుఁడు వానరులం జూచి మనరాక విని చూడవలయునని కుతూహలమున శ్రీరాముఁడు లున్నవారు. మనమిఁకఁ దడవు చేయుట మంచిది కాదు మీయిష్టమెట్లో యట్లే చేయఁగలవాఁడను. కార్యమును ఫలింపఁజేసివచ్చిన మిమ్ము నాజ్ఞాపించుట మర్యాదగాదు అనెను. ఆయంగదుని వినయోక్తుల కలరి యతనిం బొగడి పయనము సాగింతమనిరి.

---

* ఇది యఱువదినాల్గవసర్గమునఁ గలదు.

అంగదుఁడు సమ్మతింప నంద ఱాకసమున కెగిరిరి. వారంద ఱు తమకడఁ జేరకమునుపు సుగ్రీవుఁడు శ్రీరామునితో శ్రీరాఘవా! ఊఱడిల్లుము. నీకు మంగళమగుఁ గాక. సీతాదేవిని గాంచివచ్చినారు. నిస్సంశయము. చూడకయే యున్న గడువు దాఁటినపిదప నిచ్చటికి రాఁజాలరు. కార్యము నెఱవేఱక యున్న నంగదుఁడు నాయొద్దకు రాఁజాలఁడు. కార్యసిద్ధిచే సంతుష్టుఁడై యుండఁడే నంగదుఁడు పూర్వార్జితమగు మధు వనమును బాడుచేసియుండఁడు. సీత కుశలము తెలిసినది. నీవు కుశలివే కాన నిన్నుఁగన్న కౌసల్యయు సుపుత్రవతి యైనది. సీతను గాంచినవాఁడు హనుమంతుఁడే. మఱెవ్వఁడు సాధింప లేఁడు. నీవు చింత వదలుము. అనెను.

అంతఁ గిలకిలమని ధ్వనిచేయుచు నాకాశమునుండి సుగ్రీవునకుఁ గనఁబడిరి. దాన నాతఁ డుప్పొంగి వాలముం బెంచెను. అంత నంగదాదులు హనుమంతుని మున్నిడుకొని వచ్చిరి. సుగ్రీవునిదాపున వ్రాలిరి. హనుమంతుఁడు తలసోఁకి శ్రీరామునకు నమస్కరించి కుశలముగా నున్నది సీత యని శుభవార్తం దెల్పెను. సుగ్రీవలక్ష్మణులును సంతృప్తి నొందిరి ఆ కుశలవార్తాశ్రవణమున నానందించి శ్రీరాముఁడు హను మంతుని గారవమునఁ జూచెను.

## హనుమంతుఁడు సీతావృత్తాంతమును దెలిపి రామునకుఁ జూడామణి నొసంగుట.

* అంత హనుమంతుఁడు తక్కినవానరులంగూడి ప్రస్ర

---

* ఇది యఱువదియైదవసర్గమునఁ గల కథ.

దుందురు. వారి నారాధింపక యనఁగాఁ బూజింపక యావృక్ష పదార్థములను గ్రహింపరాదని విధులు గలవు ఓషధులవిషయ మున నిట్లే యని యూహింపవలయు. ఈవిషయములు తంత్ర ములయందుఁ గనఁబడును. కావున వృక్షలతలమహత్త్వము తదధిదేవతారాధనసిద్ధము. లేనిచో దానిఫలము విపరీత ముగా నుండుననువిషయము మన మెఱుంగందగినది.

## హనుమంతుఁడు వనచరులంగూడి వచ్చి కుశలము సీత కని తెల్పుట.

* సుగ్రీవుఁ డిట్లుపలుకఁగా దధిముఖుఁడు సంతుష్టుఁడై వారలకు నమస్కరించి వానరులం గూడి యాకాశమునకు నుద్గమించెను. త్వరితముగఁ జని నేలపై వ్రాలి వానరులం జూచి యంజలిబంధించి యంగదునితో సౌమ్యా! వీరు వారించిరని కోపగింపకుఁడు. మాయపరాధమును క్షమింపుఁడు. మీరాక నామూలమున నాలకించి హర్షించి వనభంగమున కాగ్రహింపక వారినందఱిని జూడఁగోరుచున్నాను. వేగమ రమ్మని చెప్పుమని యాజ్ఞాపించెను. అని యాదధిముఖుఁడు చెప్పఁగానే యంగదుఁడు వానరులం జూచి మనరాక విని చూడవలయునని కుతూహలమున శ్రీరామాదు లున్నవారు. మనమిఁకఁ దడవుచేయుట మంచిది కాదు. మీయిష్టమెట్లో యట్లే చేయఁగలవాఁడను. కార్యమును ఫలింపఁజేసివచ్చిన మిమ్ము నాజ్ఞాపించుట మర్యాదగాదు అనెను. ఆయంగదుని వినయోక్తుల కలరి యతనిం బొగడి పయనము సాగింతమనిరి.

---

* ఇది యఱువదినాల్గవసర్గమునఁ గలదు.

అంగదుఁడు సమ్మతింప నంద ఆకసమున కెగిరిరి. వారందఱు తమకడఁ జేరకమునుపు సుగ్రీవుఁడు శ్రీరామునితో శ్రీరాఘవా! ఊఱడిల్లుము. నీకు మంగళమగుఁ గాక. సీతాదేవిని గాంచివచ్చినారు. నిస్సంశయము. చూడకయేయున్న గడువు దాఁటినపిదప నిచ్చటికి రాఁజాలరు. కార్యము నెఱవేఱక యున్న నంగదుఁడు నాయొద్దకు రాఁజాలఁడు. కార్యసిద్ధిచే సంతుష్టుఁడై యుండఁడే నంగదుఁడు పూర్వార్జితమగు మధు వనమును బాడుచేసియుండఁడు. సీత కుశలము తెలిసినది. నీవు కుశలివే కాన నిన్నుఁగన్న కౌసల్యయు సుపుత్త్రవతి యైనది. సీతను గాంచినవాఁడు హనుమంతుఁడే. మఱెవ్వఁడు సాధింప లేఁడు. నీవు చింత వదలుము. అనెను.

అంతఁ గిలకిలమని ధ్వనిచేయుచు నాకాశమునుండి సుగ్రీవునకుఁ గనఁబడిరి. దాన నాతఁడుప్పొంగి వాలమును బెంచెను. అంత నంగదాదులు హనుమంతుని ముందిడుకొని వచ్చిరి. సుగ్రీవునిదాపున వ్రాలిరి. హనుమంతుఁడు తలవాంచి శ్రీరామునకు నమస్కరించి కుశలముగా నున్నది సీత యని శుభవార్తం దెల్పెను. సుగ్రీవలక్ష్మణులును సంతృప్తి నొందిరి ఆ కుశలవార్తాశ్రవణమున నానందించి శ్రీరాముఁడు హను మంతుని గారవమునఁ జూచెను.

{ హనుమంతుఁడు సీతావృత్తాంతమును దెలిపి రామునకుఁ జూడామణి నొసంగుట. }

* అంత హనుమంతుఁడు తక్కిన వానరులంగూడి ప్రస్ర

---

ఇది యిఱువదియైదవసర్గమునఁ గల కథ.

వణపర్వతమునకుఁ బోయి శ్రీరామలక్ష్మణులకు నమస్కరించి సీతావృత్తాంతముఁ జెప్ప నారంభించెను. వానరులు సీతా వార్తయు నామెపడుకష్టములును దెలిపిరి. వానరులనుజూచి శ్రీరాముఁడు సీత యెచ్చట నున్నది? నాయందామెమన స్సెట్లున్నది? ఆమెంగూర్చినవిషయమంతయు నాకుఁ జెప్ప వలయును. వానరు లావృత్తాంతమును దెల్పుటకు హనుమం తుని నియమించిరి. హనుమంతుఁడు సీతయుండు దిక్కు మొగంబై నమస్కరించి సీతాకుశలమును జెప్పువాఁడై యిట్లనియె.

నేను శతయోజనవిస్తారసాగరమును దాఁటితిని. దక్షిణ తీరమందు లంక యనునగరము కలదు. అందు రావణునంతః పురమునందుఁ బతివ్రతయగు సీతాదేవి కలదు. ఆమె తన కోర్కె నీయందే నిలిపి యా యాశవలననే జీవించియున్నది. ఉద్యానమున నశోకవృక్షముక్రింద రాక్షసాంగనల నడుమఁ జిక్కి సీతాదేవి వారు బెదరించుచుండఁగా వగచుచుండఁ గాంచితిని ఆసాధ్వి, దుఃఖములకుఁ దగని యాజానకి యనేక విధములగు దుఃఖముల నొందియున్నది. ఏకవేణియై నిన్నే ధ్యానించుచుఁ జెఱఁబెట్టఁబడి రేయింబగళ్లు నీయందే మనస్సు కలిగి దీనయై యున్నది. రావణుఁడు వశపఱచుకొనఁ జేసిన యత్నములు వ్యర్థములు వానిబారింబడ నిష్టపడక ప్రాణ ములవదల నిశ్చయించుకొని యున్నది. నేనెంతో ప్రయత్న మున నాసాధ్విని జూచితిని. నే నిక్ష్వాకువంశకీర్తనము గావించి నాయందు విశ్వాసము నామెకు గల్గించితిని. ఆమెతో మాటలాడి యిక్కడ జరగినదంతయుఁ జెప్పితిని.

మీఁకు సుగ్రీవునకును గల్గినస్నేహమును విని సంతోషించెను. ఆమె సదాచారము స్థిరమైనది. ఆసతీమణి యుగ్రతపము చేయుచు నీయందు మిక్కిలి భక్తిగలిగియుండఁ జూచితిని. మహాత్మా! ఆయమ మున్ను చిత్రకూటమునందు నీచెంత జరగిన యొకవాయసవృత్తాంతమును జరగినట్లే నా కానవాలుగాఁ జెప్పెను. హనుమంతా! నీవిచ్చటఁ జూచినది చూచినట్లుగానే రావణుఁడు వచ్చి మాటలాడుట మున్నగుసమాచారము సకలమును శ్రీరామునియొద్ద విన్నవింపవలయును. సుగ్రీవుఁడు వినుచుండఁగా నా చెప్పఁబోవుపలుకులను జెప్పి యింతవఱకు మహాప్రయత్నమునఁ బదిలముగాఁ గాపాడిన యీచూడామణిని శ్రీరామున కొసఁగుము. దీనిని జక్కఁగాఁ గాపాడితిని. ఒకనాఁడు నానుదుటిబొట్టు మాసిపోవఁగా నీవు మణిశిలను బొట్టుగాఁజేసి పరిహాసముకొఱకు నా చెక్కిలిపయిఁ బెట్టితివి. దానిం దలంచుకొనవలయును. సాగరమునఁ బుట్టిన యీచూడామణిని నాకొఱకుఁ బంపితివి. ఈవ్యసనమునందు నిన్నుఁ జూచినట్లే దీనిం జూచి సంతోషింతును ఇఁక నొకనెల వఱకుఁ బ్రాణములు నిలుపుకొనియుందును. అంతకుమీఁద నీ బాధలకుఁ దాళి బ్రతికియుండఁ జాలను. అని చెప్పుమనెను. ఆసాధ్వి దీనవదనయై కన్నీరుగార్చుచు నన్నుం జూచి యిట్లు తెలిపెను. శ్రీరామా! నాతో నాదేవి యెట్లు చెప్పెనో, యట్లే ఆవిషయమంతయుఁ జెప్పితిని. ఎట్లయిన నిఁక సాగరము నుత్తరించుటకై సేతుబంధనకార్యమును జూడవలయును. అని యిట్లా హనుమంతుఁడు శ్రీరామసౌమిత్రులు కొంత యూఱడిల్లి యుండుటెఱింగి సీతయిచ్చిన చూడామణిని రామున

కౌసంగి యాసాధ్వి చెప్పినయుదంతమంతయుఁ గ్రమముగా శ్రీరామునకుఁ జెప్పెను.

మహాశయులారా! ఇందలివిశేషములను బరికింతము.

"నియత స్సముదాచారో భక్తి శ్చాస్యా స్తథా త్వయి. ౧౭
ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ,"
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభః. ౧౮

అని మూలము. సీత సదాచారము నియతమైనది. సదాచారమనఁగా స్త్రీలకుఁ బరపురుషచింతాదులు లేకుండుటయే యని యేర్పడుచున్నది. ఆవిషయమునఁ బరిశుద్ధురాలైనచోఁ బతివ్రత యనఁబడును లేనిచోఁ దక్కుంగల యాచారములు స్నానజపాదులు వేలకువే లున్నను బనికిరావని యేర్పడును. నీయందు భక్తియు నట్టిదే. అనఁగా నీయందుఁ గలప్రీతియు దృఢమైనదే యని భావము. భర్తయందు దృఢానురాగము లేనిచో నెట్టియాచారములును ఫలింపవని వాల్మీకిమహర్షి భావము. పురుషునకువలె స్వేచ్ఛావర్తనము స్త్రీకి నుండవలసినదే యని యిప్పటి మహర్షులభావము. అప్పటి యిప్పటిమహర్షులకు మహాత్ములకుఁ గలభేద మేమనఁగా వారిమాట ఫలించెడిది. వీరిమాట ఫలింపనిది. భేదమీ కొంచమేగాని యింకే విషయమున భేదములేదు. వారియాశీర్వాదము శాపము ఫలించెడివి. కావుననే వారికి రక్కసులుగూడ వణఁకుచుండిరి. వీరియాశీశ్శాపములు నిరర్థకములు గాన నెవరును జంకరు, అదంతసర్వమున కెవరు భయంపడుదురు ? పేరు వీరల కిరువురకు సమానమే. ఉగ్రేణ తపసాయుక్తా త్వద్భక్త్యా చ=అని.

ఉగ్రమనఁగా భయంకరమైన. అనఁగా నిరాహారాదిరూపమైన దని భావము, అట్టితపస్సు రజస్తమోగుణప్రధానము కావా యందురు. అనఁగా నహంకారాజ్ఞానప్రధానమని వారిభావము. ఈప్రశ్నము తెలివిచాలమిఁ జేయునదియే పరాకాష్ఠ యుండ వలయునని విధికలదు. దీనికే శ్రద్ధయని పేరు. "అనన్యాశ్చింత యంతో మాం" అనఁగా నిదియే. ఇతరచింతలు లేనట్లు బుద్ధిని నిరోధించుట కదా. ఉగ్రతపస్సనఁగా నదియే. మనోనిరోధ మును శ్రద్ధపూని చేయుట యని సారము. పతిభక్తి శ్రద్ధలేని తపస్సు స్త్రీలకు నిష్ఫలమని సారము. భక్తిరవ్యభిచారిణీ= అనుదాని యర్థ మిదియే యని యెఱుంగవలయును.

"అయం చాస్మై ప్రదాతవ్యో యత్నా త్సుపరిరక్షితః,
ఏషచూడామణి శ్శ్రీమాన్ మయా సుపరిరక్షితః." ౨౦

అని మూలము. ఆభరణములన్నింటిని గిష్కింధా సమీపా రణ్యమునఁ బాఱవైచి యొకచూడామణినిమాత్రము సీత రక్షించెను. ఏలయనఁగా దానిశక్తి యామె యెఱుంగును. ఇపుడు రత్నధారణమునఁ గలుగులాభము లెవ్వి? అను దానిని విమర్శింతము.

"రత్నాలంకృతిధారణం రతికరం లక్ష్మీవిలాసాస్పదం
మాన్యం కామఫలప్రదాయి సుభగం మాంగల్యమాయుష్కరం,
ఓజఃకాంతియశఃప్రభావజనకం దోషఘ్నమత్యుజ్జ్వలం
భూతోన్మాద భయభ్రమక్షమవిషక్షీణేంద్రియత్రాపహమ్.

గ్రహప్రీతికరరత్నములు:—

ఆదిత్యస్య తు పుష్యరాగమమలం ముక్తాఫలం శీతగో
ర్మాహేయస్య తు విద్రుమం మరకతం సౌమ్యస్య గారుత్మతం,
దేవేజ్యస్య తు పుష్యరాగ మసురాచార్యస్య వజ్రం శనే
ర్నీలంనిర్మల మన్యయోస్తు కథితే గోమేధవైదూర్యకే.
మహాంబురాశౌ సరితి పర్వతే కాననేపి వా,
రత్నానామాకరం ప్రాహు స్థ్సాన మాధేయగౌరవాత్."

మునిభావ.

ప్రాయికముగా రత్నములు సకలాపత్పరిహారకరములని తేలెడిని. బృహత్సంహితయం దీవిషయము కలదు. స్కాందపురాణమున హాలాస్యమాహాత్మ్యమునందు నీవిషయము విశేషించి వ్రాయఁబడినది. ఈవిషయ మెఱింగియే సీతాదేవి చూడామణిని దాఁచియుంచుకొనెను. శ్రమములఁ దోఁపనీయదు. పరస్థానమున విషాదిబాధలు లేకుండఁ జేయుననియే యామె దాని నుంచుకొనెను. దాని నిచ్చినందున రెండునెలలకంటె నెక్కువకాలము జీవింపఁజాలనని పలికెను. ఇందు సారమేమి? నాల్గుజాతులకు రత్నములు ధార్యములు చెప్పఁబడినవి. వాని నీకాలమున వదలుట యెంతయు శోచనీయము. కృత్రిమ రత్నధారణము ఆయుస్సు నశింపఁజేయును. రత్నధారణము మానుటయే యీకాలమున నాయుస్సు నశింపఁ గారణ మయ్యెను. స్త్రీలకు ఆదిత్యాదివారములయందు ధరింపఁ దగు రత్నము లున్నవి. ధనవంతు లవ్వాని ధరింపఁజేయవలయు. స్త్రీలను బురికొలిపి యీవిషయమును దెలుపవలయును. మంచి వన్నియు మానివేయఁబడు టలవాటులలోఁ బ్రధానముగా నున్న ట్లెన్నఁదగియున్నయది.

## రాముఁడు సీతావృత్తాంతము నడుగుట.

* హనుమంతుఁ డిట్లు తెలుపఁగనే శ్రీరాముఁడు చూడామణిని వక్షమున నిడుకొని లక్ష్మణుఁడు తానును శోకించెను. మణి రత్నంబగు నా చూడారత్నమును గనుంగొని నంతనే శ్రీరాముఁడు శోకాతిరేకమున బడలుచు, నీరు కన్నులనిండం గ్రమ్మ సుగ్రీవునింగని యార్యా! మన్కుఁ గల యావు దూడనుజూడఁగనే చేఁపునట్లు ఈచూడారత్నమును గాంచినంతనే నామనస్సు కరఁగుచున్నది. వీనిని మామయైన జనకుఁడు సీత కిచ్చెను. వివాహవేళ దీనిని సీతాశీర్షమున మహా కాంతి వెలయుచుండఁగా బంధించిరి ఇది జలసంభవముగాని స్థలసంభవము కాదు. సజ్జనపూజితము. పూర్వము జనకుఁ డొకయాగము చేయఁగా నందులకు సంతృప్తినొంది యింద్రుఁడు ఈరత్నము నతనికి నిచ్చెను. సౌమ్యా! ఈచూడారత్నమును జూడఁగానే నాకు నాతండ్రి దశరథమహారాజును, జనకమహారాజును సీత తల్లిని జూచిన ట్లున్నది ఈరత్నము నాదార సీత శిరస్సునందు మిగులఁ బ్రకాశించుచుండునది కావున ఇపుడు నాకుం జూడఁగానే నాప్రియురాలే యరు దెంచినట్లు తలంచుచున్నవాఁడను. అని దుఃఖించి యంత హను మంతుని గని సౌమ్యా! దప్పిగొన్నవానిని శీతలోదకములచేఁ దడుపునట్లు సీత నన్ను తనవాక్యామృతములచేఁ దడుపుచు మఱియు నేమేమి చెప్పినది? అని యడిగి చెంతనున్న సోదరుని సౌమిత్రిని జూచి సౌమిత్రీ! సీతవచ్చుటం దిలకింపక వారి

---

* ఈయది యఱువదియాఱవసర్గమునఁ గల కథ.

నవమగు నీమాణిక్యముమాత్రము సీతలేక వచ్చుటం
చుచున్నాను గదా. ఇంతకంటె మించినదుఃఖ మేమి
దు ? సీత నెలదనుక నెట్లో బ్రదికియుండు నేని నాచెంతఁ
కాలము బ్రదికియుండఁ గలదు ఆప్రియురాలిని విడిచి
మైన నేనిఁక జీవింపఁజాలను.

అంత హనుమనితో మరల శ్రీరాముఁ డార్యా!
ప్రియసి నెచ్చోఁ జూచితివో యచ్చటికి నన్నును దీసికొని
ము. ఆమెవృత్తాంతము తెలిసినమీఁద నొకక్షణమైన నిట
డను. సీత భీరువు క్రూరరాక్షసులం గాంచి భయంపడి
ము వెలవెలఁ బాఱుచుండును. హనుమంతా! జానకి యేమి
నది. దాఁపక యన్నియు నున్న వున్నట్లు తెలుపుము.
ధముచే రోగి జీవించుచందమున సీతావచనముల నాలించి
ములతో నుందును నావియోగమున నా చెలువ వగచుచు
చెప్పినది ? దానిని దాఁపక నాకుం దెల్పుమని దీనుఁడై
ంచెను.

మహామతులారా! ఇందలివిశేషముల నెఱుంగుదము.

"మణిరత్న మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే,
వధూకాలే యథా బద్ధ మధికం మూర్ధ్ని శోభతే. ౪
అయం హి జలసంభూతో మణి స్సజ్జనపూజితః,
యజ్ఞే పరమతుష్టేన దత్త శ్శక్రేణ ధీమతా." ౫

మూలము. రత్నమనఁగా స్వజాతిశ్రేష్ఠమని యర్థము. మణి
ము మంచి జాతిమణియని భావము. వివాహకాలమున
గాఁ గన్యాదానకాలమునందు స్త్రీధనముగా జనకమహా

రాజు దీనిని కుమారికకొసంగెను. మంత్రపూతముగ నపుడే శిరమున బంధించిరి. శిరస్సునఁ బ్రకాశించెను. సీత స్త్రీరత్నము. ఇది మణిరత్నము. ఇది విశేషించి చూడామణియే. శిరోధార్యమని యర్థము. కిరీటము శిరస్సుననుంచిననే ప్రకాశించును. అట్లే శ్రేష్ఠజాతిరత్నమగు నిది శ్రేష్ఠజాతిరత్నమగు జానకి శిరస్సునొందుటం జేసి మిక్కిలి ప్రకాశించెనని భావము. ప్రకాశము గలమణి యెందుంచినను బ్రకాశింపదా యనరాదు ఆయాస్థానములయం దుండవలసినట్లు విధింపఁబడు నాభరణము లాయాయితావుల నుంచిననే ప్రకాశించును. స్థానాంతరమునఁ బ్రకాశింపవు. ఒకరత్నము సూర్యపాదములు (కిరణములు) తగిలిన మండును. అంతమాత్రము వేఁడియగు నగ్ని స్పర్శమున మండదు. ఏల? ఆరెండింటికి సంబంధము భగవన్నిర్మితము. కృత్రిమసంబంధమునఁ బ్రకాశింపవు. "స్వభావో దురతిక్రమః" అనుట విన్నారము కదా దాంపత్యముకూడ సమానవయోజాతిగుణములు కలిగినను బ్రాక్కర్మానురూపానురాగసంబంధమే లేకయున్న ననుకూలగతి వర్తింపదు. ఇద్దాని ననుభవమున నెల్లరుం దిలకించుచునే యున్నారు. అట్లే రత్నములుకూడ నని యెఱుంగవలయు. అశ్వరత్నము యోధుఁ డెక్కినపుడు సకిలించును. తనయురవడిఁ గనఁబఱచును. కేవల పౌరుషవిహీనమానవుఁడూ కూరుచున్న మూఁడుఁగాళ్ల నడుచును. ఇది యెఱుంగనివా రుండరనుకొందును. అప్రాణియగు రత్నమున కాజ్ఞానము కలదా యనుప్రశ్న మసంగతి. రత్నములందు జీవమఃఖ లనునవి గలవు అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖ సమన్వితాః = అనువానియందు రత్నములు చేర్పఁ

బడును. ప్రాణమనఁగాఁ గదలుట ధ్వనించుట మొదలగు కార్యములు చేయించు నొకశక్తి యని యర్థము చెప్పువారు కొందఱు గలరు. శక్తిమంతములని యర్థము. మణులు నాలుగు జాతులు గలవి. ఏజాతిరత్న మాజాతిమానవున కీశుభము లొసంగును. లేనిచో జాత్యంతరధారితమైన దుఃఖము లొసంగును. జీవకళయన వినమే? లతలకు నిట్లే యని యూహింపందగు. తరులతాదులు జడములనుట యజ్ఞానముచేతనే. మన దృష్టిచే నవి యట్లుండుననుకొన్న నేబాధయు నుండదు. ఈ రత్నము జలసంభవము. సాగరజలములఁ బుట్టినది. కనుక నే యుత్తమోత్తమమని భావము. కనుక నే సజ్జనపూజితః = అని. ఏల యందురా?

"యద్యద్విభూతి మత్సర్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదేవా వగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్." ౪౧

అను గీతావాక్యము కలదు. భగవత్తేజ మెక్కువగాఁ గల వస్తువంతయు సజ్జనపూజితమే. శ్రీచక్రాదులు స్వర్ణనిర్మితముల కంటె రత్ననిర్మిత ముత్తమోత్తములని విధి పొడకట్టుచున్నది. ఏల? దానియందుఁ దేజస్సెక్కువగా నున్నందునం గదా. లేక పాషాణనిర్మితమైనఁ బనికిరాదనియు నిషేధము కలదు. కావున మణులలో జీవమణులు కలవనియు నవి ధరించిన నపమృత్యువు లొనగునవి కలుగవనియు నాధివ్యాధులు నిలువవనియు మనము గ్రహించి వానిని ధరింపవలయు ననువిషయము మది నిలుపుకొనవలయును. జనకమహారాజు యజ్ఞముచేయఁగా సంతృప్తినొంది యింద్రుఁ డారత్నమును రాజున కొసంగెను. అని రామమూర్తి తెలిపెను. అందు ధీమతా = అని కలదు.

ఈరత్నము ముం దీపనికి నుడు యోగి రాముని [illegible]
యింద్రుఁ డొసంగెనని యీయది సూచించు [illegible]
నిది దేవమణి. కనుకనే జీవరత్నము. దాని [illegible]
దేవి శ్రమములు లేక పదినెల లుండఁగలి [illegible]
నుండి మనము గ్రహింపవలయు.

"నయ మామపి తం దేశం యత్ర దృష్టా మమ ప్రియా.
నతిష్ఠేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్య చ."

అని[*] మూలము. ఆంజనేయా! సీతయుండు [illegible]
గొనిపొమ్ము. ఆమె లేక ప్రవృత్తినొంది [illegible]
ననికదా శ్రీరాముఁ డనియెను. దీనిసారము! [illegible]
యనఁగా లోకానుసారివ్యాపారము. సీత [illegible]
జాలనని భావము. ప్రకృతిలేనిచో లో [illegible]
జాలను. అనఁగా నామరూపాదులు నాకు [illegible]
ప్రకృతికడకుఁ బోవలయునని సారము.

"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి.
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృత పుణ్యః ప్రభవతి."

అను శంకరభగవత్పాదాచార్యులవారివాక్యము [illegible]

( సీతావృత్తాంతమును హనుమ [illegible]
రామునకుఁ దెలుపుట. )

* మహాత్ముఁడు శ్రీరాముఁ డిట్లు ప్ర [illegible]

---

* ఇది యఱువదియేడవసర్గమునఁ గల కథ.

కుమారుఁడు సీత తెలిపినదంతయు వదలక తెలుపువాఁడై మహాత్మా! సీతాదేవి పూర్వము చిత్రకూటమున జరిగినవృత్తాంతము నున్నదున్నట్లుగా నాకుం దెలిపెను. అం దామె నిన్నుం గూడి సుఖంబుండి నిదురపోవుచుండి తా మున్ను నిదురనుండి లేచెను. అప్పు డొక కాకి యరుదెంచి యురమునడుమ గీఱినది. జానకి నీయొడినుండి లేచిన పిదప నీవు నీవంతు ప్రకార మామె తొడపయి శిరమిడి పండుకొని నిదురించితివి. మరల నాకాకము సీతను బాధింప నారంభించెను. అది మరల మరల నరుదెంచి యురమును గీఱుచుండఁగా రక్తము స్రవించి యది నిన్నుఁ దడపఁగా నీవు మేలుకాంచితివి. అది వదలిపోక బాధించుచుండఁగా నామె యద్దాని కోర్వలేక నిన్ను లేపెనుగదా? మేలుకాంచిన నీవు సీతోరస్థ్సలముం గాంచి మహాకోపమున నూర్పులు పుచ్చుచు సీతా! నీవు భీరువవు. ఎవఁడు కొనగోళ్ల నీయురమ్మును గీఱినాఁడు? ఎవఁడు రోషించియుండు పంచవక్త్రఫణితో నాడు కొనుచున్నాఁడు? అని యడిగితివి. అంత నీవు నాలుగు ప్రక్కలు కలయంజూచుచు నెత్తుటం దడిసిన గోళ్లతోనుండు నాకాకిం గాంచితివి. ఆ కాక మింద్రునికుమారుఁడఁట. పర్వత ప్రదేశములందుఁ దిరుగుచుండువాఁడఁట. వాయుగతి గలవాఁడఁట. దానిని మహాపరాధము గావించుటంజేసి వధింపం దలంపుగొని కూరుచున్న దర్భాసనమునుండి యొకపోఁచను దీసి దానిని బ్రహ్మాస్త్రమంత్రమున నభిమంత్రించి వైచితివి. అది మండుచు వెంటఁబడఁగా నది పరుగిడఁగాఁ దల్లిదండ్రులు లోనగువా రాపఁజాలక వదలిరి. మూఁడులోకములు తిరిగి మరలివచ్చి నిన్నే శరణుసొచ్చెను. అపరాధి యని కోపింపక

కృపచేఁ గాచితివి. బ్రహ్మాస్త్ర మమోఘము గానఁ [illegible] కన్నును దాని కిచ్చి యది పోయెను. అట్టి మహాస్త్రవిద్యాదక్షుఁడగు రాముఁడేల రాక్షసులపై నస్త్రమును వదలకున్నాఁడని యడిగెను. సోదరు లిరువురు మీ రేల రక్షింపకున్నారని చింతించెను. సమర్థులగు వా రూరకుండుటంజూడ నేనేదో మహాపాపము చేసియుందు నన్నది. ఆమె యిట్లు పలికి కన్నీరు విడువఁగా నేను నీవార్తఁ జక్కఁగాఁ దెల్పితిని. వారు శీఘ్రమ వత్తురనియు నీదుఃఖము తొలఁగింతురనియు నొక్కి చెప్పితిని. శ్రీరామున కానందమునుగలిగించు నానవా లిమ్మని యడిగితిని. ఆసాధ్వి శిరస్సున నున్నదీనిం దీసియిచ్చెను ఆమెకు నమస్కరించి రాఁదలంచితిని. ఆమె కన్నీరుగారు హనుమంతా! శ్రీరామలక్ష్మణు సుగ్రీవులకుశల మడిగితినని చెప్పుము. తక్కినపూజ్యులనందఱ నడిగితినని చెప్పుము. ఇచ్చటి వార్తలనన్నింటిని వదలక వినిపింపుము అనియెను. ఆసాధ్వి నీధ్యానమునఁ గుశలముగానున్నదని నమ్ముమని తెలిపెను.

## హనుమ శ్రీరామునకు సీతవృత్తాంతమును దెల్పుట.

* మహాత్మా! నేను బ్రయాణమునేయ నాతురపడుటం గాంచి నాయందు విశ్వాసమున నిట్లు తెల్పెను. శ్రీరాముఁడు శీఘ్రమ రావణుని జంపి నన్నుఁ దోడుకొనిపోవునట్లు చేయవలయును. నీవుందువే నొక్కదిన ముండుము. రహస్యప్రదేశముననుండి రేపు పోవుదువుగాక. నీవిందుండుదువేని నాకింత

* ఇది యరువదెనిమిదవసర్గమునఁ గల కథ.

యూఱట గలిగియుందును. నీవు తరలిపోఁగా నాప్రాణములు పోయినను బోవచ్చును. శ్రీరామవియోగశోకమున నలఁగి యున్న నేను నీయదర్శనమున మఱియు సంతాపమందుదును. వానరోత్తమా! నీవు సమర్థుఁడవనియే నమ్మితిని. నీసహాయులగు భల్లూకవానరములం గుఱించి నాకు సంశయము గలుగుచున్నది. దుష్పారమగు సాగరమును వారెట్లు దాఁటుదురు? శ్రీరామలక్ష్మణులు నెట్లు దాని నుత్తరింతురు? గరుత్మద్వాయువులకు నీకు నీమూవురకే దీనిం దాఁటుశక్తి కలదు. ఇతరులకు లేదు. ఈకార్యమును సాధింప నీకేమియుపాయము తోఁచుచున్నది? అద్దానిం దెలుపుము. ఈకార్యము నీవొక్కఁడవే సాధింపఁ గలవు. కాని యది నీకు శ్రేయస్కరమేగాని శ్రీరామునకుఁ గాదు. శ్రీరాముఁడు సేనలం గూడివచ్చి యుద్ధమున రావణుం జంపి నన్నుఁ గొనిపోవునే నది నాకును శ్రీరామునకును యశస్కరముగా నుండును. రావణుఁ డడవినున్న నన్ను దొంగతనముగాఁ దెచ్చినట్లు శ్రీరామమూర్తి నన్ను రహస్యముగాఁ గొనిపోవునేని యది యెంతమాత్రము దగియుండునని కాదు. పగవారిం దునిమి నన్నుఁ గొనిపోవుటయే యామహాత్మునకుఁ దగియుండును. కావున శ్రీరామున కనురూపముగా నుండులాగునఁ గార్యము నీవే కూర్పుము.

ఇట్లాసాధ్వి పలుకఁగా సహేతుకములగు నాపలుకులు విని తగినట్లు బదులు చెప్పువాఁడనై తల్లీ! సకలభల్లూకవానరపతి సుగ్రీవుఁ డీకార్యమును సాధింప నిశ్చయించియున్నాఁడు. పరాక్రమవంతులు వేగవంతులు మనస్సంకల్పములవలె వేగముగా పోవఁగలవానరు లనేకు లాసుగ్రీవునికడ నున్నారు.

వానరులు భూమ్యాకాశపాతాళములయందుఁ బోవఁగలుగు దురు. నాకంటె బలవంతులు నాకు సమానులు పెక్కండ్రు గలరు. నాకుఁ దక్కువవాఁడు. లేఁడు. నేనే వచ్చితినే. ఇఁక వారి మాట వచింపనేల ? ఎవరైనను దూతను గొప్పవారిని బంపరు. తక్కువవారినే పంపుదురు. కాన నాకంటె నెక్కువవా రున్నట్లు నమ్మి పరితాప ముడుగుము. శ్రీరామలక్ష్మణులు తప్పక రాఁ గలరు. లంకాద్వారముకడ మహావీరుల నీవు చూడఁగలవు. లంకానగరమున నెల్లయెడల వానరుల సింహనాదములను వినఁగలవు. ఇఁక శ్రీరాముఁడు శత్రువధము గావించి నిన్నుం దోడ్కొనిపోయి యయోధ్యయందుఁ బట్టాభిషిక్తుఁడు కాఁగా జూడఁగలవు. అని గట్టిగాఁ బలికితిని. నాపలుకులను విశ్వసించి యించుకయూఱటఁ గాంచినదయ్యె.

మహాశయులారా ! ఈభాగమున విశేషములు లేవు. ఈవఱకు విమర్శించినవే కాని క్రొత్తవి కావు. కాని యీ కాండమును బఠించునపుడు రావణాసురుని యాశయమును, సీతాహాకారమును ముఖ్యముగాఁ గనుఁగొనవలయును. రావణాసురుఁడు కామపరవశుఁ డనునూహ గలవారమే యైన నీ కాండమును బఠించుట వ్యర్థమే యగును. నాయెఱింగిన విశేషములను గొన్నింటిని వ్రాసితిని. పాఠకమహాశయు లింకను బహువిధవిశేషమువలను గనుఁగొని యాయర్థములను మన స్సునఁ బదిలపఱచుకొని యీకాండమును బఠింపవలయును. రామాయణమునందెల్ల నీసుందరకాండమే పారాయణాదు లచే సుప్రసిద్ధిని గాంచినది. కార్యార్థులిద్దానిని బహుభేదము లగునియమములఁ బారాయణము చేయుదురు. కొందఱు సప్త

సర్గపారాయణనియమ మూనుదురు. ఆనియమమునకుఁ దోఁడు మిరియములు నైవేద్యమిడి పారాయణము చేయుదురు. దానఁ దీవ్రముగాఁ గార్యము ఫలించునని వారియాశయము. ఫలము భాగ్యానుసారము. ఈకాండమును శత్రుసంహారార్థము పారాయణము చేయుదురు. ప్రతిశ్లోకమును జదివి దానికంటె వేఱొకమంత్రమును బఠించి మరలఁ దరువాతి శ్లోకము పఠింతురు. ప్రతిశ్లోకమునకు నామంత్రము అనుబంధముగా నుండును. ఉత్తమచరితమును బఠించుచు నద్దాని మూలమున సీతారాములయు హనుమంతునియు దయను సంపాదింపఁ బ్రయత్నింపవలయునే గాని పరాపకారమును గోరినచో వారికెట్టిఫలము గలుగునో వచింప నలవికాదు. భగవత్కైంకర్యమునఁ బరహింసాదులు రూపుమాయవలయును గాని యవి పెంపొందరాదు. ఆయారాధనము సత్ఫలము నీఁజాలదు.

ఈకాండము సీతాదేవి మహాప్రకృతి యనియు శ్రీరాముఁడు పరమాత్మ యనియుఁ దేటపఱచును. రావణుఁడు మహాభక్తుఁ డనియు సీతానయనము స్వశాపనివృత్తికొఱకనియు సీతాదేవిని జననిగా నతఁడు భావించువాఁడనియు నామెయెడఁ గనఁబఱచు కోపాదులన్నియు లోకవంచనార్థమే యనియుఁ దేటపఱచును. విశేషించి హనుమదాశయమును అతని దృఢభక్తిని వెల్లడించును. సుందరకాండమును బారాయణము చేయువారు సుందర హనుమన్మంత్రమును జపింపవలయును. అపుడే యాపారాయణము శీఘ్రఫలద మగును. హనుమచ్చరిత్రము నిందుఁ జక్కఁగాఁ బఠించితిమి. ఆతనికా సీతారాముల

యెడనుండి భక్తియెట్టిదో పరిశీలింపవలయును. అట్టిదృఢభక్తి మన మిష్టదేవతయందుఁ గలవారము కావలయును. ఇచ్చో హనుమన్మంత్రవిషయ మించుక వ్రాసెదను. అది యనవసరము కాదు. హనుమంతుఁ డనేకావతారము లెత్తినట్లు కొన్ని చరిత్రములు కలవు అందు రెండింటి నాయెఱింగినవానినుండి యిట నుదహరింతును.

ఎన్నియోమంత్రము లున్నవి. ఒక్కదేవతనుగుఱించియే యుపాసింప నవస్థాభేదములను బురస్కరించుకొని పెక్కుమంత్రము లున్నవి. రామాదులవిషయము సర్వజనవిదితమగు కొందఱు. సీతారామ, కోదండరామ, పట్టాభిరామ, వీరరామ, భక్తరామ, వరద, రామాదిమంత్రము లాయవతారావస్థాభేదముల ననుసరించి యుపాసకులకార్యార్థమై మహార్షులచే విరచింపఁబడియున్నవి. అందు హనుమంతున కగ్రస్థాన మిచ్చితీఱవలయును. భక్తుల వాంఛాభేదముల ననుసరించి హనుమన్మంత్రము లుండినట్లేవియుఁ గానరావు. సుమారు పదాఱువేల మంత్రము లున్నయట్లు వినికి. ఇది యతిశయోక్తి యనువారు తత్స్వరూప మెఱుంగనివారే యనవచ్చును. వాంఛ లెన్ని యుండునా యని యామంత్రనామముల విన్నంతనే యచ్చెరువు పడుదుము. అనేకరోగముల నివారించుటకై హనుమన్మంత్రము లున్నవి. ఒక్కదేవత కిన్నిమంత్రము లుండుటచ్చెరువుగా నుండకపోదు ఏలయనఁగా. రామకృష్ణాద్యవతారములు నామమాత్రములుగ నున్నవి. అనఁగా నాయాకార్యములు ముగిసినవెనుక నాయంశము మూలమునందుఁ గలిసినదని భావము. భక్తుఁడు శ్రీరాము నుపాసించిన

దద్ధ్యానబలమున నాభగవత్కళేబరము సంగీంరించి యత నికిం బ్రత్యక్షము కావలయును. అందులకే చాలకాలము పట్టు నందురు. అది యంతగాఁ బాటింపఁ దగినమాట గాదందము. కాని యదియుక్తికనురూపమైనదిగా నున్నది. హనుమంతుఁ డట్లుగాక యిపుడున్నవాఁడు. తక్కినదేవతలకంటె వేగము ప్రత్యక్షమగునని యా మహర్షియాశయము. ఇది పామరులకు విశ్వాసమును జక్కఁగాఁ గల్గింపఁగల్గుటంజేసి మంత్రశాస్త్రము తదర్థమై యేర్పడినది గాన నద్దాని మనము సంగీకరింపవలసి నదియే. అనేకులు హనుమద్భక్తులు గలరు. వింధ్యోత్తరభాగ మునందును బాంచాలదేశమున నిప్పటికి ననేకులు గలరని నేనే యనుభవమునఁ జెప్పఁగలుగుదును. వింధ్యదక్షిణభాగము నందును గలరుగాని వీ రుపాసకులు గారు. తన్మూలమునఁ బెక్కండ్రు జీవించువారు. పిశాచోచ్చాటనాద్యల్పకార్యము లకుఁ బనికివచ్చునని జపము చేయువారు. వేయింట నొక్క రుండురా లేరా భక్తులని సంశయము గలుగకమానదు. అందును నైవేద్యప్రియులే పెక్కండ్రు. మంత్రజపపరా యణులసంఖ్య పరమాణుతుల్యము. పరమదాంభికులు. హిమా లయప్రాంతమున నుండువా రట్టివారు గాక నిరంతరోపాసనా సక్తులు. నీచకార్యముల కామంత్రము నుపయోగింపక "మన నా త్త్రాయత ఇతి మంత్ర"మ్మను వ్యుత్పత్తి నెదనమ్మి తారకమే యామంత్రమని నమ్మి యారాధించువారు. కావున హనుమ ద్భక్తవర్యు లందే పెక్కండ్రుగలరని నావిశ్వాసము. కావున సుందరకాండమున హనుమదుపాసనాసక్తిని గలిగించు టుచి

తము గాన రెండుమంత్రములకుఁ గల కథల వ్రాసి తత్పద్ధతిని దెలిపెను.

ఉపాసకులకుఁ దద్దేవతామాహాత్మ్యము దెలియవలయు నని స్తుతులు చెప్పఁబడినవి. కవచమని మాలమని పంజరమని హృదయమని కొన్ని భేదము లందుఁ గలవు. ఇవన్నియు న్యాస ఖండాంతర్ఖ్యాతములు. పంజర మాత్మరక్షార్థ మేర్పడినది. తక్కినవి మూఁడును బైదానికిగా నేర్పడినవియే. సహస్ర నామాదికములు కేవల తచ్చరిత్రామాహాత్మ్యాదిప్రకటనార్థ మేర్పడినవి. అం దొకదానింబట్టి యీకథ వ్రాయుచున్నాను. ఒకభక్తుఁడు హనుమంతు నుపాసించుచుఁ దదనుగ్రహపాత్రుఁ డయ్యెనఁట. ముందుఁదోఁచిన హనుమంఁ గాంచి కన్నీరు వదలె నఁట. వత్సా! ఏల దుఃఖించెదవు? వర మీయవచ్చితినని హనుమ యడిగెనఁట నాకోరిక యీడేర్పుమని పాదములపై వ్రాలఁగా నతఁడు పరిశుద్ధాంతఃకరణుఁడని యెఱింగినవాఁడు గాన నట్లే ఫలింపఁజేసెదనని వాగ్దానము చేసెనఁట. ఆతఁడు కరయుగము జోడించి నిలిచి భార్యాయుతునిగా నిన్నుఁ జూడఁగోరెదనని వేఁడెనఁట. నవ్వి నాయనా! యట్లే కానిమ్ము. శ్రీసీతారామ చంద్రానుగ్రహమున నవతారముల నొందుశక్తి కలదు. మఱియు నాకొఱకు నొకవానరకాంత సువర్చల యనునది తపముచేయుచున్నది. ఆకన్యకను వివాహమాడ నవతారాంత రము నంగీకరింతును. ఈరూపమున బ్రహ్మచారినే. అని యతని కభయమిచ్చి దివ్యసుందరాకారమున నవతరించి యాసువ ర్చలం బెండ్లియాడి యామెతో నాభక్తునికడ కేతెంచి నేత్ర

పర్వ మొనర్చెనఁట. సువర్చలాహనుమన్మంత్రమే నాఁటంగోలె మంత్రరాజమని పేరఁ బరఁగుచున్నది.

ఒకముని హనుమంతు నుపాసించుచు నంగవికార మేల కలిగెనో యిట్టిమహాత్మునకని వగవసాగెనఁట. బ్రహ్మ క్రూరుఁడని, సకలాస్త్రములఁ జావకయుండ వరమిచ్చినపుడు హనువక్రత యేల పోఁగొట్టరాదని నిందింపసాగెనఁట. ఈరెండును బాపకరములు గాక యతనికిఁ గలభక్తివిశేషమును సూచించునవియే కావున హనుమంతుఁ డాతనికి మనస్సంతోషమును గలిగింప నెంచి దివ్యసుందరవిగ్రహమునఁ బొడసూపెనఁట. ఆతఁ డత్యంత సంతోషాక్రాంతస్వాంతుఁడై సుందరహనుమన్మంత్ర మనుదాని నుద్ధరించి తన కొసంగుమనియు దాని నుపాసించువారికి శీఘ్రమే మంత్రసిద్ధి యగునట్లు వర మిమ్మనియుఁ బ్రార్థింప నట్లే వాంఛను బూరించిపోయెనఁట. సుందరహనుమన్మంత్రమును జపించుచు దాని కంగముగా నీసుందరకాండమును బారాయణము చేసిన వాంఛాఫలసిద్ధి యగుననియుఁ జెప్పుదురు. ఈరెండు నొక స్తుతియందు సూచింపఁబడి యున్నవి. కావున నుపాసకుల కివి విశ్వాసపాత్రములే యగునని నమ్మెదను. సుందరకాండము హనుమత్ప్రభావబోధకమనుట నిస్సంశయము. కావున సుందరహనుమన్మంత్రము జపించుచు దీనిని బారాయణముచేయు టుత్తమమనుట నిర్వివాదాంశము. రామాయణ పారాయణముచేయుభక్తులీవిషయమును జక్కఁగా నెఱుంగవలయును. "అవిధినాకృత మకృత మ్మనున్యాయము ననుసరించి విధిమంతముగాఁ జేయుటయే" సర్వోత్తమము.

"య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్."

అను గీతావాక్యము ననుసరించి శాస్త్రహితమగుకార్యమే సత్ఫలదమని భగవంతు నాశయము. ఏలయనఁగా శాస్త్రము మానవకల్పితమే యందము. శాస్త్రకర్తలు మహర్షులు. త్రికాలజ్ఞానసంపన్నులు. కావున వారుపడిన శ్రమ మంతయు ననుభవమున వెల్లడించుటయే శాస్త్రము. అట్టివారిమాటలే మంత్రములు. వాని ననుసరించినఁ దరణోపాయము దొరకుట సులభము. ప్రతిమానవుఁడు బుద్ధిబలమున నాలోచించి మంచిదని తోఁచినదానినిఁ జేయవలయును. అని తెలుపుచు మహాత్ములవలెఁ దిరుగుచుందురు. అది కేవల మనుచితము. సద్వాంఛ గలుగునప్పటికే కొంతయాయుస్సు గతించు. వాని ననుభవమునఁ దెలిసికొనునప్పటికి ముందే మృతి సంభవించు. కావున వాఁడెటుఁగు టెప్పుడు? దానఁ గృతార్థుఁడగు టెప్పుడు? ప్రతి మానవునిగతి యిట్టులైన నిఁక సంసారసాగరమునుండి తరించువారే యుండరని నా నమ్మకము శాస్త్రము నెఱింగి పెద్దలు చెప్పినదానిని నమ్మి దాని ననుభవమున దృఢపఱచుకొనవలెను. ఇదియే స్వానుభవమనఁగా నర్థము. ఇతరసహాయము లేక తన యంతన తానే సకలవిషయము లెఱింగి కృతార్థుఁ డగుట యవతారపురుషుఁ డగువానికి శక్యమగునేమో కాని యితరుల కశక్యము. కావున వంచకులగు కపటదాసులు లోనగువారి మాటలకు బేలుపోక సజ్జనుల హితోపదేశమునకుఁ బాత్రులగు టుత్తమమార్గము.

సుందర హనుమదుపాసననుగుఱించి యించుక వ్రాసెదను. సుందర హనుమంతుఁ డనఁగా సుందరాకారముగల వాయుపుత్త్రుఁడని యర్థము. హనుమచ్ఛబ్దార్థమే ప్రపంచమునందు విగ్రహములయందుఁ గనుపట్టెడుఁ గదా యందు రేమో చేమోడ్చు గీలించుచు శ్రీరామభక్తిఁ బ్రకటించు మారుతి విగ్రహములు క్వాచిత్కముగాఁ గనఁబడుచున్నవి. ప్రసన్న హనుమంతుఁడని యావిగ్రహమునకుఁ బేరు. మఱియుఁ గొన్ని తావులమాత్రము సుందరమారుతి విగ్రహము. దృష్టిగోచరమగును. దానికిఁ బ్రసన్నహనుమంతుఁడనియే పేరు వాడఁబడుచున్నది. దానిని మదినిల్పుకొని ధ్యానింపవలయును. ఈ యుపాసకునకు నియతి మెండు. బ్రహ్మచర్య మనుష్ఠేయము. మండలమైన దీక్షఁబూని యొకలక్షజపము చేయవలయు. తద్దశాంశము హోమము. దాని పదియవభాగము క్షీరతర్పణము. దాని పదియవవంతు శుద్ధజలమార్జనము. దాని పదియవవంతు బ్రాహ్మణభోజనము. పదివేలుహోమము వేయితర్పణము. నూఱుమార్జనము పదుగురకు భోజనము. ఇంతదనుక దీక్ష. అధశ్శయ్య. ఏకభుక్తము. అనఁగా దివాభోజనము లేదు. రాత్రియే భుక్తి. ఇంతమాత్రము జపసిద్ధి యగునా? అన్నను నన వలనుపడదు. అది యతని దృఢభక్తిపై నాధారపడి యుండును. ప్రత్యక్షము కాలేదని వదలరాదు. నిరంతరకృషి చేయవలయు. దురాలోచనలచే మనస్సు దుర్వాక్యములచే వాక్కు దుష్కార్యకరణమున దేహము కాలియుండఁగా ననఁగా నపవిత్రమైయుండఁగా మంత్రసిద్ధి యెట్లని పార్వతికి శివుఁడుపదేశించెను. అనఁగా త్రికరణశుద్ధి జపమునకు ముఖ్య

మని తాత్పర్యము. అది కలుగఁదగిన ప్రయత్న మొనరింపవల యును. అదియే జపసిద్ధికి ప్రధానాంగమని సారము. నిస్సార మైనచో భూమికూడ ఫలింపదుకదా. హృదయక్షేత్రముకూడ నిస్సారము కాఁగూడదు. సారవంతమే కావలెను. అనఁగా దృఢభక్తికలది కావలయునని దీనిరహస్యము. సద్గురువునాశ్ర యించి సుందర హనుమన్మంత్రమును గ్రహింపవలయును. సద్గురు వనఁగా శిష్యక్షేమాకాంక్షి. ధనాకాంక్షి కారాదు. నిర్మలాంతఃకరణుఁడు హనుమద్భక్తుఁడు కావలయును. అట్టి వారికడ నుపదేశము నొంది విధి నతిక్రమింపక జపింపవల యును. శ్రీరామమంత్రజపముకూడ ననుబంధముగాఁ జేయ వలయునని పెద్దల యాశయము. అట్లు జపించుచు మధ్యా హ్నము దాఁటినవెనుక జపముఁ చేయరాదు కనుక నపుడు సుందరకాండమును పారాయణము చేయవలయును. ఈ కారణముననే

"ప్రాత ర్ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగతః,
రాత్రౌ చోరప్రసంగేన కాలో గచ్ఛతి ధీమతామ్."

అనుసూక్తి కలిగినది. మధ్యాహ్నకాలము రామాయణపారా యణమున కర్హమని తాత్పర్యము. తక్కినకాలములలోఁ బారాయణము చేయరాదని కాదు. అది ముఖ్యకాలమని తాత్పర్యము. జపానంతరము పారాయణము ముఖ్యమని యాశయము. ఈరీతిగా జపింపవలయును. ఇదియే తదుపాసనా క్రమము. హనుమంతు నారాధనము భక్తిప్రదము భక్తి ముక్తిప్రదము. ఇంతకంటెఁ గోరఁదగిన దేమున్నది? కాఁబట్టి సుందరహనుమదుపాసకులమై సుందరకాండము పారాయణము

చేయవలయును. శ్రీరామభక్తి పరిపూర్ణులమైనచో హనుమ
దనుగ్రహము వేగమ కలుగును.

"యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిం,"
అన్నసూక్తియే మనకుఁ బ్రమాణము. "రాజాశ్రయణాత్ప్రకృతీ నామాశ్రయణమ్" అన్నసూక్తి ననుసరించిన నది యే సిద్ధాంత మగును. భక్తి రవ్యభిచారిణీ=అన్నన్యాయము ననుసరించి నిరంతరముగ భగవంతుఁడగు శ్రీరామునందు నెల కొలిపి వర్తించుట శ్రేయోదాయకము. కలికాలమున భగవదారాధనమునకంటె ముఖ్యవ్రతములు వేఱొండు లేవు. భయమునఁ గాక పారమార్థికబుద్ధిచే నద్దాని నొనరించినఁగాని తరణోపాయము వేఱుగా లేదు. ఉపాసన కనర్హమగు నిక్కలికాలమున భగవన్నుతికంటె మంచిసాధనము తరణోపాయము నకు వేఱొకఁడు గానరాదు. అనుతికిఁ బ్రధానము సమాహితచిత్తత్వము. దాని కాధారము సత్కర్మానుష్ఠానము. అన్నింటికిమూలము సత్కర్మానుష్ఠానమని తేలెడిని. దానికి ముఖ్యఫలాభిసంధిరహితత్త్వము. ఇట్టులుండుటంబట్టి వర్ణములకు విధింపఁబడినకర్మముల నాచరించుచు వానిని భగవత్పాదార్పణము చేయుచుఁ దన్మహిమమును దెలిసికొనుచు దానినే చింతించుచుఁ దరణోపాయము ననుగ్రహింపుమా యని భగవంతునే యాచించుచు

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్."

అన్న భగవత్ప్రతిజ్ఞచే సర్వదా సంస్మరించుచు

"యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః."

అన్న శ్రీకృష్ణపరమాత్మాశయము ననుసరింప నిశ్చయించుచు,

"యేఽ ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ! యజం త్యవిధిపూర్వకం."

అను నీపరమేశ్వరు నుపదేశము నెఱుంగుచు,

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్."

అను రాధామాధవు వాగమృతమున మునుంగుచు

"స్వభావజేన కౌంతేయ! నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్.
ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయం త్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్."

అన్న శ్రీకృష్ణపరబ్రహ్మ కరుణారసభరితవాగ్వితతి నూంతగాఁ గైకొనుచు మనము వర్తింపవలయును. ఈవిషయమును మఱువరాదు. ఇంతకంటె నిక్కాలమునఁ గా దేకాలముననైన మంచి మార్గము లేదు. ఇఁక నీప్రకరణమును ముగించుచు శ్రీరామ పరబ్రహ్మమును ధ్యానింపఁ బూనుదము.

"జయ జయ వరశంఖ శ్రీగదాచక్రధారిన్
జయ జయ నిజదాస ప్రార్థితార్థప్రదాయిన్
త్రిభువనమయ సర్వప్రాణిభావజ్ఞ విష్ణో
శరణ ముపగతోఽహం త్వాం శరణ్యం వరేణ్యమ్.

రామేతి వర్ణద్వయ మాదరేణ సదా స్మరన్ ముక్తి ముపైతి జంతుః,
కలౌ యుగే కల్మషమానుషాణా మన్యత్ర ధర్మే ఖలు నాధికారః.

ఏతౌ తౌ దశకంఠకంఠకదళీకాంతారకాంతిచ్ఛిదౌ
వైదేహీకుచకుంభకుంకుమలసత్పంకారుణాలంకృతౌ
విశ్వత్రాణనిదానసాధుసవనప్రారంభయూపౌ భుజౌ
దేయాస్తా మురువిక్రమౌ రఘుపతేః శ్రేయాంసి భూయాంసి నః.

శ్రీరామకర్ణామృతము.

నిజభక్తవాంఛాసిద్ధిదమను పదియవప్రకరణము
సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1938.—1000.